# జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన

దార్ల వెంకటేశ్వర రావు



# జ్ఞానానంద కవి ఆమ్రపాలి పరిశీలన

(ఎం.ఫిల్. పరిశోధన వ్యాసం - 1998)


దార్ల వెంకటేశ్వరరావు

ఎం.ఏ., ఎం.ఫిల్.,



ప్రచురణ

జ్యోత్స్న కళాపీఠం

హైదరాబాద్ - 44

# GNANANANDA KAVI AAMRAPAALI PARISEELANA

(M.Phil Dissertation - 1998)

By **DARLA VENKATESWARA RAO ~~M.A.~~, M.Phil.**

First Edition : 1999

Copies 1000

Price Rs **45/-**

*For Copies :*
***Sri V.V. Ramana***
Jyothsna Kalapeetham
Sri Sai Krupa Apts. Plot 101,
Ramnagar Gundu, Hyderabad
Ph 7645017

***Darla Venkateswara Rao***
Cheyyeru Agraharam,
Via : Anathavaram
East Godavari Dist - 533 222

***Darla Venkateswara Rao***
Research Scholar,
NRS Hostel J-102,
University of Hyderabad
Hyderabad - 46.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు వారి
ఆర్థిక సహాయంతో ముద్రితం

Cover : ***Sheela Veerraju***

*Pinted at :*
***Sai Graphics***
204, Kubera Towers, Narayanaguda,
Hyderabad -29. Ph . 3221260



# కృతజ్ఞతలు

పరిశోధనకు అవకాశం కల్పించిన తెలుగు శాఖ, హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం వారికి,

నేను ఈ విశ్వవిద్యాలయంలో చేరిన నాటినుండీ మాతృవాత్సల్యంతో నన్ను ఎంతగానో ఆదరిస్తూ, నా పరిశోధనకు సూపర్ వైజర్‌గా వ్యవహరించి తమ విలువైన సమయాన్ని కేటాయించి. పరిశోధన త్వరితగతిని పూర్తి . కావడానికి సహకరించి, గ్రంథ ప్రచురణకు కూడా చేయూతనిచ్చి 'ఆశీస్సుల' ను అందించిన, నాకు మాతృ సమానురాలైన కేంద్రీయ విశ్వవిద్యాలయ అధ్యాపకురాలు డా. ఎస్. శరత్ జ్యోత్స్నారాణి గారికి.

వయోభారం మీద పడుతున్నప్పటికీ నాకు కావలసిన విషయ సామగ్రిని అందించి పరిశోధనకు అవసరమైన విషయాలను ఓపికతో చర్చించి సహకరించిన ప్రముఖ కవి డా. యస్.టి. జ్ఞానానందకవిగారికి,

నా విద్యాభ్యాసాన్ని వారి విద్యాభ్యాసంగానే భావిస్తూ ఓపికతో నన్ను చదివిస్తున్న నా తల్లి దండ్రులు పెదనాగమ్మ, లంకయ్య ( అబ్బాయిగారు) గార్లకూ

సాహిత్యం పట్ల ఆసక్తిని కల్గిస్తూ ప్రోత్సహిస్తున్న తెలుగు శాఖ అధ్యక్షులు ఆచార్య కె.కె. రంగనాథాచార్యుల గారికి

నాగార్జున విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య గుజ్జర్ల మూడి కృపాచారిగారికి

నా పరిశోధనకు ఉపయోగపడే కొన్ని సూచనలు చేసి 'పరితోషము' తో ఆశీస్సులు అందించిన ఆంధ్రవిశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి,

సాహిత్యం, పరిశోధనల పట్ల ఆసక్తిని కలిగిస్తూ 'సహృదయామోదం'తో ఆశీస్సులు అందించిన యస్. కె. బి.ఆర్. కళాశాల లోని మా గురువుగారు డా. వాడపల్లి చక్రపాణిరావు గారికి కళాశాల అధ్యాపకులు డా. ద్వా.నా. శాస్త్రి. గారు డా. బి.వి. రమణమూర్తి గారు, శ్రీ పి.జె. వెస్లే గారు శ్రీ టి.ఎస్.రాజేష్ గార్లకు, అప్పటి ప్రిన్సిపాల్ శ్రీ మంథా సాంబశివశాస్త్రి గారికి, తెలుగు విశ్వవిద్యాలయానికి చెందిన డా॥సి.చంద్రశేఖర్‌గారికి, విషయ సేకరణలో సహకరించిన డా.పొన్నెకంటి హనుమంత రావుగారికి ,

నా అభివృద్ధిని ఆకాంక్షిస్తూ ఈ గ్రంథ ప్రచురణకు కృషిచేసిన సహృదయశీలి శ్రీ వి.వి రమణ గారికి, రాతప్రతిని సిద్ధం చేసేటప్పుడు సహకరించిన కుమారి వి. సుదీప్తి, కుమారి సుష్మ గార్లకు..

నేను చదువుకోవడానికి అన్ని విధాల సహకరిస్తున్న అన్నయ్యలు శామ్యూల్ రాజు. సత్యనారాయణ గార్లకు, నన్ను తమ్ముడిలా చూసుకొంటున్న వదినలు మేరీ సుగుణ, భారతి గార్లకు..

పరిశోధన చేసేటప్పుడు విషయాన్ని చర్చించడంలోను, రాతప్రతిని సిద్ధం చేయడంలోను సహకరించిన మా చెల్లెలు దార్ల విజయకుమారి (ఎం.ఏ. తెలుగు పండిట్. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల చెయ్యేరు.)కి, అన్ని విధాలా సహకరిస్తున్న తమ్ముడు దార్ల రవికుమార్ (ఎం.ఏ తెలుగు)లకు..

నా ఎం.ఫిల్ పరిశోధన వ్యాసానికి పరీక్షాధికారిణిగా వ్యవహరించి మంచి రిపోర్ట్ పంపించిన ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన తెలుగు రీడర్.డా.కె. కుసుమాబాయి గారికి..

ఈ గ్రంథాన్ని ఆవిష్కరించడానికి పెద్ద మనస్సుతో అంగీకరించిన జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత రాజ్యసభ సభ్యులు ఆచార్య సి.నారాయణ రెడ్డిగారికి,

సవరించిన మార్పులను ఎంతో ఓపికతో చేస్తూ గ్రంథాన్ని సకాలంలో ముద్రించి ఇచ్చిన సాయిగ్రాఫిక్స్ అధినేత వెంకట్ గారికి, మిత్రులు మల్లికార్జున్, గోపి, సత్యంగార్లకు, ముఖచిత్రాన్ని వేసిన కవి, చిత్రకారులు శ్రీ శీలావీర్రాజు గారికి...

నా రచనలను ప్రోత్సహిస్తున్న పత్రికాధిపతులకు, ఆంధ్రభూమి సబ్-ఎడిటర్లు, ఎం.డి. అబ్దుల్, అఫ్సర్, పసేరా, మధుగార్లకూ...

మా తెలుగు శాఖ సిబ్బంది మూర్తి, భవానీ శంకర్, కిషన్‌గార్లకు,

ఫ్రెండ్స్ ఈశ్వర్ శైలజ. తిరునగరి శ్రీనివాస్, మొయిలి శ్రీరాములు, సతీష్, కిరణ్ మొదలగు వారికి...

గ్రంథాన్ని తమ ప్రచురణగా ప్రచురించిన జ్యోత్స్న కళాపీఠం హైదరాబాదు వారికి, గ్రంథప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి,

ఇంకా ఎందరో..

అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలుతెలియజేస్తున్నాను.

ఎంతో జాగ్రత్త తీసుకొన్నప్పటికీ కొన్ని అక్షర దోషాలనుండి తప్పించుకోలేకపోయాం. అయితే అవి మూలభావానికి అవరోధం కాదనేది సహృదయులందరూ అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాను.

**-దార్ల వెంకటేశ్వరరావు**

'Bharat Bhasha Bhushan' Awardee
**Dr. S. SARATJYOTHSNA RANI**
M.A., M.Phil, Ph.D.
Senior Lecturer in Telugu,
Dept. of Telugu
School of Humanities,
University of Hyderabad
Hyderabad - 500 046.




***Residence :***
Sri Sai Krupa Apartments,
Flat No. 101,
Ramanagar Gundu,
Vidyanagar,
Hyderabad - 44
Ph : 7645017
Date : 12-3-1999

# ఆశీస్సులు

మా విద్యార్థి దార్ల వెంకటేశ్వరరావు, జ్ఞానానందకవి రచించిన ఆమ్రపాలి కావ్యంపై నా పర్యవేక్షణలో పరిశోధన చేసి దాన్ని ప్రచురించడం ఎంతో ఆనందంగా ఉంది. నవ్య సంప్రదాయకవి జ్ఞానానందకవి గారు రాసిన కావ్యాల్లో 'ఆమ్రపాలి' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు పొందింది. దీన్ని అనేక విశ్వవిద్యాలయాలు డిగ్రీ విద్యార్థులకు కొన్నాళ్ల పాటు పాఠ్యాంశంగా నిర్ణయించాయి. వివరాలన్నీ ఈ గ్రంథంలోనే ఉన్నాయి. మళ్లీ చెప్పడం చర్విత చర్వణమే అవుతుంది కనుక, వివరించనవసరంలేదనుకుంటాను.

ప్రాచీన కాలం నుండి నేటి వరకూ స్త్రీల జీవన స్థితిగతుల్లో పెద్ద మార్పులేమీ కన్పించడంలేదు. కానీ కన్పించినట్లు మాత్రం కొంతమంది భ్రమను కల్పిస్తున్నారు. శారీరకంగా మానసికంగా స్త్రీల పరిస్థితులను అర్థం చేసుకోగలిగినప్పుడే మార్పు సాధించిందీ లేనిదీ గుర్తించగలుగుతాం. నేటికీ సమాజంలో కొన్ని వర్గాలు చేసే కుట్రలకు స్త్రీలు బలిఅవుతూనే ఉన్నారు. దేవదాసి, బసివిని, జోగిని, మాతంగి మొదలైన ఆచారాలు కొన్ని ప్రాంతాల్లో కనిపిస్తూనే ఉన్నాయి. ఇలాంటి స్త్రీల దుస్థితిని ఖండిస్తూనే మరో ప్రక్క ఆచారాల పేరుతో ఈ పద్ధతిని కొనసాగించడం గమనిస్తూనే ఉన్నాం. ఇటువంటి దుర్భర జీవితాలను అనుభవిస్తున్న స్త్రీల ఇతి వృత్తాలను తీసుకొని నేటికీ రచయితలు రచనలు చేస్తూనే ఉన్నారు.

షోడషమహాజనపధాలకు చెందిన వైశాలినీ గణతంత్ర రాజ్యంలో ఉండే 'గణభోగ్య ఆచారాన్ని జ్ఞానానందకవిగారు 'ఆమ్రపాలి' కావ్యంలో వర్ణించారు. బౌద్ధ జాతక కథలకు చెందిన ఈ కధను తీసుకొని 1972లోనే ఒక ఉత్తమ కావ్యంగా తీర్చి దిద్దారు. ఆమ్రపాలి కావ్యేతివృత్తాంతాన్ని పరిశీలిస్తే అందరిలాగానే పెళ్లి చేసుకొని జీవించాలనుకొని ఎన్నో ఆశలు పెట్టుకున్న అందమైన అమ్మాయి ఆమ్రపాలి లిచ్ఛవుల దుష్టపన్నాగాల వల్ల 'అందరికీ భార్య గణభోగ్య' గా మారవలసి వస్తుంది. గణభోగ్యగా గుర్తింపబడిన ఆమ్రపాలి బుద్ధుని బోధనలకు ఆకర్షితురాలై తన జీవన మార్గాన్ని ఆధ్యాత్మిక దిశగా మరల్చడం ద్వారా కథను ముగించారు కవి. కావ్యం శృంగార పరంగా కొంత వరకు సాగినప్పటికీ, శాంత రసానికే ప్రాధాన్యతనివ్వడం కనిపిస్తుంది. దీనివల్ల కావ్యం అందరి మన్ననలను పొందగలిగింది. ఇటువంటి ఉత్తమ కావ్యాన్ని తీసుకొని ఏడు అధ్యాయాలుగా విభజించి పరిశోధన చేశాడు దార్ల. మొదటి అధ్యాయంలో కవి జీవిత రేఖలనుండి ప్రారంభించి కవిలో కనిపిస్తున్న భారతీయ సంస్కృతి పట్ల అభిమానం, సంస్కరణదృక్పథాలను వివరించి అవి ఆమ్రపాలి కావ్యంలో ప్రతిఫలించిన తీరును నిరూపించగలిగాడు.

పరిశోధన పద్ధతులను పాటిస్తూ, కావ్యాన్ని వస్తుపరంగా, రూపపరంగా పరిశీలించి కావ్య విలువలను నిర్ధారించ గలిగాడు. బౌద్ధ జాతక కథల్లో ఆమ్రపాలి ఇతవృత్త రచనలను తులనాత్మకంగా పరిశీలించడం ద్వారా జ్ఞానానందకవిగారి ఆమ్రపాలి కావ్య వైశిష్ట్యన్ని వెల్లడించడంలో సఫలీకృతుడయ్యాడు దార్ల. కవితో ముఖాముఖి చేసి కావ్యంలో వర్ణితమైన భావాలన్నీ కవి వ్యక్తిగత భావాలే కానవసరం లేదనీ వాస్తవ వస్తువుతో కవి విభేదించనవసరం లేకుండానే కావ్యాన్ని వర్ణించవచ్చుననే విషయాన్ని నిరూపించాడు. కర్మసిద్ధాంతం విషయంలో దీన్ని మనం గమనించ వచ్చు. కావ్యానికి బింబిసారుడు నాయకుడు కాదనీ బుద్ధుడే కావ్యనాయకుడౌతాడనీ ఆయాపాత్రలను విశ్లేషణ చేసి సోదాహరణగా నిరూపించడం వల్ల ఆమ్రపాలి కావ్య ఔచిత్యాన్ని వెల్లడి చేయడంలో పరిశోధకుడు సఫలీకృతుడయ్యాడు. బింబిసారుడు ఆమ్రపాలికిచ్చిన 'ఉంగరం కథ' కావ్యానికి తోడ్పడిన విధానాన్ని వివరించడంలో వ్యక్తి నిష్ఠకంటే వస్తునిష్ఠకే ప్రాధాన్యత నివ్వడం చూడవచ్చు. పరిశోధనలో వస్తునిష్ఠే ప్రధానం. అది సత్యాన్వేషణకు ప్రాణం. *శిల్పవరమైన విషయాలను సోదాహరణంగా సప్రామాణికంగా నిరూపించడంలో దార్ల కృతకృత్యుడయాడు. 'సహకార పత్రముల యుద్యోగమ్ము చంద్రప్రభాభ్యుదయ శ్రీలకు నడ్డమయ్యె'యనే పద్యానికి చేసిన విశ్లేషణ పరిశోధకుడి ప్రతిభను వెల్లడిస్తుంది*స్థాలీపులాక న్యాయంగా ఒక దాన్ని చూద్దాం.

గణభోగ్య జీవితం పట్ల ఆమ్రపాలి విరక్తి చెందుతుంది. కాని, ఆమెలో కోరికలు తీరలేదు. తన శేష జీవితాన్నైనా విశ్రాంతిగా గడపాలనుకొంటుంది. తాను దొరికిన ఆమ్రవనంలోకి వెళుతుంది. అక్కడేమో బుద్ధుడు తపస్సు చేసుకుంటూ ఉంటాడు. అతనెవరో అనుకుంటుంది. సుందరమైన ఆ విగ్రహాన్ని చూసి మోహావేశ వివశురాలవుతుంది. ఆమె స్థితిని గమనించిన బుద్ధుడు తన జీవిత లక్ష్యాన్ని వివరిస్తాడు. బుద్ధుడి ప్రసన్న వాక్కులకు పరివర్తన చెందిన ఆమ్రపాలి, మోక్షాన్ని ప్రసాదించమని వేడుకొంటుంది. దానికింకా సమయం పడుతుందని చెప్తాడు బుద్ధుడు. ఇవన్నీ ఆమ్రపాలి ఆమ్రవనంలో ప్రవేశించే ముందే వర్ణితమైన పద్యంలో చెప్పడంలో ఉన్న శిల్ప రహస్యాన్ని గుర్తించగలిగాడు పరిశోధకుడు. *ఆకాశం నుండి స్వచ్ఛమైన వెన్నెల కురుస్తున్నా, ఆ కిరణాలు క్రిందికి ప్రసరించకుండా మామిడాకులు అడ్డుపడుతుంటాయి. ఆ నీడల్లో ఆమెకు బుద్ధుడు కనిపించినట్లు వర్ణించడం వల్ల ఆమె మోక్షానికి ఇంకా అర్హత సాధించలేదనేదాన్ని శిల్పవరంగా వర్ణించిన కవి హృదయాన్ని గ్రహించగలిగాడు పరిశోధకుడు.*

ఇటువంటి ఉత్తమ చారిత్రక పద్యకావ్యం ఆమ్రపాలిపై పరిశోధన చేసి ఫస్ట్‌క్లాస్ విత్ డిస్టింక్షన్ సాధించిన చిరంజీవి దార్ల కృషిని అభినందిస్తూ, మరిన్ని పరిశోధన వ్యాసాలను సాహితీ జగతికి అందించాలని ఆకాంక్షిస్తూ, పరిశోధనా రంగంలో ఉన్నత స్థానాన్ని పొందాలని ఆశీర్వదిస్తున్నాను.

**ఎస్.శరత్ జ్యోత్స్నారాణి**

**Dr. Vadavalli Chakrapani Rao,**
M.A. M.Phil. Ph.D.
Reader in Telugu & Head of the Dept.
Dept. of Oriental Languages,
S.K.B.R. College,
Amalapuram- 533 201



Residence
"Master Kuteer"
Konkapali
Amalapuram - 533 201
Phone 08856-32058

Date 19-4-1999

# సహృదయామోదం

మనకున్న కొద్దిమంది నియోక్లాసిక్‌పొయెట్స్‌లో జ్ఞానానందకవి గారు అగ్రగణ్యులు.

జాతిజీవనానికి, అస్తిత్వానికి ముఖ్యమైంది సంస్కృతి- అని నమ్మిన సంస్కారవంతులు వారు.

నమ్మడమేకాదు, దాన్ని కాపాడటం కోసం కలంపట్టి, నిరంతరం కవితావ్యవసాయం సాగిస్తున్న సాహితీ కృషీవలులు వారు.

కవి అనేవాడు సమాజాన్ని నిందించడంకాదు చేయాల్సింది. కావాల్సిన సందేశాన్ని అందించడం, తిట్టడం కాదు చేయాల్సింది హృదయాన్ని తట్టడం అనే ఉత్తమాదర్శానికి కట్టుబడిన మనపూర్వకవుల కోవకు చెందినవారు వారు.

అనే కాదు, 'పతితులారా! భ్రష్టులారా! బాధాసర్పదష్టులార! ఏడవకండేడవకండి' అంటూ సహృదయంతో వారిని చేరదీసి, 'తనదైన 'మరో ప్రపంచం'లోకి ఉద్ధరించిన అభ్యుదయవాది వారు.

కనుకనే ఆమ్రపాలి వృత్తాంతం ఆయన హృదయాన్ని ఎంతగానో ఆకట్టుకోగలిగింది. రసభావతరంగితమైన ఆ హృదయకాసారంలో అదొక కమనీయకల్హారంగా రూపొంది విరాజిల్లింది.

ఆమ్రపాలికథలో కవిగారిని ప్రధానంగా ప్రభావితం చేసినవి రెండంశాలు. ఒకటి ఒకానొక ముద్దరాలి బ్రతుకును బండలు చేయాలని కొన్ని స్వార్థపర శక్తులు ప్రయత్నించగా, ఒక ప్రేమమూర్తి ఆమెను చేరదీసి, ఆదరించడం, రెండు- భ్రష్టమైన తన బ్రతుకును గూర్చి చింతిస్తూ నిరాశానిస్పృహలకు లోనుకాకుండా ఆ యువతి వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుని జన్మను చరితార్థం చేసికోవడం.

మొదటి అంశంలో ఆమ్రపాలి కావించిన మహత్తరమైన త్యాగం, వ్యక్తిశ్రేయస్సుకంటె సమాజ శ్రేయస్సు ముఖ్యంగా గ్రహించి, తనను తాను గణభోగ్యగా సమర్పించుకోవడం,

రెండవ అంశంలో ఆమె తన త్యాగానికి ఫలితమా అన్నట్టు బుద్ధదేవును అనుగ్రహానికి పాత్రురాలై, బౌద్ధ భిక్షుకిగామారి, తరించడం.

-అనేవి పరమార్థాలు!

త్యాగం వల్ల అమృతత్వం పొందడం అంటే ఏమిటో ఆమ్రపాలి కథ చక్కగా నిరూపిస్తోంది. కావ్యాలు మనం వ్రాసేవి కొన్నయితే! మనని తట్టి మనచే వ్రాయించుకొనేవి కొన్ని ఉంటాయి.

జ్ఞానానందకవి గారి ఆమ్రపాలి కావ్యం రెండో కోవకు చెందుతుంది. ఈ మాటను గట్టిగా చెప్పగలను-ఎందుకంటె-కావ్యంలో ఆయన చేసిన కల్పనల్లో ఆయన దృష్టికేరాని రెండు మహత్తర విషయాలున్నాయి.

గౌతముడు సిద్ధినిపొంది బుద్ధుడు కాకముందు ఆమ్రవనంలో ఆమ్రపాలికి దర్శనిమిస్తాడు.

''కనుపించె శాక్యధని నం

దనకున్ లావణ్య యౌవన సుధాఖనికిన్

మునిగా తేజోమయుదే

హునిగా మోహన కళామహోదయ నిధిగా'' (3-8)

అప్పటికామె 'లావణ్యయౌవనసుధాఖని' అతడు 'మోహన కళామహోదయనిధి' మాత్రమే. కనుకనే, ఆమె 'వీని బొందవలయు' (3-12) ననుకొంటుంది. గౌతముడు ఆమె అజ్ఞానానికి నవ్వుకొని, జీవిత సత్యాలను బోధపరిచి, తాను చేసే తపస్సు ఫలిస్తే అప్పుడు ఆమె పెట్టే భిక్ష స్వీకరిస్తానని చెప్పి (3-34) వెళ్లిపోతాడు. తర్వాతి కథలో అతని తపస్సూ ఫలించింది, భిక్ష స్వీకరించాలనే ఆమె కోరికా నెరవేరింది. గౌతముడు చేసే తపస్సు ఇలాంటి జనాల అజ్ఞానం సుజ్ఞానం కావాలనే గదా! అజ్ఞానం సుజ్ఞానంగా పరిణమించాలంటే, ఇవతలివారి కర్మ పరిపక్వం కావాలి, అవతిలి వారి అనుగ్రహమూ సిద్ధించాలి. ఇందుకు కాలమూ కలిసిరావాలి. ఇప్పుడు ఆమె ఇస్తానన్న అతిథ్యానికి బుద్ధుడు ఆ తర్వాత ఆమెనుండి స్వీకరించిన భిక్షకూ గల అంతరం సహృదయైకవేద్యం. గౌతముని వరకూ తీసికొంటే, ఆయన జీవితం పండటానికి ఇలాంటివే ఎన్నో సన్నివేశాలు దోహదం చేశాయి. ఆమ్రపాలి పరంగా గౌతముని సందర్శనం, సంభాషణం ఆమె లోని జీవన పరిణామాన్ని వేగిరపరిచే ఒకానొక నూతనానుభవాన్ని కలిగించింది. (3-35)

రెండవది ఆమ్రపాలి పూర్వజన్మ వృత్తాంతం. జాతక కథల్లో అన్నింటా కనిపించే ఒకానొక సాధారణాంశం ఏమంటే, బుద్ధుడు వెనుకటి జన్మల్లో

ఎవరెవరితో ఎటువంటి సంబంధం కలిగిఉండేవాడు, వాళ్లని ఈ జన్మలో ఎలా తరింపజేశాడు అనేది. 'ఆమ్రపాల్యావదానం'లో కూడా బుద్ధుడు తన శిష్యులకు ఆమె పూర్వజన్మ కథను చెబుతూ, ఆ వెనుకటి జన్మలో ఆమె 'మాలతి' అనే ఉద్యానపాలిక అనీ, తానప్పుడొక రాజర్షి (ప్రత్యేక బుద్ధుని)గా ఆమెననుగ్రహించడంవల్ల ఇప్పుడీ జన్మలో ఆమ్రపాలిగా జన్మించిందనీ చెబుతాడు. జ్ఞానానందకవిగారు అందుకు భిన్నంగా ఆమ్రపాలికి ఊరట కలిగేలా, జనాలకి ఆమెపట్ల సానుభూతి కలిగేలా ఇంద్రశాపం వల్ల ఆమె నెమలి జన్మనుండి మనుజ పుట్టుక పొందినట్లుగా కల్పించారు. కేవలం ఆమెపట్ల సానుభూతి కలిగించడానికే అయితే, ఉపకారం చేయబోయిన నెమలిని ఇంద్రుడు శపించాడనడంలో ఔచిత్యం దెబ్బతినడం లేదూ? ఇంద్రుడేమన్నా మూర్ఖుడా? లోకకంటకుడా? తాను చస్తూ, తనవారిని కాపాడబోయిన నెమలిని అనుగ్రహించాలిగాని శపించడం ఏమిటి? మన పురాణాలను గమనిస్తే, వాటిలో కొన్నిశాపాలు శాపాలుగా కనిపించే వరాలు అని బోధపడుతుంది. ఈ శాపం సరిగ్గా అలాంటిది! జీవుని పరిణామంలో ఎన్నెన్నోదశలు ఉంటాయి. నెమలిగా పుట్టిన జీవి నరజన్మ పొందడానికి మధ్యలో మరెన్నో జన్మలు పొందవలసి ఉంటుంది. ఇంద్రుడు నెమలి యొక్క పరోపకార పరాయణతను పరీక్షించి, ఆ పరీక్షలో అది నెగ్గడం వల్ల మరుజన్మలో ఆమ్రపాలిగా, అదేత్యాగదీక్షతో పుట్టి, సిద్ధార్థుని అనుగ్రహంపొంది, తరించేలా అనుగ్రహించాడు. ఇదంతా కవి ఉద్దేశించి ఉండక పోవచ్చు, నిజమే, ఒకోసారి కవికి తెలియకుండానే కొన్ని కొన్ని సన్నివేశాలు కావ్యంలో రూపుకట్టుకుంటాయి. కవికే తెలియని 'లోతులు' కావ్యంలో ఉండకూడదనేంలేదుగదా! కావ్యరచనలో అతడు నిమిత్తమాత్రంగా నిలబడగలిగినప్పుడు!

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, చిరంజీవి దార్ల వెంకటేశ్వరరావు ఒక ఉత్తమకావ్యం మీద చక్కని పరిశోధన చేసి, సఫలీకృతుడయ్యాడనే ప్రతిపాదన చేయడం కోసం.

ఒక సంస్కారవంతుడైన కవి వ్రాసిన కావ్యాన్ని విమర్శించడానికి సంస్కారవంతుడైన సహృదయ విమర్శకుడు దొరకడం ఎంతో గొప్ప విషయం!

సుమారు ముప్ఫయేళ్ల నా అధ్యాపక జీవితంలో నా దగ్గర చదువు కొన్నవాళ్లు కొన్నివేలమంది ఉంటారు. వారిలో నా విద్యార్థులు అని చెప్పదగిన వారు కొన్ని వందలమంది ఉంటారు. మరింక 'నా శిష్యుడు' అని చెప్పదగిన వాళ్లు కొన్ని పదులమంది ఉంటారేమో! ఆ పదులమందిలో చిరంజీవి దార్ల వెంకటేశ్వరరావు ఒకడు. మొదటినుంచీ అతడు ఎంతో బుద్ధిమంతుడు. పెద్దల

పట్ల వినయవిధేయతలు కలవాడు. కష్టపడి చదివేవాడు. సాహిత్యం పట్ల విశేషాభిమానం కలవాడు. పుత్రసమానుడైన అతని గురించి నాకునేనుగా ప్రస్తుతించడం భావ్యం కాదేమో!

'ఆమ్రపాలి పరిశీలన' అనే ఈ సిద్ధాంతగ్రంథం అతని పరిశోధనా సామర్ధ్యానికి నికషోపలం. ప్రణాళికాబద్ధంగా సాధ్యమైనంత సమగ్రంగా జ్ఞానానందకవిగారి ఆమ్రపాలి కావ్యాన్ని సమీక్షించి, కవికీ, కావ్యానికీ న్యాయం చేసిన వెంకటేశ్వరరావును హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

స్ఖాలిత్యాల మాటంటారా? అవి మహామహులకే తప్పవు. ఎవరో కవిచెప్పినట్లు తల్లికి బిడ్డ ఎలా మాట్లాడినా ముద్దుగానే ఉంటుందన్నట్లుగా నాకు నా శిష్యుడు ఎలా వ్రాసినా బాగానే అనిపిస్తుంది. మరింత ఎదిగాక అతడే తెలుసుకుంటాడు అలాంటివేమైనా యిందులో దొర్లిఉంటే-అదీగాక, అందుకు సంబంధించిన వాళ్లు వేరే ఎలాగూ ఉండనే ఉంటారు. పుస్తకంతో బయటకు వస్తున్నాడు గదా అదీ తెలుస్తుంది.

చిరంజీవి వెంకటేశ్వరరావు సాహితీలోకంలోనే కాక, జీవితంలో కూడా చక్కగా స్థిరపడి, మంచివాడుగా మరింతగా పేరు తెచ్చుకోవాలని ఆకాంక్షిస్తూ,

ఆశీర్వదిస్తూ...

**వాడవల్లి చక్రపాణిరావు**

**Prof. V. Subrahmanya Sastri**
M A Ph D (Te) M A Ph D (Skt)
Department of Telugu
ANDHRA UNIVERSITY
Visakhapatnam - 530 003



Residence:
"Sarda Peetam"
46-15-35 Mandavan peta,
Visakhapatnam- 530 016
✆ 541003 (R)

Date 4-5-1999

శ్రీ శివాయ గురవే నమః

# పరితోషము

జీవితంలో ఎన్నెన్నో ఒడిదుడుకులని తట్టుకొంటూ సమాజంలో ఎన్నెన్నో సంఘర్షణలకు లోనై ధీరోదాత్తతతో పురోగమిస్తూ నిరంతరవాగ్దేవతా వరివస్యాధురంధరులుగా కీర్తిగాంచిన కవిలోకమూర్ధన్యులు ''కళాప్రపూర్ణ'' సురగాలి తిమోతి జ్ఞానానందకవి.

నన్నయగారి సంస్కృతపదప్రచురశైలీ విన్యాసం, తిక్కన గారి శిల్పరచనా ప్రాగల్భ్యం, శ్రీనాధుని సీసపద్య శైలూషీ నాట్యవిలాస వైవిధ్యం, పెద్దనగారి శిరీషకుసుమపేశలసుధామధుర పదబంధబంధురత - ఇలా ఎందరిమహాకవుల రచనావిన్యాసాలో జ్ఞానానందకవిగారి రచనలలో రాశీభూతంగా దర్శనమిస్తాయి. తనప్రత్యేకరచనావైభవానికి మెఱుగులు దిద్దుతాయి. ''కమ్మని తేట తెన్గునుడికారపు సొంపు, రసార్ద్ర దివ్యభావమ్ము లిఖింప నేర్పు'' జ్ఞానానందకవిగారి సొత్తు.

సనాతన భారతీయసంస్కృతి పరిరక్షణతత్పరత, సంఘసంస్కరణ దీక్షాదక్షత, పరమోదాత్తసౌహార్దసంపద, అనల్పపద్యకవితా ప్రదర్శన ప్రవీణత జ్ఞానానందకవిగారికి విద్వజ్జన సమ్మాననార్హతని అనుగ్రహించాయి. కవితా విశారద, కవిలోకవిభూషణ, విద్వత్కవిచూడామణి, కవిసార్వ భౌమ, కవితా శ్రీ నాథ, పద్యవిద్యాప్రభువు - వంటి అనేక బిరుదులు వాటి అంతట అవే వారిని వరించాయి. ఆంధ్రవిశ్వకళాపరిషద్దత్త ''కళాప్రపూర్ణ'' బిరుదానికి శతశతా సమగ్రంగా సార్థక్యాన్ని చేకూర్చిన ధన్యజీవులు వారు.

శ్రీ జ్ఞానానందకవిగారి సాహిత్య సర్వస్వంలో ఆమ్రపాలి అనే కావ్యం మకుటాయమానమనదగ్గది. ఆమ్రరస నిర్భరంగా రచించబడిన ఆ మధురకృతి సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలువదగ్గది. కావ్యరచనకు సంబంధించి సార్థక పదప్రయోగదక్షత, మధురభావప్రదర్శనప్రవీణత, సురుచిరరసపోషణ చతురత, సజీవపాత్రచిత్రణసమర్థత, ప్రౌఢవర్ణనా నిర్వహణ నిపుణత మొదలైన పెక్కు అంశాలు ఆ మహాకావ్యంలో హృద్యా నవద్యంగా పోషింపబడ్డాయి.

అహింసా సిద్ధాంతాన్ని లోకానికి ఉపదేశించి ఒక ప్రత్యేక దర్శనానికి ఆధారభూతుడైన గౌతమబుద్ధుని వ్యక్తిత్వాన్ని ఈ విధంగా ఒక్క సీసపద్యంలో నిబంధించిన జ్ఞానానందకవిగారి ప్రతిభ అనల్పమైనది.

''తన త్యాగమహిమచే ధర్మమ్ము భువనాన
స్థాపింప దొరకొన్న శాంతమూర్తి
తన వాక్ప్రభావాన దయయు శాంతియు భూత
కోటికి నేర్పించు మేటి గురువు
తన తపస్సిద్ధిచే ధారుణీవలయాన
జ్ఞానమ్ము పండించు మౌనిమౌళి
తన యహింసా సూత్రమున స్వర్గమునకు ని
శ్రేణి గల్పించు విశిష్ట గుణుఁడు
మానవునకుఁ గ్రొత్త మార్గమ్ము చూపఁగ
దపము నాచరించు ధర్మవరుడు''

పాత్రలమానసికస్థితిగతులని సహజసుందరంగా చిత్రించడంలో కవియొక్క సామర్థ్యంప్రస్ఫుటమౌతూ ఉంటుంది. పాత్ర కూడా చైతన్యవంతం అవుతుంది. లిచ్ఛవులు గణభోగ్యగా కోరగా ఆమ్రపాలి పొందిన మానసిక సంక్షోభని పరమదయనీయంగా జ్ఞానానందకవి ఇలా చిత్రించారు:

''అల్లారుముద్దుగా నవనిఁ బెంచినయట్టి
తలిదండ్రుల నెడదఁదలఁచి తలఁచి
చిననాఁటి నుండియుఁ దనతోఁ జరించు నె
చ్చెలుల శ్లేషోక్తికిఁ గులికి కులికి
తన విద్దియలకుఁ గారణ భూతలగు గురున్
బత్తి నిండఁగఁ జేతులెత్తియెత్తి
వయసుతో పాటుగఁ బయనించు కోర్కెలు
వూడ్చ గాఁబడెనంచు నేడ్చి యేడ్చి
గుండె పగులునట్లు కుమిలి కుమిలిపోయి
చెప్పరాని వెతల కుప్పలో నఁ
గూలఁ బడిన యామ్రపాలి నెవ్వారలు

ప్రాచీన గీర్వాణాంధ్రకవిసుత్రాములెల్లరూ తమ తమ ప్రతిభావ్యాష్కల్య నిరూపణకి వర్ణనలని రంగభూమికగా గ్రహించారు. జ్ఞానానందకవి పూర్వ మహాకవుల మార్గంలోనే · పయనిస్తూ పరమ ప్రాబంధికంగా అనల్ప కల్పనా సనాథంగా వర్షారంభాన్ని ఇలా అభివర్ణించారు.

''గ్రీష్మతీక్ష్ణము మహోద్రేకమ్ము చల్లార
భేకసంతతి గొంతు విప్పునపుడు
సాంద్ర పయోధర జాలమ్ము ఘనరోద
సీ వీధి నాట్యమ్ము సేయునపుడు
నలగి కలంగి బీటలు దేరి స్రుక్కిన
భూదేవి హృదయముప్పొంగునపుడు
ధారావరంపర నైఋతి పవనమ్ము
పెడసరియై వీవఁ దొడఁగి నపుపడు
నీలిగగనాన మేలి శంపాలతాంగి
మెఱవు నగవులు కురిపించి మెఱ[illegible]డ
వృధివి జనులు గుబ్బగొడుగు [illegible]నపుడు
చినుకు దొరసాని భువికి [illegible] నపుడు''

ఒక పాశ్చాత్య విప[illegible]ణి "Poets are judged by the frame of mind they induce in us" అని కవి ఇచ్చే సందేశాన్ని బట్టి అతని స్థాయి పరిగణింపబడుతుందని పేర్కొన్నాడు. జ్ఞానానందకవి తమ చిరకాల జీవితానుభవసారాన్ని పురస్కరించుకొని ఆమ్రపాలి మహాకావ్యంలో లోకానికిచ్చిన ఈ సందేశం సర్వజన సమాదరణీయమైనది.

''పాలివోవు మర్త్యుల కొలఁది జీవితమున
అగుపింపరాదెప్పుడా గ్రహమ్ము
అఱనిముసాననేమగునో చెప్పఁగ లేని
జడునకెందులకురా మిడిసిపాటు
కన్ను మూసినతోనె మన్నైన మనుజాని
కేల యీర్ష్యాద్వేషహాల హాలము
పంచభూతాలచే బంధితుండగు వాని
కెందుకీ దౌర్జన్యకృన్మ నస్సు

సార హీనమైన సంసార జడధిలో
నీదులాడ నెందు కిట్టి లిప్స
క్రుళ్లి పోవు నీ జాగుప్సాకరంబైన
తనువునకు నదేల తామసమ్ము''

ఈ విధంగా సమీక్షిస్తే శ్రీజ్ఞానానందకవిగారి ఆమ్రపాలి బహువిధ చమత్కృతి సంభరితంగా రచింపబడ్డ మధురకావ్యమని విశదమౌతుంది. కవిగారి మాటలలో చెప్పవలసివస్తే ఆమ్రపాలి ''ప్రకటీభూత సరన్మరంద రసపూర్ణ, ద్యోగాంగఝురీ నిరంతర చలల్లీలా విలాసైక వీచిక, చాంద్రీధవళైక మంగళ మరీచి ప్రాభవోదార దీపిక.''

బింబి సారుడు కావ్యగత అయిన ఆమ్రపాలికా సౌందర్యాన్ని ఉద్దేశించి చెప్పిన

*''అందాలకు మాటల మక*
*రందాలకు సర్వసత్కళా జీవనపున్*
*చందాలకు నందాలకు*
*మందరమగు నామ్రపాలి... ...''*

అనే ప్రశంస ఆమ్రపాలిక కావ్యసౌందర్యానికి కూడా సమంగా సమన్వయిస్తుంది.

ఆధునికయుగాంధ్ర సాహిత్యంలో ఆవిర్భవించిన బుద్ధచరిత్ర, సౌందరనందము వంటి బౌద్ధసిద్ధాంత ప్రతి పాదక కావ్య పరంపరలో అత్యంత విశిష్టమైన స్థానాన్ని అలంకరించే ఆమ్రపాలి అనే మధుర కావ్యంపై చిరంజీవి దార్ల వేంకటేశ్వరరావు ఎం.ఫిల్ పట్టంకోసం పరిశోధన చేసి విద్వదామోద ముద్ర పొంది ఆ పరిశోధన సిద్ధాంత వ్యాసాన్ని అచ్చువేయించడం అస్మదాదులకి పరమ హర్షపదం.

ఆ గ్రంథంపై ఆవిష్కరింపబడిన పూర్వాంధ్ర సాహిత్య విమర్శకాగ్రే సరుల సమభిప్రాయాలని ఆమూలాగ్రం ఆకళింపు చేసుకొని ఆధునిక పరిశోధన పద్ధతిలో ''జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన'' అనే శీర్షికతో లఘు సిద్ధాంత వ్యాసాన్ని శ్రీవేంకటేశ్వరరావు సంతరించిన విధం విద్వజ్జన సమభినంద్యం.

ఈపరిశోధన సిద్ధాంతగ్రంథం ప్రధానంగా ఆరు ప్రకరణాలలో రచింపబడింది.

# ముందు మాట

సమాజం సుఖసంతోషాలతో, శాంతి సౌభాగ్యాలతో వర్థిల్లాలని కోరుకొనేవాళ్లే అధికంగా ఉంటారు. అయినప్పటికీ కొంతమంది స్వార్థంకోసం సమాజాన్ని తమకి అనుకూలంగా మార్చుకోవాలని ప్రయత్నించే వాళ్లూ ఉంటారు. దానివల్లనే సమాజంలో కొన్ని అవాంఛనీయ పరిస్థితులు ఉత్పన్నమవుతుంటాయి. సమాజంలో ఎన్నో ఆచారాలు ఉన్నాయి. ఒక సమాజంలో సరైన ఆచారంగా కన్పించేది మరో సమాజంలో దురాచారంగా కన్పించవచ్చు. మనం కల్పించుకున్న కొన్ని ఆచారాలు సంప్రదాయాలు సమాజ పరిణామక్రమంలో మార్పులకు లోనవుతుంటాయి. దేవుని పేరుతో జరిగే దురాచారాల్లో దేవదాసీ పద్ధతి ఒకటి. దానిలో సాధారణంగా కిందికులాల కన్యలనే 'దేవదాసీలు' గా మారుస్తుంటారు. కానీ 'గణభోగ్య' అనేది కుల, వర్గ భేదం లేకుండా అందమైన యువతి అయితే చాలు, ఆమె ఏవర్గానికి చెందినా ఆరాజ్యంలోగల వాళ్లే అనుభవించేందుకు వీలుగా సాక్షాత్తూ ఆ చక్రవర్తి ఆధ్వర్యంలోనే ఒక శాసనం రూపొందుతుంది. షోడషమహాజనపథాలకు చెందిన కొన్ని గణతంత్ర రాజ్యాలలో ఈ గణభోగ్య ఆచారం కొనసాగేది.

దేవదాసీలు, గణభోగ్యలు కాలక్రమంలో వేశ్యలుగా గుర్తింపబడుతుంటారు. కనుక వేశ్య 'గణభోగ్య' కాదు. కానీ 'గణభోగ్య' వేశ్యగా మారుతుంది. 'గణభోగ్య' ఆచారాన్ని తెలిపే కథ ఒకటి బౌద్ధ జాతక కథల్లో ఉంది. దీన్ని తీసుకొని తెలుగు, హిందీలలో కావ్యాలు, నవలలు, నాటకాలు వచ్చాయి.

ఆమ్రపాలి కథ చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది. ఎన్నో ఆశలు పెట్టుకొన్న ఒక యువతి ఒకగణతంత్ర రాజ్య శాసనానికి తలవంచి గణభోగ్యగా మారడం, ఆమెను కాలక్రమంలో సమాజం వేశ్యగా ముద్ర వేసి నిరాదరణకు గురిచేయుటం, ఆపరిస్థితులకు ఆమె పడిన మానసిక సంఘర్షణ, ఆ సంఘర్షణ నుండి బుద్ధుడి బోధనల వల్ల ప్రశాంతత పొంది మోక్ష మార్గం వైపు పయనించడం మొదలైన సన్నివేశాలు ఆ కథను పూర్తిగా తెలుసుకోవాలనే కుతూహలాన్ని రేకెత్తిస్తాయి.

ఆమ్రపాలి కథ ఉన్న పుస్తకాలు చదువుతుండగా జ్ఞానానందకవిగారి ఆమ్రపాలి కావ్యంలో ఈ కథ చాలా మార్పులతో ఎంతో రమణీయంగా తోచింది. కావ్యాన్ని చదివిన తర్వాత రచనావిధానం, కథలో చేసిన మార్పులు నన్ను బాగా ఆకట్టుకున్నాయి. అసలు చరిత్రలో ఏమి జరిగింది? కావ్యాల్లో ఎలా వర్ణితమైంది? గణభోగ్య ఆచారం ఎలా పుట్టుకొచ్చింది? ఒకవేశ్యను బుద్ధుడు తన సంఘంలో ఎలా చేర్చుకున్నాడు? సంఘంలో చేర్చుకొన్న తర్వాత ఆమెలో కలిగిన మార్పు ఏమైనా ఉందా? మొదలైన ప్రశ్నలు నన్ను సత్యాన్వేషణవైపు పయనించేటట్లు ప్రబోధించాయి. ఉప్రేరణతో జ్ఞానానందకవిగారి ఆమ్రపాలి మిగిలిన ఆమ్రపాలి కావ్యాలు, నవలలు

కంటే కొంత విశిష్టత గోచరించటంతో M.Phil. చేస్తే బాగుంటుందనిపించింది. ఇంతకు ముందెవరూ దీన్ని ప్రత్యేక అంశంగా పరిశోధన కూడా చేయలేదు. భారతీయ సంస్కృతి కావ్యంలో నిండుగా ఉండటం కూడా నన్ను బాగా ఆకర్షించింది. ఇన్ని ప్రేరణలలో M.Phil కి ఉపక్రమించి, పూర్తి చేయగా 1998లో డిగ్రీవచ్చింది.

ఈ పరిశోధన గ్రంథంలో గల కొన్ని భాగాలు ఆంధ్రభూమి ఆదివారం అనుబంధం రెండు వారాల పాటు ప్రచురించింది. ఆకాశవాణి, హైదరాబాదు (యువవాణి విభాగం)లో కూడా ఈ గ్రంథంలోని కొంతభాగం ప్రసారమైంది. అపుడు చాలామంది ఆమ్రపాలి కథ బౌద్ధ ధర్మం సమాజానికి అవసరమైనవనీ, పదిమందీ తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయని త్వరగా ప్రచురించమనీ, తమ అభిప్రాయాల్ని తెలిపారు.

పరిశోధన వ్యాసంలో సరళమైన భాషనే వాడటానికి ప్రయత్నించాను. ప్రాచీన తెలుగు భాషలో పదాది ద్విరుక్త, సంయుక్త హల్లుల్లో రేఫ, ఆధునిక భాషలోపించింది. ఉదా :- క్రొత్త > కొత్త; బ్రతుకు > బతుకు మొదలైనవి. కానీ వ్రాయు > రాయు గా మార్పుచెందినపుడు రేఫ కు బదులు 'వ' కారం లోపించింది. ఈమార్పుని అనుసరించే భాష ను ప్రయోగించాను. కర్మణి ప్రయోగాల విషయంలో 'బడు' ధాతువు ని పరిహరించడానికి 'వివరించడం జరిగింది' వంటి వాక్యాలను ప్రయోగించడం కంటే కొన్ని వాక్యాలలో 'బడు' ధాతువుని వాడడమే బాగుందనిపించింది. వాక్యంలో రెండేసి గౌరవార్థకాలు (రు, గారు) ఆధునిక భాష ప్రకారం వాడవల్సిన అవసరం లేకుండా ఒకదాన్నే వాడుకోవచ్చు. కానీ రెండింటినీ వాడటంలో దురవగాహనకు అవకాశమివ్వకూడదనేదే నా ఉద్దేశ్యం! భావార్థక ప్రత్యయాలు (అటం/ అడం), కూడా రెండింటినీ ప్రయోగించాను. ఇవన్నీ తెలిసి చేసిన ప్రయోగాలే.

References లో అవసరమైన భాగాన్ని సౌలభ్యం కొరకు వివరించాను. ప్రతిపాదిత విషయాన్ని నిరూపించడానికి వీలుగా పద్యాలను సాధ్యమైనంతవరకూ పూర్తిగానే పేర్కొన్నాను. మొత్తంమీద Research Methodology ని అనుసరించే పరిశోధన వ్యాసం రాయడానికి కృషిచేశాను.

M.Phil అనేది పరిశోధన చేయడానికి అర్హతను ప్రసాదించడంగా విశ్వవిద్యాలయ ఆచార్యులు సీనియర్ పరిశోధకులు అభిప్రాయపడుతుంటారు. ప్రస్తుతం M.Phil చేసిన ఈ విశ్వవిద్యాలయంలోనే 'పరిశోధకుడుగా ఆరుద్ర' అనే అంశంతో Ph.D. చేస్తూ పరిశోధనకు అర్హతను సాధించడానికి కృషిచేస్తున్నాను. ఇది నా తొలి ప్రచురణ గ్రంథంగా, పరిశోధనలో తొలి అడుగుగా మీ ముందుకి వస్తున్నానని సవినయంగా మనవి చేసుకొంటున్నాను. మీ అభిప్రాయాలను, సూచనలనూ ఆశిస్తూ...

– ద్వార్ల వెంకటేశ్వరరావు

# విషయసూచిక

# మొదటి అధ్యాయం

# డా॥ యస్. టి. జ్ఞానానందకవి జీవితం-సాహిత్యం

## 1.1. జననం

భారతీయసంస్కృతి వ్యక్తిత్వంలోను, సాహిత్యంలోను ప్రతిబింబిస్తున్న ప్రసిద్ధ తెలుగు కవులలో డా॥ సురగాలి తిమోతి జ్ఞానానందకవిగారు ఒకరు. తమ పూర్వీకుల్లో ఎటువంటి సాహితీవాసన లేకపోయినా సహజ ప్రతిభతో 'కూలీ నుండి కళాప్రపూర్ణ' వరకూ ఎదిగిన నిరంతర అధ్యయనశీలి.

జ్ఞానానందకవి గారు విజయనగరం జిల్లా బొబ్బిలి తాలూకా, పెదపెంకి గ్రామంలో 1922 జూలై 16న సురగాలి పాపమ్మ, ఎల్లయ్య దంపతులకు జన్మించారు. తల్లిదండ్రులు నిరక్షరాస్యులు, పేదవారు కావటంచేత వీరి విద్యాభ్యాసం మేనమామ దగ్గరే కొనసాగింది. ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న మేనమామ గుంటయోహానుగారు తమ తీరికసమయాల్లో భారత రామాయణ, భాగవతాలలోని పద్యాలను చదివి వినిపించేవారు.[1] జ్ఞానానందకవి గారికి ఆనాటి నుండే భారతీయ సంస్కృతి, సాహిత్యం పట్ల ఇష్టం ఏర్పడింది. తెలుగు పండితులు అప్పయ్యశాస్త్రి, ఆదినారాయణశాస్త్రిగార్ల హితబోధవల్ల వ్యాకరణాన్నీ తెలుగు భాషాసౌందర్యాన్నీ బాగా అవగతం చేసుకున్నారు.

## 1.2. సాహిత్యాభిలాష

తరగతిలో తెలుగు ఉపాధ్యాయులు రాగయుక్తంగా పద్యాలను వివరించటం, గ్రామాల్లో భిక్షాటనకై వచ్చిన పంబలవాళ్లు, బుడబుక్కలవాళ్లు, జంగంవాళ్లు మధురంగా పాటలు పాడేతీరు, తీయదనం వీరిని బాగా ఆకట్టుకున్నాయి. దీనికి తోడు తనకున్న పద్యధారణ, సహజ ప్రతిభతో పద్య కవితల్ని ఆశువుగా చెప్పడం తొమ్మిదవ ఏటనుండే అలవర్చుకున్నారు.[2]

మిషనరీ బోర్డింగ్ పాఠశాల్లో చదువుతున్న రోజుల్లో తోటిపిల్లలతో కలిసి నీళ్లు మోసేటప్పుడు, తోటపని చేసేటప్పుడు, హస్టల్లో పెట్టే గంజిఅన్నం తినేటప్పుడు కలిగిన అనుభూతులను ఆవేశభరితంగా పద్యకవితల్లో చెప్పటం, దాన్ని సహవిద్యార్థులు మెచ్చుకోవటంతో కవిత్వం రాయాలనే ఆసక్తిపెరిగింది.[3] దీనికితోడు మేనమామగారి ప్రోత్సాహంతో రామయణ, భారత, భాగవత కావ్యాల్ని చదవటంవల్ల, దాశరథి , భాస్కర, వేమన, సుమతీ, శ్రీకాళహస్తీశ్వర మొదలైన

శతకాల్లోని పద్యాలను, అమరం, శబ్దమంజరి మొదలైన గ్రంథాల్ని కంఠస్తం చేయడంవల్ల వీరిలో సాహిత్యాభిలాష మరింత ఎక్కువైంది.[4] కవి ఛందోబద్ధ కవిత్వాన్ని పదిహేనవ యేటనుండే రాయటం ప్రారంభించారు.[5] ఒక పాఠశాల్లో తెలుగు ఉపాధ్యాయుడిగా చేరిన తర్వాత మొదటిసారిగా సీస పద్యాలతో కూడిన 'దీనబంధు' శతకాన్ని రాశారు.[6] ఆ రోజుల్లో ఉపాధ్యాయ వృత్తి చేసేవారికి జీతం చాలా తక్కువగా ఉండటం వల్ల చాలా కష్టాలను అనుభవించవలసి వచ్చేది. దీనివల్ల ఇంటిలోని వాళ్లు కూడా తన కవిత్వాన్ని ప్రోత్సహించకపోయినా, నిరాశపరిచేవారని కవిగారే చెప్పుకున్నారు. ఎన్ని అడ్డంకులు ఎదురైనా కవి తన అనుభవాలను అక్షరీకరించటం మానలేదు. విజయనగరంలో మహారాజావారి కళాశాలలో సంస్కృతం నేర్చుకోవాలనుకున్నారు. కాని వర్ణ, వర్గ వైషమ్యాల ధాటికి తట్టుకోలేక పోయారు.[8] కళాశాలలోనే సంస్కృతం చదువుకోవాలనే ఆశ ఆశగానే మిగిలి పోయింది. సంస్కృత ప్రబంధాలు, కావ్యాలు మొదలైనవాటిని స్వయంగానే చదువుకొని తన ప్రతిభకు వ్యుత్పత్తిని కూడా జత చేసుకున్నారు. 1947 ఆగస్టు 15న మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సందర్భంగా కొన్ని పద్యాలను ఒక సభలో చదివి వినిపించారు. తన కవిత్వాన్ని సభల్లో చదవటం అదే ప్రథమం. సభాధ్యక్షులుగా ఉన్న ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు వీరిని కవిగా గుర్తించి సన్మానం కూడా చేశారు. ఆనాటినుండీ 'జ్ఞానానందకవి' గానే ప్రసిద్ధి పొందారు.[9]

## 1.3. సాహితీదృక్పథం

ప్రతి కవీ సమాజ ప్రభావం నుంచి తప్పించుకోలేనట్లే[10] డా॥జ్ఞానానందకవి గారి రచనల్లోనూ సమకాలీన సమాజం దర్శనమవుతుంది. కవే స్వయంగా '' *దేశము పట్టనంత యెంతటి కవియైనను తాను నివసించు సమాజ పరిధి ని యుల్లంఘించ నేరడనుట జగద్విదితము ఆనాటి సామాజిక స్థితిగతులను వాతావరణముల నాకలించుకొని రచనలు సాగించును*'' అని పేర్కొన్నారు.[11] కనుకనే సమాజంలో కన్పించే వివిధ అంతరువులను దర్శించగలిగారు. కుల, మత, వర్గ దృక్పథాలను తమదైన కవితా దృక్పథంతో పరిశీలించి ప్రయోగించారు కవిగారు.[12]

*''బంధితంబైనట్టి యంధ విశ్వాసాల*
*వలయాన జిక్కె నా వలపుటూహ*
*దిక్కుమాలిన కులద్వేష మతోన్మాద*
*లోకాన, మ్రగ్గె నాలోని ప్రతిభ*
*దయనీయమైన పేదరికపు బ్రతుకులో*

సన్నగిల్లినది, నా శౌర్య దీప్తి
కామందు నాదు భాగము భుజించుట చేత
మృగ్యమైపోయె నా భాగ్యలక్ష్మి
యుగ యుగాలనుండి ఊరికి దూరమై
బ్రతుకు గడిపినందు వలన నాదు
చరిత జన్మధరణి మరచిపోయెను కాల
యుక్తి యేమిసేసెదో మదుక్తి'' అని కుల వ్యవస్థ వల్ల ఎంతమంది ప్రతిభావంతులైన దళితులు వ్యధకు లోనవుతూ .దోపిడీకి గురికాబడ్డారో ఆత్మాశ్రయ పద్ధతిలో వివరించారు కవి.[13] అనాది కాలంనుండీ దళితులు వర్ణవ్యవస్థ వలన ఎంత నష్టపోయారో సామాజిక పరిణామ క్రమాన్ని కూడా ఆవేదనా భరిత స్వరంతో వ్యక్తీకరించారు. స్వీయానుభవంకూడా వర్ణవ్యస్థను సమర్ధవంతంగా వ్యక్తీకరించటానికి దోహదపడింది. కుల వ్యవస్థ వల్లనే సంస్కృతాన్ని కళాశాలలో చదువుకోలేక పోయినా దాన్ని వ్యక్తిగతంగా తీసుకోకుండా, వ్యవస్థీకృతంగానే ఆలోచించి, కులావిర్భావం, దాని మూలకారణాన్ని అన్వేషించి, భారతీయుల మధ్య చిచ్చురేపటానికి స్వార్థపరులు కులవ్యవస్థను సృష్టించారని వ్యాఖ్యానించారు. 'వెలుగుబాట' కావ్యంలో ఈ విషయాన్నే స్పష్టీకరిస్తూ –

''ఈ యస్పృశ్యత మున్ను వేదముల యందేకాని వేఱొండుగా
నీయెందైనను లేదు మానవుఁడు దీనిన్ స్వార్థచింతాత్ముఁడై
చేయంజాలెను నేటి మానవుఁడు ఛీ ఛీ యంచు పోద్రోలనీ
హేయంబైనటు వంటి భావమును పోయెన్ ధీరమర్త్యాలికిన్.[14] అని తెలిపారు. వేదాలలో లేని ఈ కులవ్యవస్థ మానవుడు స్వార్థంతో సృష్టించుకొన్నాడని దానివల్ల మానవత్వం నశిస్తుందనే ఆవేదన కవిలో కన్పిస్తుంది. ఏ సామాజిక సమస్యను తీసుకున్నా సంస్కరణ దృష్టితో చూడటం వీరి కవితా దృక్పథంలోని ఒక ప్రత్యేకత. మతాన్ని, కర్మసిద్ధాంతాన్ని ఈ దృష్టితోనే చూశారు కవి. దేవుని మీద విశ్వాసం ఉండి దేవుని పేరుతో జరిగే దోపిడీని, రాతిని పూజిస్తూ మానవుని ద్వేషించే దురాచారాన్ని ఖండించారు.[15] 'పాంచజన్యం'లో ఈ కవితా దృక్పథాన్ని చూడవచ్చు.

''కర్మము పేరు చెప్పి నరకమ్మును సృష్టి యొనర్చి వర్ణవుం
ధర్మములన్న పేరున నధర్మపు టుద్ధతికాండ బెంచి యే
మర్మములేని మానవుల మధ్యను గోడలు పెట్టి నేటికిన్
కర్మము రుద్దు మానవులు గల్గిన దేశము నీది బాలకా!''[16] కర్మ సిద్ధాంతానికి మూలం పునర్జన్మ సిద్ధాంతమే. గత జన్మలోని కర్మఫలమే ప్రస్తుత జన్మలోని మంచిచెడ్డలకు ఆధారమని ఈ సిద్ధాంతం నమ్ముతుంది. తన పూర్వజన్మ కర్మఫలాన్ని బట్టి ప్రస్తుతజన్మలోని సుఖదుఃఖాలు ఆధారపడి ఉంటాయని

కర్మసిద్ధాంతం చెబుతుంది. కాని ఇటువంటి కర్మసిద్ధాంతాన్ని ఖండించారు కవి.[17]

జ్ఞానానందకవి గారి కవిత్వంలో ప్రధానంగా కనిపించే మరో ప్రధాన లక్షణం భారతీయ సంస్కృతి పట్ల గౌరవ భావం. సంఘంలోని అధి క సంఖ్యాకుల ఆదర్శజీవన విధానమే సంస్కృతి. ఇది జాతి సర్వతోముఖ ఔన్నత్య ప్రగతులకు బంగారు బాటలు వేసిన అనేక సత్సంప్రదాయాల కూడలి. భారతీయ సంస్కృతి సాంఘికంగా, సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా ఉన్నతదశలో కనిపించాలనే ధ్యేయం వీరిలో కనిపిస్తుంది. దీన్ని మిళితం చేస్తూ జాతీయతను దేశభక్తిని ప్రేబోధించే కవితా దృక్పథాన్ని వీరి ప్రతి రచనలోనూ దర్శించవచ్చు. డా.ఎం. సుబ్బారెడ్డిగారు భావించినట్లు *"ప్రాచీన భారతీయులకు జన్మభూమిమీదా, నదీ నదాలమీదా, పర్వతాల మీదా, ప్రకృతి మీదా, భక్తి ఉన్నమాట కాదనలేం. కానీ అది చాలా వరకూ వైయక్తికమైంది. ఆధునిక అభివృద్ధి చెందిన జాతీయతాభావం దానికి భిన్నమైంది. దీనిలో సమిష్టి లక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది."*[18] అదే విధంగా జ్ఞానానందకవి గారి కవిత్వంలో కూడా జాతీయతాభావంతో సమిష్టి లక్షణాన్ని వ్యక్తంచేస్తూ వచ్చిన దేశభక్తిపూరితమైన కవిత్వాన్ని చూడవచ్చు. వీరు ఏమతానికి చెందినా మానవత్వాన్ని పెంపొందించే కవితా దృక్పథాన్ని మాత్రం వీడలేదు. 'ఆహ్వానం' ఖండకావ్యంలో

*"ఇవి హిమాలయములు వివరించు నీజాతి*
*ప్రత్యగ్రమౌ మహౌన్నత్య చరిత*
*ఇవి గంగా జలములు నవరించు నీ దేశ*
*కల్యాణములకు బంగారు పంట*
*ఇవి క్షేత్రరాజ్యాల నవనాలు పలికించు*
*విశ్వక్షమా శాంతివిమల వాణి*
*ఇవి త్యాగమూర్తుల ప్రవిమలంబయిన ర*
*క్తత్యాగ దీపాల ధర్మకాంతి*

*ఎవరి జీవితమ్ము లేరీతి వైనను*
*జాతి సమత కొఱకు సాగినార*
*లేక బాట జనము లీమహాభారత*
*చరిత గొప్పదనుచుఁ జాటవలయు.*[19] అని చెప్పి భారతీయ సంస్కృతినీ, గొప్పతనాన్నీ కీర్తించారు. వీరి మతమేదైనా క్రైస్తవ, హిందు, ముస్లిం, బౌద్ధ మతాలకు చెందిన రచనలను చేశారు. దీనివల్ల విశ్వమానవ కల్యాణభావం కలిగించటమే వీరిధ్యేయంగా గోచరిస్తుంది. *"అన్ని మతములందునూ ప్రధానమగు మానవ కల్యాణభావముండుటచే భారత ధర్మమున విరుద్ధములేమియూ లేవు భేదకమందేకత యుండుట (UNITY IN DIVERSITY) సృష్టి నియమమేగదా"* అని జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 'జాతీయత్వము–అంతర్జాతీ

యత్వము' వ్యాసంలో సమైక్యతా భావాన్ని వివరించారు.[20] అదే విధంగా జ్ఞానానందకవి గారుకూడా క్రీస్తుచరిత్ర, పాంచజన్యము, గోల్కొండ, ఆమ్రపాలి మొదలైన భిన్న మతాలకు చెందిన కావ్యాల్లో కూడా మానవులంతా ఒక్కటే అనే భావాన్నీ వెల్లడించారు. 'ఆహ్వానం' లో మతం పట్ల తమ అభిప్రాయాన్ని-

*'మతములన్ని మానవతఁజాటునని తెల్పి*
*మతము పేర నొరుల ఖతము సేయు*
*దొంగ సాధులన్న కొంగ జపాలన్న*
*కిట్టరాని యేవగింపు నాకు''* అని స్పష్టం చేశారు కవి.[21]

'కళాప్రపూర్ణ'ను ప్రదానం చేసినపుడు ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రచురించిన ప్రశంసా పత్రంలో 'జాతీయతారాష్ట్రీయతలసామరస్యమూర్తి' గా కవిని అభివర్ణించారు.[22] ఇదే అభిప్రాయాన్ని కొంతమంది సాహితీ వేత్తలు కూడా వ్యక్తీకరించారు.[23] భారతీయతను దానిలో అంతర్లీనంగా తెలుగు సంస్కృతిని వారి రచనల్లో కీర్తించటమే దీనికి కారణం.

జ్ఞానానందకవిగారు విశ్వనాథ, జాషువా, దాశరథి, కాటూరి వెంకటేశ్వరరావు, దేవులపల్లి, కాళోజి మొదలైన వారితో సాహితీచర్చలు జరిపేవారు.[24] కవి పద్యంలోనే కవిత్వం రాయటానికి ఇటువంటి సాహితీచర్చల ప్రభావం కూడా తోడ్పడిందని భావించవచ్చు. అంతేకాకుండా పద్యం పట్ల వీరు ప్రత్యేక అభిమానాన్ని కూడా ప్రకటించారు. 'ఆహ్వానము' ముందుమాటలో దీన్ని వివరిస్తూ *''చాలామంది సంయమన సమన్వయ స్వభావ రహితులు పద్యము చచ్చిపోయినదని యందురు. అనిన వారలటు లౌదురేమోకాని పద్యము చావదు భాషయున్నంతవరకూ పద్యము నిలుచును ఈ పలుకులలో మఱొక భావనకు చోటు లేదు.''* అని కవిగారే ప్రకటించారు.[25] వీరి కవిత్వంలో తెలుగు నుడికారపు సారళ్యం శబ్దసౌష్టవం కన్పిస్తాయి. 'పాంచజన్యం' లో ఈ విషయాన్ని

*''కమ్మని తేట తెన్గు నుడికారపు సొంపు రసార్ద్ర దివ్య భా*
*వమ్ము లిఖింప నేర్పు ప్రతిభా యుతుడైన కవీంద్రు డొడ్డగం*
*టమ్మునమండు గాని కవనమ్ము రచింప నెరుంగ లేని ద*
*ద్దమ్మ కలానికీ విషయమందునె తన్నుక చచ్చె నేనియున్-*[26] అని

స్పష్టీకరించారు. ఈ విధంగా వీరి కవితా దృక్పథంలో ప్రధానంగా భారతీయ సంస్కృతిపై అభిమానం, మానవతా దృష్టి సర్వమత సమభావం తెలుగు భాషపట్ల అభిమానం, ఏ సమస్యనైనా సంస్కరణ దృక్పథంతో పరిశీలించడం, అనర్థదాయకాలైన విదేశీ ఆచార వ్యవహారాలపై విముఖత, సంప్రదాయ పద్యకవిత్వం ద్వారా అభ్యుదయ భావాలు వ్యక్తం చేయటం కన్పిస్తున్నాయి.

డా॥యస్. టి. జ్ఞానానందకవి గారిని వివిధ విశ్వవిద్యాలయాలు

తగురీతిలో సత్కరించాయి. 'వంశధార' ఖండకావ్య సంపుటికి తెలుగువిశ్వవిద్యాలయం, 'ఆమ్రపాలి' కావ్యానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడామీ అవార్డులనిచ్చాయి. ఆంధ్రవిశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణను', తెలుగు విశ్వవిద్యాలయం 'గౌరవ డాక్టరేట్'ను ప్రదానం చేశాయి. ఇవే కాకుండా మరి ఎన్నో బిరుదుల పురస్కారాలు కవిగారు పొందారు. మొదటి కావ్యం 'తరంగమాల' (1944) మొదలుకొని సుమారు 36కావ్యాలు వరకూ రాసిన (చూ: అనుబంధం) వీరు నేటికీ సాహితీ వ్యవసాయం చేస్తూనే ఉన్నారు. జ్ఞానానందకవి రచనల్లోనూ జీవితంలోనూ వారి కవితా దృక్పథం కూడా ప్రదర్శితమౌతుందనే డా. గుజ్జర్లమూడి కృపాచారిగారి వ్యాఖ్య.[27] ఎంతో పరిశీలనతో చేసిందని చెప్పవచ్చు. జీవితంలోనూ సాహిత్యంలోనూ ప్రత్యేక వ్యక్తిత్వాలు కలవారు న్నప్పటికీ జీవించిన జీవిత్మం తమ సాహిత్యంలోనూ, తాము సృష్టించిన సాహిత్యం తమ జీవితంలోనూ ప్రతిబింబించే కవులు మాత్రం చాలా అరుదుగా ఉంటారు. అటువంటి వారు సృష్టించిన సాహిత్యం సమాజంలో మానవతావిలువల పునరుద్ధరణకు ఎంతగానో దోహపడగలుగుతుంది. డా. జ్ఞానానందకవిగారు ఒక చారిత్రక అంశాన్ని ఇతివృత్తంగా తీసుకొని రాసిన. 'ఆమ్రపాలి' కావ్యంలో సమాజం పట్ల కవికున్న ఆర్తి, మానవతా విలువలకిచ్చిన ప్రాధాన్యం అడుగడుగునా కనిపిస్తూనే ఉంటుంది. దీన్ని రాబోయే అధ్యాయాల్లో సందర్భానుసారంగా ప్రస్తావించటానికి ప్రయత్నిస్తాను.

# రెండవ అధ్యాయం
# ఆమ్రపాలి
## కావ్యస్వరూప స్వభావాలు

## 2.0. ఆమ్రపాలి కావ్య స్వరూప స్వభావాలు

డా॥యస్. టి. జ్ఞానానందకవి రాసిన కావ్యాల్లో, ఆమ్రపాలి విశిష్టమైంది. జాతక కథల్లోని కథలను తీసుకొని ఎంతోమంది బౌద్ధమత వస్తువుగా ఎన్నో కావ్యాలను, నవలలను, నాటకాలను రాశారు. తిరుపతి వేంకటకవుల 'బుద్ధచరిత్రము;' పింగళి, కాటూరి కవుల 'సౌందరనందము;' కరుటూరి సత్యనారాయణగారి 'తిష్యరక్షతి;' 'ఆమ్రపాలి' శారదగారు 'ఆమ్రపాలి;' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'కరుణశ్రీ;' బోడేపూడి వెంకటరావుగారి 'కళాక్షేత్రము;' సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి 'జాతక కథాగుచ్ఛము;' బ్రహ్మాజీరావుగారి 'నవధర్మము;' ముదివర్తి కొండమాచార్యులవారి 'ధర్మదీక్ష;' లల్లాదేవిగారి 'ఆమ్రపాలి' మొదలైనవి తెలుగులో వచ్చిన బౌద్ధమతేతివృత్త రచనలు. హిందీలో 'వైశాలికీనగరవధూ' అనే నవలను చతురసేన్ శాస్త్రి; భట్నాగర్

రామ్‌రతన్ 'అంబాపాలి' అనే నవలలను రాశారు. వీటిలో కొన్ని తెలుగు అనువాదంకూడా పొందాయి.

ఇంతప్రసిద్ధమైన 'ఆమ్రపాలి' కథకు స్వతంత్ర కల్పనలను జోడించి రమణీయమైన కావ్యాన్ని జ్ఞానాందకవి తెలుగు వారికి అందించారు. దీన్ని నలభై ఎనిమిది (48) గంటలలో రాశారు. మూలకథను ఏదో ఒక కావ్యం నుండి తీసుకోలేదని, మిత్రులు చెప్పిన కథను అనుసరించి కావ్యాన్ని రాశానని కవే స్వయంగా చెప్పారు. (చూ. విగారితో ముఖాముఖి) 319 పద్యాలు గల ఈ ఆమ్రపాలి కావ్యంలో ఎనిమిది ఆశ్వాసాలు ఉన్నాయి. ఒక్కొక్క ఆశ్వాసానికి ఒక్కొక్క శీర్షికను పెట్టారు. కావ్యం 1972లో మొదటి ముద్రణ జరిగింది. 1986నాటికి ఆరవ ముద్రణకు చేరింది. బుద్ధుడు బోధించిన అష్టాంగమార్గాన్ని దృష్టిలో పెట్టుకొని ఎనిమిది ఆశ్వాసాలుగా కావ్యాన్ని విభజించి ఉండవచ్చు. వాట వివరాలు కింది విధంగా ఉన్నాయి. *1. అవతరణము (35 పద్యాలు) 2. స్వయంవరనము (51) 3. సందర్శనము (35) 4. చింతనము (40) 5. ఆహ్వానము (52) 6. ఆగమణము (58) 7. వివరణము (32) 8. స్వీకరణము (16)* ఆమ్రపాలి 1986లో ముద్రించబడిన ఆరవముద్రణ ముఖ చిత్రంపై కవిపేరు 'సురగాలి తిమోతి జ్ఞానానందము' అని ఉండగా అట్టవెనుక, లోపలి పుటమీదా కవిపేరు 'కళాప్రపూర్ణ డాక్టర్ యస్.టి. జ్ఞానానంద కవి' అని ప్రచురించారు. (చూడు: ఈగ్రంథ ముఖచిత్రం) ముఖచిత్రం మొదటి ముద్రణ నాటిదే ఆరవ ముద్రణకు కూడా గ్రహించి ఉంటా రు. కవిగార్కి 1974 ఆగస్టు 3వ తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ;' ను ప్రదానం చేసింది. దీన్ని అందుకొన్ని తరువాత ముద్రించబడిన ఆమ్రపాలి పునర్ముద్రణలో ఈ విధమైన మార్పును చేసి ఉంటారు. జ్ఞానానందం గారు నేటికీ కాకినాడ పరిసర ప్రాంతాలలో కవిగారుగానే ప్రసిద్ధి కావున జ్ఞానానందకవి గానే ప్రసిద్ధిపొందటం చేత ఈ పరిశోధన వ్యాసంలో 'జ్ఞానానందకవి' గానే సంబోధించడం జరుగుతుంది. 'ఆమ్రపాలి' కథానాయిక పేరునే కావ్యానికి కూడా పెట్టారు. ఆమ్రపాలి ఆమ్ర వనంలో అనాథగా దొరకటం, ఆమ్రవనంలోనే బుద్ధుడిని తొలిసారిగా దర్శనం చేసుకోవటం, ఆమ్రవనంలోనే బౌద్ధబిక్షను స్వీకరించటం వల్ల ఆమ్రవనాని (మామిడి తోట)కి చాలా ప్రాధాన్యం కలిగింది. ఆమ్రపాలి ఒక గణభోగ్య పూర్వం కొన్ని గణతంత్ర రాజ్యాల్లో అందమైన యువతి ఉంటే ఆమెను గణభోగ్యగా మార్చేసుకొనేవారు. ఆ రాజ్యంలో ఉండే రాజులు, యువరాజులు, నగర ధనవంతులు, పురప్రముఖులు 'అనుభవించటానికి' వీలుగా ఒక శాసనం ద్వారా ఆ యువతిని 'గణభోగ్య' గా ప్రకటిస్తారు. ఆ యువతి ఇష్టాయిష్టాలతో పని లేకుండానే ఆ అందమైన కన్యను గణమంతా భోగాలను అనుభవించేందుకు వీలుగా 'గణభోగ్య' గా మారుస్తారు. ఇది ఆ గణతంత్ర రాజ్యంలో చక్రవర్తి చేసే శాసనం ప్రకారం జరిగే ప్రక్రియ. నాటినుండీ ఆమెకు

విధించిన నియమ నిబంధనలను అనుసరించి ఎవరైనా అనుభవించవచ్చు. అలా అనుభవింపబడే యువతినే 'గణభోగ్య' అని పిలుస్తారు. అటువంటి గణభోగ్యగా ఆమ్రపాలి మానసికవ్యధకు లోనైనప్పుడు తాను దొరికిన ఆమ్రవనం లోకే పోయి విశ్రాంతి కోరుకొంటుంది. ఇన్ని ప్రత్యేకతలు ఉండడంచేత 'ఆమ్రపాలి' నామసార్థకత కూడా చేకూరింది.

## 2.1. చారిత్రక కావ్యం:

ఆమ్రపాలి కావ్యం చారిత్రక కావ్యలక్షణాలను కలిగి ఉంది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు చారిత్రక కావ్యమంటే ఏమిటో వివరిస్తూ- ''*ఒక పురుషార్థాన్ని కానీ, ఒక ప్రయోజనాన్ని కానీ సాధించటానికి ఆరంభమైన ఒక కార్యం, విస్తరిల్లి ఫలవంతమయ్యేంత వరకు స్వయం సమగ్రంగా చిత్రింపబడే వస్తు జీవిత కావ్యం. ఇందులోని వస్తువు చారిత్రకమైతే అది చారిత్రక కావ్యం అవుతుంది* అని పేర్కొన్నారు.[29] ఆమ్రపాలి కావ్యంలో వస్తువు చారిత్రకమైందే. క్రీస్తు పూర్వం 6వ శతాబ్ది మధ్యకాలంలో మగధను బింబిసారుడూ, వైశాలినీ నగరాన్ని విచ్చవులూ పరిపాలించారు. షోడష మహాజనపథాలు అని పిలువబడిన 16 రాజ్యాల్లో మగధ, వైశాలినీ రాజ్యాలు కూడా ఉన్నాయి. మగధరాజ్యం మిగిలిన రాజ్యాలకంటే బలమైంది కావటంతో, మగధరాజుకి మిగిలిన రాజ్యాలు కొంత భయపడేవనే చెప్పవచ్చు. ఈ రాజ్యాలు నిరంతరం తమలో తాము కలహించుకొంటుండేవి. దానివల్ల శత్రురాజ్యాలుగానే పిలువబడ్డాయి. ఆర్థిక లావాదేవీలు ముఖ్యంగా 'కార్షపణ' అనే నాణాల ద్వారా జరిగేది. వెండి, బంగారం ప్రధానంగా చెలామణీలో ఉండేది. వీటికే విదేశీ వ్యవహారాల్లో ఎక్కువగా విలువ ఉండేది. వాస్తు శిల్పకళ బాగా అభివృద్ధి చెందింది. బింబిసారుని ఆస్థానంలో మహాగోవిందుడు అనే వాస్తుశాస్త్రవేత్త ఉన్నట్లు తెలుస్తుంది. స్త్రీలను పరిపాలనలో పాలు పంచుకోన్వకుండా, కేవలం అంతఃపురాలకే పరిమితమైయ్యేటట్లు చేశారని చరిత్ర వల్ల తెలుస్తుంది. అయితే ఇవి చారిత్రకమైన అంశాలు. చరిత్ర కావ్యంగా మారినపుడు 'చరిత్రలో లేని కళానుభావం చారిత్రక కావ్యం లోకి వస్తుంది. ఆ అనుభవం కోసమే అది పుడుతుంది: దానిలోనే జీవిస్తుంది.[30]

చరిత్రలో పేర్కొన్న అనేకాంశాలను కవి కావ్యంలో పాత్రపరంగా, సన్నివేశపరంగా సందర్భోచితంగా వర్ణించారు. దేశాన్ని, కాలాన్ని, వస్తువుని జాగ్రత్తగా తీర్చిదిద్ది ఔచిత్యాన్ని పాటించారు. బింబిసారుడు, బుద్ధుడు సమకాలికులు. అది కావ్యంలో కూడా వర్ణితమైంది. బుద్ధుడు ఒకవైపు బౌద్ధమతధర్మాన్ని వ్యాప్తిచేస్తుంటే, బింబిసారుడు మరొకవైపు మగధ రాజ్య విస్తరణను కొనసాగించాడు. బింబిసారునిలోని బుద్ధిబలం, భుజబలం మొదలైన వీరునికి ఉండవల్లసిన లక్షణాలన్నీ కావ్యంలో చిత్రితమైయ్యాయి. (చూ:

పాత్రపోషణ:) గౌతమ బుద్ధుడు బౌద్ధమత ప్రవక్తగా దయామయునిగా అష్టాంగ మార్గాన్ని బోధించటం, సర్వజీవులపట్ల కరుణను ప్రదర్శించటం వంటివి అన్నీ చారిత్రక అంశాలే. ఇవన్నీ కూడా కావ్యంలో వర్ణితమైయ్యాయి. చారిత్రకాంశాలను తీసుకొన్నంత మాత్రాన ఈ కావ్యాన్ని వీరరస ప్రధాన కావ్యంగా మాత్రం మలచలేదు. శాంతమే ప్రధాన రసంగా పోషించబడింది. రసచర్చలో దీన్ని విశదీకరించటానికి ప్రయత్నిస్తాను. 1975లో ఆమ్రపాలి కావ్యానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది. కొన్ని విశ్వవిద్యాలయాలు దీన్ని డిగ్రీ వారి పాఠ్యాంశంగా కూడా కొన్నాళ్లు బోధించారు.

## 2.2. ఆమ్రపాలి మూలకథ

డా॥జ్ఞానానందకవిగారు ప్రత్యేకించి ఒక మూలగ్రంథం నుండి తీసుకోలేదని వెల్లడించినా, ఈ కథకు మాత్రం మూలమైన గ్రంథం ఉండకపోదు. బౌద్ధజాతక కథల్లో 'ఆమ్రపాలి' కథ ఉంది. పాళీభాషనుండి కొంతమంది అనువదించిన కథలు Prof.E.D.COWELL గారి సంపాదకత్వంలో వెలువడ్డాయి. అవి *Stories of the Buddha's Former Births* పేరుతో ప్రచురించారు. అవి ఆంగ్ల భాషలో ఉన్నాయి. క్షేమేంద్రుడు సంస్కృతంలో బుద్ధుని జాతక కథల సంగ్రహాన్ని 'బౌద్ధావదాన కల్పలత' పేరుతో రచించాడు. వీటిని బహు భాషాకోవిధుడైన శ్రీ తిరుమల రామచంద్ర సంస్కృత మాతృక నుండి తెలుగులో ***'క్షేమేంద్రుని బోధి సత్వావదాన కల్పలత'*** పేరుతో అనువదించారు. దీనికీ జ్ఞానానందకవి గారి ఆమ్రపాలి కావ్యానికీ కొంత సన్నిహితత్వం కన్పిస్తుంది. 'అవదాన కల్పలత' లో ఆమ్రపాలి ఆమ్రవనంలోని అరటి బోదెనుంచి పుట్టి, మహానామునికి దొరుకుతుంది.(మూల గ్రంథం పుట : 174) అమెను ప్రేమతో పెంచి పెళ్లి చేయాలనుకుంటాడు. కానీ గణరాజ్యం లో పుట్టిన కన్య గణరాజ్యానికే చెందాలనే నియమానికి పెళ్లి చేయటం ప్రతికూలం కావటం వల్ల ఆతని ప్రయత్నాన్ని, అతని గణం సహించలేదు(పు:175). ఆ ఆచారం ఉంటే గణభోగ్యగా ఉంటానని ఆమె తన తండ్రితో చెప్పి, ఒకరు తన వద్ద ఉండగా మరొకరు రాకూడదు. నా ఇంట్లో ఉండటానికి పణంగా దినానికి ఐదువందల కార్షపణాలు చెల్లించాలి. అలా వచ్చినవాడు ఏడు నాళ్ల మాత్రమే తన ఇంట్లో ఉండటానికి కుదురుతుంది. అంతకు మించి ఉండరాదు. నియాన్ని ఉల్లంఘిస్తే శిక్షించాలని వివరిస్తుంది. దానికి గణంలోని అందరూ అంగీకరిస్తారు.

ఆమె ఒక ప్రత్యేక భవనంలో ఉండేది. తగిన డబ్బు చెల్లించినా, ఆమెను పొందాలనుకొన్న వాళ్ల శక్తిహీనులైపోయేవారు. ఆమె యొక్క వినోదాల కాలక్షేపం కోసం నానాదేశాలనుంచి వచ్చిన చిత్రకారులతో నానాదేశ రాజుల చిత్రాలను తన భవనంలో గీయించింది. అందులో బింబిసారుని చిత్రం ఆమె బాగా ఆకర్షించి,

చిత్రకారుణ్ణి వివరాలు అడిగి తెలుసుకొని బింబిసారునిపై ప్రేమను పెంచుకొంటుంది. మగధరాజ్యంలో బింబిసారుడు కూడా అందరికీ గణభోగ్య అయిన ఆమ్రపాలిని పొందాలనుకొని, మిత్రునితో చర్చించి, మారువేషంతో వైశాలీ నగరం చేరుకుంటాడు. వెంట మిత్రుడు గోపుడిని కూడా తీసుకుని వెళతాడు. 'ఏడురాత్రులు భవనంలో గడుపుతాడు' ఆమె గర్భం ధరిస్తుంది. ఆ విషయాన్ని అతనికి తెలుపుతుంది. భావిపుత్రుని ఆనవాలు తెలుసుకోవడానికి నమ్మకమైన గుర్తుగా ఉంగరం ఆమెకిచ్చి వెళ్లిపోతాడు.(పుట :177)

ఆమ్రపాలి కొన్నాళ్లకి బింబిసారుని ప్రతిబింబం వంటి కుమారుణ్ణి ప్రసవిస్తుంది.పుట : 178) బింబిసారుని పోలికలు ఉన్నాయని ఆ పిల్ల వాణ్ని తోటి పిల్లలు ఏడిపిస్తుంటారు. ఆ విషయాన్ని తల్లికి చెబుతాడు. ఆమె తన కుమారునికి చదవదగిన వయస్సు వచ్చిందని గ్రహించి, ఉంగరాన్నిచ్చి మగధ రాజ్యానికి పంపుతుంది. తనలాగానే ఉన్న ఆ కొడుకుని సంతోషంతో స్వీకరిస్తాడు బింబిసారుడు.

ఆమ్రపాలి వృత్తాంతాన్ని అంతటినీ తెలుసుకోవాలనుకొన్న శిష్యులు ఆమె పూర్వ జన్మ కథను కూడా చెప్పమని బుద్ధుడిని అడుగుతారు. ''పూర్వం రాజ గృ హంలో రాజోద్యాన వనంలో 'మాలతి' అనే ఉద్యావనపాలిక ఉండేది. ఆమె ఒకసారి అకస్మాత్తుగా తన ఎదుట వస్తున్న ప్రసాదార్హుడు, ప్రత్యేక బుద్ధుడు అయిన ఒక రాజర్షిని దర్శించి, మామిడిపూతతో పూజించి 'నేను రాజులకు అయోనిజ అయిన భార్యగాపుట్టాలి' అని నిండు మనసుతో కోరుకొని ప్రణిదానం చేస్తుంది. ఆ పుష్పచయ పూజా పుణ్యం అనుభవించే భాగ్యశాలినే ఆమ్రపాలక!' అని ఆమె పూర్వ జన్మ వృత్తాంతాన్ని బుద్ధుడు వివరించటం, శిష్యులు విని విస్మయం చెందటంతో 'ఆమ్రపాల్యావదానం' ముగుస్తుంది. దీన్నిబట్టి కథలో చాలా అంశాలతో పోలిన కథ డా॥జ్ఞానానందకవి గారి ఆమ్రపాలి కావ్యంలో కన్పిస్తున్నా, ఆయాపాత్రలను, సంఘటనలను,స్వకల్పితంతో ఔచిత్యాన్ని పాటించి రాశారని పరిశీలన వల్ల వెల్లడవుతుంది.

## 2.3.మూలకథలో చేసిన మార్పులు:

1. ఆమ్రవనంలో అక్కడక్కడా అరటి మొక్కలను కూడా నాటుతుంటారు. అలా లాభాన్ని ఎక్కువగా ఆర్జించవచ్చు. అది ఒక వ్యవసాయ పద్ధతి. మామిడి తోటల మధ్య ఉండే అరటిబోదెనుంచి ఆమ్రపాలి పుట్టినట్లు మూలకథలో వర్ణించారు. కానీ జ్ఞానానందకవి ఆమ్రపాలి ఆమ్రవనంలో శాక్యధనికునికి దొరికినట్లు వివరించారు.(1-5)

2. ఆమ్రపాలికి పెళ్లిచేయాలనుకోవటం రెండింటిలోనూ ఉంది.

3. గణరాజ్యంలో పుట్టిన కన్య గణరాజ్యానికే చెందాలనే ఆచారం ఉన్నట్లు మూలకథలో ఉంది. (పుట:173) ప్రస్తుత కావ్యంలో అటువంటి ఆచారాలు ఉన్నట్లు ఎక్కడా పేర్కొనలేదు. ఎందుచేతనంటే బింబిసారుడు చారిత్రకంగా వైశాలినిలో గల చాటకనగరాధిపతికుమార్తె 'చాలన'ను పెళ్లిచేసుకున్నాడు. ఇదొక చారిత్రక సత్యం. దీన్ని విస్మరించకుండా కావ్యంలో శాస్త్రీయ దృష్టిని కూడా పాటించారు కవి.

4. గణభోగ్యగా ఆమ్రపాలిని మార్చుకోవాలనే రాజుల కాంక్ష రెండింటిలోనూ వ్యక్తమైంది. లిచ్ఛవులు తిరుగుబాటు చేసే పరిస్థితీ వర్ణితమైంది.

5. గణభోగ్యగా కొన్ని నియమ నిబంధనలు పెట్టటం మూలకథలో ఉన్నట్టు ఉన్నా, నిర్వహించిన విధానం వేరుగా చిత్రితమైంది. మూలకథలో నియమాలను తండ్రికే చెప్పి పంపుతుంది. (పుట:175). జ్ఞానానందకవి దాన్ని మార్పులు చేసి స్వయంవరసభ సన్నివేశం సృష్టించి, ఆ సభలో ఆమె లిచ్ఛవులతో ప్రత్యక్షంగా మాట్లాడినట్లు చిత్రించారు(2-32). దీనివల్ల కావ్యంలో తండ్రి ఔన్నత్యాన్ని కాపాడినట్లయ్యింది.

6. మూలకథలో 'దినానికి ఐదువందల కార్షపణాలు' చెల్లించటం, ఏడు రోజులు మాత్రమే ఇంట్లో ఉండటానికి అంగీకరించటమనే నియమాల ఉండగా, ఆమ్రపాలి కావ్యంలో 'ఐదువందల బంగారు నాణెలు' చెల్లించాలని, ఇంటిని సోదా చేయాలనుకుంటే వారానికి చివరిరోజు మాత్రమే అనుమతినివ్వటమనే (2-47) నియమ నిబంధనలను ఏర్పాటు చేసినట్లు వర్ణించారు.

7. మూలంలో ఆమె తనభవనంలో కాలక్షేపం కోసం రాజుల చిత్రాలను చిత్రింపజేసుకొంటుంది. (పుట:175) కావ్యంలో 'శృంగారమ్ము కెపైక్కు మోహన రూపాంచితమైన చిత్రముల్ వ్రాయన్ గొప్ప శిల్పుల్ కళాధనులేతెంచిరి' (4-3) అందులోని బింబిసారుని చిత్రం ఆమెను ఆకర్షించినట్లు రెండింటిలోనూ ఉంది.

8. బింబిసారుని వివరాలను చిత్రకారుణ్ణే ఆమె అడిగితెలుసుకొన్నట్లు మూలం (పుట:176)లో ఉంది. కావ్యంలో తనకు ఇష్టమైన చెలికత్తెను అడిగి తెలుసుకొంటుంది.(4-25)

9. మారువేషంతో బింబిసారుడు తన మిత్రుడైన గోపుడిని వెంటబెట్టుకుని వైశాలీనగరం లోని ఆమ్రపాలి భవనానికి వెళ్లటమనేది రెండింటిలోనూ ఉంది.

*''క్షాపతి మార్చినాడు తన సజ్జను విచ్చువ భూమిభాగపున్*
*దాపులలోన, గోపుడును దాలిచె వేఱొక వేసమున్''(5-22)*

10. మూలకథలో బింబిసారుడు ఏడు రాత్రులు ఆమ్రపాలి ఉన్న భవనంలో గడుపుతాడు. ఆమె గర్భంధరించటం, ఆ విషయాన్ని వెంటనే అతనికి వివరించటం, దానికి స్పందించి పుట్టబోయే పుత్రుణ్ణి గుర్తించటానికి వీలుగా ఉంగరం ఇవ్వటం జరిగిపోతుంది. కావ్యంలో 'ఆఱురోజులు మహాసుఖతాప్రణయైక గాఢానుమతిన్ హాయిగా కాలాన్ని వెళ్లబుచ్చుతారు. (5-28) వెంటనే గర్భం ధరించిందో ధరించలేదో తెలియటమనేది నవ్వు పుట్టించే విషయం. కాబట్టి దాన్ని మార్పుచేసి, *''కాంత! నీకు పూర్తిగా నవమాసాలు నిండెనేని కడుపు పండెనేని కొడుకు కల్గెనేని తొడుగుమీ యుంగర మనుచు బింబిసారుఁడనియెఁగూడ''* (5-32) అని మార్పు చేశారు కవి. దీనివల్ల కథపాడిగింపబడటమే కాకుండా, ఒక గణభోగ్యగా స్త్రీ ఎంత మానసిక వ్యధను అనుభవిస్తుందో చెప్పగలిగారు. సమాజం అటువంటివారిని ఎలా పరిగణిస్తుంటుందో చిత్రించారు. బుద్ధుడు అటువంటి వారినందరినీ చేరదీసారని వివరిస్తూ మానవతా విలువలను పాటించవలసిన సందేశాన్ని కూడ ఇవ్వగలిగారు కవి.

11. బింబిసారుని పోలికలోనే పుత్రడు జన్మించినట్లు రెండింటిలోనూ ఉంది. మూలకథలో ఉంగరం ఇవ్వటం ఆ గుర్తుని చూపిన పుత్రుణ్ణి తండ్రి స్వీకరించినట్లు పేర్కొన్నారు. (పుట:178) కానీ, కావ్యంలో ఉంగరాన్ని ఇచ్చినట్లు మాత్రమే ఉన్నప్పటికీ, తన పుత్రుణ్ణి స్వీకరించినట్లు ఎక్కడా చెప్పలేదు. కావ్య పరమార్థాన్ని సాధించటానికి ఈ మార్పు బాగా ఉపకరించింది.

12. మూలకథలో కూడా ఆమ్రపాలి పూర్వజన్మ వృత్తాంతాన్ని బుద్ధుడే వివరించినట్లు ఉంది. 'మాలతి' అనే ఉద్యానవనపాలిక రాజుకి అయోనిజ అయిన భార్యగా జన్మించాలనే వరానికి అనుగుణంగా ఆమ్రపాలి జన్మను వివరించారు. కానీ 'జ్ఞానానందకవి'గారు ఆమ్రపాలి పూర్వ జన్మవృత్తాంతం ఇంద్రుని శాపం వల్ల కలిగిందని స్పష్టంచేశారు. దీనివల్ల ఆమ్రపాలి పట్ల ఎంతో సానుభూతి ఏర్పడింది. మనుష్యులవట్ల ద్వేషభావం కలిగి ఉండరాదని, మానవుల కర్మ ఫలితంగానే జన్మ సిద్ధిస్తుందని వివరించారు. పునర్జన్మ సిద్ధాంతం కర్మసిద్ధాంతాన్ని బలపరుస్తుంది. గత జన్మలోని కర్మ ఫలమే ప్రస్తుత జన్మలోని మంచి చెడులకు ఆధారమని ఈ సిద్ధాతం నమ్ముతుంది. అంటే ప్రస్తుత జీవితంలోని కష్టసుఖాలన్నింటికీ పూర్వజన్మలో తాను చేసిన మంచిచెడులకు అన్వయించుకోవటం ప్రధానంగా కనిపిస్తుంది. అయితే కవిగారి దృష్టిలో కర్మసిద్ధాంతం వేరుగా ఉంది.(చూడు ముఖాముఖి) కానీ లోకంలో ప్రచారంలో ఉన్న కర్మసిద్ధాంతమే ఆమ్రపాలి కావ్యంలో కూడ అన్వయించారు. బుద్ధుని కర్మసిద్ధాంతం, పూర్వజన్మ సిద్ధాంతాలపై చాలామంది భిన్నాభిప్రాయాలను వ్యక్తంచేశారు.[32] ఈ విధంగా జ్ఞానానందకవి తనదైన రీతిలో ఎన్నో మార్పులు చేసి చక్కని కావ్యాన్ని రచించారు. కావ్య రచనా విధానాన్ని, విశిష్టతను పరిశీలించటానికి ముందుగా కావ్యేతివృత్తాంతాన్ని తెలిసికోవలసిన అవసరం ఉంది.

## 2.4.0. ఆమ్రపాలి కావ్యేతివృత్తం

## 2.4.1. ప్రథమాశ్వాసం (అవతరణము)

సూర్యుడు శత్రుసేనలతో యుద్ధం చేసి రక్తసిక్తమైన దేహంతో యుద్ధవీరుడిలా, పశ్చిమ కొండల్లో విశ్రాంతి తీసుకొంటున్నాడు. అదే సమయంలో వనవిహారానికి బయలుదేరిన శాక్యధనికుడికి (పద్య సంఖ్య 1) మామిడి తోటలో ఒక పసిపాప దొరుకుతుంది. (5) ఆ పసికూనకు దిక్కెవ్వరూ లేరని తెలిసికొని ఉంటాడు. ఎంతో ఆనందంతో ఇంటికి తీసుకొని వెళతాడు.(6) ఎంతో కాలంనుండి పిల్లలు లేని తమకి భగవంతుడే దయతో ఆశిశువుని ప్రసాదించాడని (7) సృష్టికర్తకు దంపతులిద్దరూ భక్తితో నమస్కరిస్తారు. (8) ఆ పసిపాప ఆమ్రవాటిలో దొరికినందువల్ల ఆమ్రపాలి పేరుతోనే పిలుస్తారు. (10) భార్యాభర్తలు ఇరువురూ ఆ పిల్లని సంతోషంతో పుణ్యఫలంగా చూసుకొంటారు.(11)

ఆమ్రపాలి శ్రద్ధతో నాట్యం, సంగీతం, సాహిత్యం మొదలైన లలితకళలలోనూ, ఇంకా తత్త్వశాస్త్రంలోనూ, ఆనాటి సంఘంలో స్త్రీకి అర్హమైన అన్నివిద్యలతోపాటు, క్షాత్ర విద్యల్లోనూ విజ్ఞానాన్ని ఆర్జిస్తుంది(13). అందచందాల్లో, గుణశీలంలో తనకు సమాన వయసుగలవారిలో తలమానికమై వెలుగొందుతుంది (18). తండ్రితోపాటు ఆమెను కూడా తనతో పాటు పూజా పురస్కారాలకు తీసుకొని వెళ్లేవాడు. ఆ సమయంలో దేవాలయాల్లో చేసే నాట్యాల్లో పాల్గొనేది (19). ఆరోజుల్లో కళ్లు మూసుకొనిపోయిన గర్వంతో వైశాలీనీ పట్టణాన్ని లిచ్ఛవ రాకుమారులు పరిపాలిస్తుండేవారు.(20) ఆమ్రపాలి అందాన్ని చూసి లిచ్ఛవ యువరాజులు గ్రుక్కలు మింగుతుండేవారు. (21). తమ కోర్కెలు నెరవేర్చుకోవటమే ధర్మంగా బతికే లిచ్ఛవుల గురించి శాక్యధనిడికుడికి తెలుసు. అది తలచుకొని, వాళ్లనుండి ఆమెకి ఏ ఆపద వస్తుందోనని ఆవేదన కలిగినా, దాన్ని పైకి చెప్పకుండానే ఉండేవాడు (22). ఎన్ని కష్టాలు వచ్చినాసరే తన కూతురికి పెళ్లిచేయాలనే భావించేవాడు (24). ఆ సంగతి మూన్నాళ్లకే జనపదాల్లోనూ, పట్టణాల్లోను వ్యాపిస్తుంది (27). ఎంతో సౌందర్యవతీ, కళాకోవిదురాలైన ఆమ్రపాలి పట్ల ఆశలు పెట్టుకున్న యువకుల గుండెల్లో ఏదో దిగులు మొదలవుతుంది (33). తండ్రి శాక్యధనికుడు స్వయం వరాన్ని ప్రకటించంతో ప్రథమాశ్వాసం ముగుస్తుంది.

## 2.4.2. ద్వితీయాశ్వాసం (స్వయంవరణము)

స్వయంవరసభలో ఆమ్రపాలి తండ్రి శాక్యధనికుడు రాజకుమారులతో అవకాశాన్ని పురస్కరించుకొని, ఆహ్వానాన్ని మన్నించి, వైశాలినీ పురాధీశ్వరులైన లిచ్ఛవప్రభువులు ఈ మహోత్సవంలో పాల్గొనటానికి వచ్చినందుకు ఆనందంగా ఉందంటాడు (6). తన కూతురు అందాలరాశి. అతిలోక శ్రేష్ఠురాలు, అన్ని కళల్లోనూ ప్రావీణ్యం సాధించిన ప్రతిభాశాలి, బంగారుమేలు తీగ అని చెప్పి ఆమెకు పెండ్లిచేయటానికే స్వయంవరసభను ఏర్పాటు చేశానని వెల్లడిస్తాడు (2). తన ఒక్కగానొక్క కుమార్తె మీలో ఎవరినో ఒకరిని వరిస్తుందని ప్రకటించగానే వారు నిశ్చేష్టులైపోతారు (7).

సభలో ఉన్న లిచ్ఛవులు ఆమ్రపాలి ఎవరో ఒక్కరికే దక్కటం ఇష్టం లేక కోపంతో రెచ్చిపోయి, ఈ అతిలోకసుందరికి పెళ్లేమిటి? స్వయంవర సభ ఏమిటి?(9). ఆమె ఒక్కనికే భార్యకావటానికి వీల్లేదు. ఆమె అందరికీ భార్యకావాలని (10) ఒక లిచ్ఛవ యువరాజు ప్రతిపాదిత పలుకు పలుకుతాడు. లిచ్ఛవాధీశులు ఆ ప్రతిపాదనను సమర్థిస్తారు. దాన్ని గమనించిన తండ్రి శాక్యధనికుడు ఆందోళనకు లోనవుతాడు(11).

బిడ్డలను కన్న తల్లిదండ్రులు వినగూడని మాటలు మాట్లాడుతున్నారు (15). ఎన్నో వ్రతాల ఫలంగా దేవుడా పిల్లనుమాకు ప్రసాదించాడు(16). విశాలమైన 'వైశాలిని' కి అధిపతులైన మీకు ఎదురుచెప్పడం తగదు (17). మునుపు ఎప్పుడూ ఇటువంటి చరిత్రలేదు (18) మానవులకు కొత్తమార్గాన్ని చూపటానికి తపస్సు చేసిన బుద్ధుని ధర్మాన్ని మీరు అనుసరిస్తున్నారు (20). ధమ్మాల నీతి సారాంశాన్ని గ్రహించలేదా? గురుకులాల్లో విద్యాభ్యాసం చేసిన మీకు తెలియనిదిలేదు(25). ఈ దేశంలో ధర్మదేవత నాలుగుపాదాలా నడిచింది. సాంఘికాచారాలకు దేవతలు పన్నీరు చల్లారు. అంత అటువంటి పుణ్యభూమిలో పుట్టినమీరు ఎన్నో శాసనాలను చేసి సామ్రాజ్యరథచక్రాన్ని తిప్పవలసినవారు. ఆమ్రపాలిని గణభోగ్యగా చేయవద్దు అనీ ఎన్నో నీతులను, ధర్మాలను విశదీకరించి ఆమ్రపాలిని వేశ్యగా మార్చేప్రయత్నానాన్ని విడనాడమని ప్రార్థించి, తన కుమార్తెను వారిలో ఎవరో ఒకరికి మాత్రమే ఇచ్చి వివాహం చేయాలనుకుంటున్నాను అని తన అభీష్టాన్ని పునరుద్ఘాటిస్తాడు.(22)

శాక్యధనికుని మాటకు లిచ్ఛవులు అంగీకరించరు. పరిస్థితిని అంతటినీ గమనిస్తున్న ఆమ్రపాలి, ఎంతో అనురాగమూర్తి అయిన తండ్రి నిస్సహాయుడైన స్థితిని చూచి, తానే ఒక నిర్ణయానికొస్తుంది (30). మెరుపు మెరిసినట్లుగా సభలో నిలబడి మందహాసంతో, మధురమైన మాటలను పలుకుతుంది (32).

'వీనులవిందైన మీ మాటల వలన నాకు మీరు అందరూ భర్తలౌతారనీ, దాన్ని నేను భరించాలని తెలిసింది (33). మీరు అన్నట్లుగానే మిమ్మల్ని భర్తలుగా భరిస్తూ, మీకిష్టమైనట్లు నడుచుకొంటూ వలపులను కురిపిస్తాను.(34). ముక్తకంఠమై నాకోసం కులుకుతున్నారు. దీనికి వగలు పెంచుకోవటమెందుకు. గణభోగ్యనౌతాను. (35).

'ఈ భరతభూమిలో ఏకపత్నీవ్రతులైన మహారాజులు ఉన్నారనే కథల్ని చిన్నప్పుడు చదువుకొన్నాను. అటువంటి ఇప్పుడేమీలేవు.(36). అడదాన్నే కదా అడిగేవాడెవడు? (36). కానీ ఒక కొన్ని షరతులు పెడుతున్నాను. వానికి అంగీకరిస్తే, మీరు కోరుకున్నట్లు నేనూ నడచుకొంటాను (37) అని అంటుంది. వాటిని ప్రకటించమని అడుగుతారు లిచ్ఛవులు (39). ఆమ్రపాలి నియమనిబంధనలను ప్రకటిస్తుంది (40).

'గౌరవమర్యాదలు, గొప్ప చరిత్ర గల మా తండ్రి శాక్యధనీంద్రుడు నా అచ్చటా ముచ్చటా తెలిపితే అవి మీకు రుచించలేదు. (41). గౌరవప్రదమైన క్షత్రియవంశంలో పుట్టి, ప్రజలను అమాయకులను చేసి, కామం కోసం అవివేకంగా ప్రవర్తిస్తున్నారు. (42). బుద్ధుడు పుట్టిన పవిత్రభూమిలో కన్యగా పుట్టడం పొరపాటవుతుందని భావించలేదనీ (44) ఆర్ష సంప్రదాయానికి మచ్చతెచ్చారని (45) ఎంతో గౌరవంగా చూసుకోవాల్సిన స్త్రీని వేశ్యగా చేయటానికి సాహసించారని బాధపడి (46) తన అసలు షరతుల్ని ప్రకటిస్తుంది.

'చక్కని ప్రదేశంలో అందమైన అద్దాలమేడను కట్టించాలి. రోజుకొక్కడే రసికుడు వచ్చి, ఐదువందల బంగారు నాణాలను చెల్లించాలి. నా ఇంటికి వచ్చిపోయేవాళ్ల వివరాలను అడకూడదు. ఇంటిని సోదా చేయాలనుకుంటే వారంలో చివరిరోజున మాత్రమే అనుమతి స్తానని, వీటికి ఇష్టపడితేనే గణభోగ్యగా ఉండటానికి అంగీకరిస్తానని అంటుంది (47).

షరతులు ప్రకటించిన తరువాత సభ కొంతసేపు స్తంభించిపోతుంది (48). ఆమెను అనుభవించాలని ఎదురు చూస్తున్న లిచ్ఛవులు ఆమె పెట్టిన షరతులన్నింటినీ అంగీకరిస్తారు (48). సభ్యులు అజ్ఞానానంద రసతరంగాల్లో తేలియాడుతుండగా సభముగుస్తుంది (51).

## 2.4.3.తృతీయాశ్వాసం (సందర్శనము):

గణభోగ్యగామారిన ఆమ్రపాలికి ప్రతిరోజూ వస్తున్న బంగారు నాణేలను చూచి, తన సౌందర్యాన్ని పొందటానికి సరసులు చేసే పనులకీ, తానేమిమాట్లాడినా 'ఒప్పు'గానే తలిచే పనిమనుషుల పొగడ్తలకు, ఇంటిలో ఉన్న నిత్యభోగాలకు విముఖత కలుగుతుంది. ఆమెకు అదీ, ఇదీ అని చెప్పటానికి వీలులేని ఏదో

భావసంఘర్షణకు లోనై, చివరికి ప్రపంచమే హేయంగా తోస్తుంది.(1). తన శేషజీవితాన్నైనా విశ్రాంతిగా గడపాలనుకొని, తానుదొరికిన మామిడితోటలోకి ప్రశాంతత కోసం వెళుతుంది (2). ఆకాశంనుండి స్వచ్ఛమైన వెన్నెల కురుస్తున్నా, ఆ కిరణాలు కిందికి ప్రసరించకుండా మామిడాకులు అడ్డుపడుతుంటాయి. అందువల్ల క్రీనీడలు క్రమ్ముకుంటాయి (6). ఆమెకు ఆ నీడల్లో బుద్ధుడు కనిపిస్తాడు. శాక్యధనినందన, లావణ్య యౌవన సుధాఖని అయిన ఆమ్రపాలికి మునిగా తేజోమయదేహంగలవాడిగా, మోహనకళా మహోదయనిధి గా అతడు కనిపిస్తాడు (8). తాను దొరికిన చోటనే తపస్సు చేసుకొంటున్న అతనెవరో తెలిసికోవాలని దగ్గరకు సమీపించి (9), ఎన్నో భోగాలు ఉన్నప్పటికీ ఇంత సుందరాకారాన్ని చూడలేదనుకొని, అతనితో కాపురం చేస్తే బాగుంటుందని ఆలోచించి, తన పుణ్యమెలా ఉంటుందోనని అనుకుంటుంది (11). శాక్యధని కూతురికెవరూ సాటిలేరనీ, తన కళానైపుణ్యంతో అతన్ని పొందాలని, అలాకాకపోతే తనది బతుకే కాదునుకొంటూ ఊహాప్రపంచంలో తన్మయమై పోతుంటుంది. (12). గౌతముడు ఆమ్రపాలిని గమనించి 'ఈ చిరువెన్నెలవేళలో భయంలేకుండా వచ్చావు. నువ్వెవరవు' అని ప్రశ్నిస్తాడు (13). ఆమ్రపాలి తన గురించి చెప్పుకొని తన ఇంటికి రమ్మనమనీ, ఇష్టపడితే సర్వభోగాలను సమకూరుస్తాననీ అంటుంది. (16)

సిద్ధార్థుడు చిరునవ్వుతో ప్రతి మానవునికీ చావు తప్పటం లేదని, ఆ కారణాన్ని, ప్రకృతిలోని రహస్యాలను తెలిసికోవాలనేదే తన ధ్యేయమని, ఆ అన్వేషణలో ఉన్నానని చెపుతాడు (26). తన తల్లిదండ్రులు మాయాదేవి, శుద్ధోధనుడూ, తన భార్యపేరు యశోధర, కొడుకు రాహులుడు అని, కపిలవస్తు పురానికి యువరాజుని కావలసివాడిననీ, తనని 'సిద్ధార్థుడు' అంటారనీ (30) రాగం, భోగం కంటే మోక్ష కారణాన్ని అన్వేషిస్తున్నాని వివరిస్తాడు (28).

అపుడు ఆమ్రపాలి 'తండ్రీ! చాలా పొరపాటుగా మాట్లాడాను. తమ బోధనకెంతో సంతృప్తి చెందాను. తమ తపఃజ్యోతులవల్ల నా హృదయంలోని చీకట్లు తొలగిపోయాయ'ని (31). సిద్ధార్థుని పాదాలమీద వాలుతుంది. (32), తప్పుగా మాట్లాడినందుకు క్షమించమంటుంది. కొంతసేపటి తరువాత 'ప్రభూ! మీ ఉనికి ప్రపంచానికి పండుగ. నేను పతితను. నన్ను రక్షించమంటుంది(32) భక్తితో తన ఆతిథ్యాన్ని స్వీకరించమంటుంది (32). తన తపఃసాధన పూర్తయితే మరోసారి వచ్చినప్పుడు ఆమె పెట్టే భిక్షను స్వీకరిస్తానని మృదువుగా సమాధానమిస్తాడు గౌతముడు.(34). నూతనానుభవంతో ఆమ్రపాలి సిద్ధార్థుడికి నమస్కరించి, మనసులో బుద్ధుణ్ణే నింపుకొని శెలవు తీసుకొంటుంది (35).

## 2.4.4. చతుర్థాశ్వాసం (చింతనము)

శాక్యధనుని కుమార్తె ఆమ్రపాలి గణభోగ్య కాబడిన వార్త అన్ని పట్టణాల్లోను, పల్లెలోనూ వ్యాపిస్తుంది (1). తన నిర్ణయంతో తల్లి దండ్రులు ఎంతగా కుమిలిపోయారోనని ఆమె మనసు అంతా అతలా కుతలమైపోతుంది (2). విచ్ఛవులు ఇంత నీచమైన పనికి ఒడికడతారని ఊహించలేకపోయాననీ (9) కాదంటే తరువాత జరిగే ఘోరానికి నేనే బాధ్యురాలినవుతానని (10), దాన్ని నివారించటానికి తనే ఓ నిర్ణయం తీసుకోవటం మంచిదని తలచింది (12). తాను తీసుకున్న నిర్ణయం పట్ల అటూ, ఇటూ తర్కించుకొని, ఏమైనా ఈ కఠినదీక్ష తీసుకోవటం వల్లనైనా ధర్మాన్ని స్థాపించాలనుకొంది. (13). నేర్చుకున్న విద్యను నలుగురికీ పంచటంలోనే ఆనందం ఉంటుందని భావిస్తుంది (15). 'నాకోసం సౌందర్య కళా పిపాసులు పడిగాపులు పడవలసిందే కదా!' అని సంతృప్తి చెందుతుంది (16). సంఘం తీసుకునే ఎటువంటి నిర్ణయానికైనా తల ఒగ్గవలసిందేననుకొంటుంది (17).

ఆమ్రపాలి కోసమే కట్టిన భవనంలోని గోడలమీద శృంగారాకాంక్షను కలిగించే చిత్రాలు వేయటానికి, శిల్పాలను చెక్కటానికి శిల్పులు వచ్చారు (3). భవనంలో రాజుల, గొప్ప వ్యక్తుల, ధనవంతుల చిత్రాలను, శిల్పాలను రమణీయంగా తీర్చిదిద్దుతారు (4). సమస్తకళల్లోని రహస్యాలనెరిగిన ఆమె, కళాకారుల ప్రతిభకు మెచ్చి, వారి చేతులనిండా బంగారు నాణాలను నింపి, సన్మానించి పంపిస్తుంది (19). కళాకారులు తమ విద్యకు తగిన గౌరవం లభించిందని సంతోషించి, ఆమెకు కళానీరాజనాలిచ్చి శెలవు తీసుకొంటారు (50).

కళాఖండాలన్నింటినీ ఒక్కొక్కటిగా పరిశీలించిన ఆమె ఆ కళాసౌందర్యానికి పరవశమైపోతుంది (21). చిత్రాలు అన్నింటిలోనూ ఒక చిత్రం ఆమెను బాగా ఆకర్షిస్తుంది. అది మగధ చక్రవర్తి బింబిసారునిది. ఆ కళాఖండాన్ని చూచి అతనికీ, ఆమెకీ మధ్య ఏదో పూర్వజన్మబంధం ఉన్న అనుభూతి పొందుతుంది (24).

బింబిసారుడు ముగ్ధమోహనుడు, గొప్పవీరుడు, కళాప్రియుడు, రసజ్ఞుడు అనీ, అయితే వైశాలినీ పురాధీశ్వరులైన విచ్ఛవులకు శత్రురాజు అని ఆ విషయాలను అన్నింటినీ చెలికత్తె వివరిస్తుంది (28). అంతేకాకుండా బింబసారుని ధర్మపాలన (30), ప్రజల సుఖసంతోషాలను కళ్లకు కట్టినట్లు నచ్చచెప్పి (31), అతని పట్ల ఆమ్రపాలికి మరింత ప్రేమ రెట్టింపు అయ్యేటట్లు చేస్తుంది (37).

మగధరాజు ' బింబిసారుడిని ఎలాగైనా తన భవనానికి రప్పించాలనుకొనిన ఆమ్రపాలి (38) తనకెంతో నమ్మకమైన భటుని ద్వారా అతనికి

సందేశాన్ని పంపుతుంది (39). విచ్ఛవుల కంటపడకుండా జాగ్రత్తగా మగధరాజ్యానికి వెళ్లి బింబిసారుణ్ణి దర్శించటానికి భటుడు సిద్ధమవటంతో ఈ ఆశ్వాసం ముగుస్తుంది.

## 2.4.5. పంచమాశ్వాసం (ఆహ్వానము)

ఆమ్రపాలి పంపిన దూతను మగధరాజు సంతోషంగా ఆహ్వానించి విషయం తెలుసుకొంటాడు(1). అతడు గతంలో ఆమ్రపాలి గూర్చి విన్నమాటలు నిజమైనందుకు సంతోషించి, వచ్చిన దూతకి తగిన కానుకలిచ్చి 'నేను వచ్చెదన' ని చెప్పి పంపిస్తాడు(2). ఎంతో ఆనందంతో బింబిసారుడు ఈ సంగతి తన మంత్రులకు చెపుతాడు (10). వైశాలినిని పాలించే చాటక అధిపతి కుమార్తె 'చాలన'ను మీరు వివాహం చేసుకొన్నప్పుడు లిచ్ఛవయువరాజులు అసూయ చెందినా మీ భుజబలానికి భయపడ్డారు. మిమ్మల్ని జయింపలేక భంగపాటు వల్ల కోపంతోనే ఉన్నారు. ఈ పరిస్థితుల్లో ఆమ్రపాలి కోసం అక్కడికి వెళ్లటం మంచిది కాదని సలహానిస్తారు మంత్రులు. కానీ, రాజు ఆమె పట్ల వ్యామోహాన్ని పెంచుకొని ఉండటంవల్ల ఎన్ని విధాలుగా చెప్పినా మంత్రుల మాటలు పట్టించుకోకుండా (12) అతనిలోని వెళ్లాలనే కోరిక మరింత రెట్టింపు చేసుకొంటాడు (13).

ఏ బందోబస్తూ లేకుండానే, తన సేనాని గోపుడితో మాట్లాడి ఆమ్రపాలి ఉన్న పట్టణానికి రథమెక్కి వెళతాడు (15). ఆమె ముఖాన్ని కూడా ఇంతకు ముందెప్పుడూ చూడలేదని, అయినా అన్ని పనులూ చక్కబెట్టే గోపుడు ఉన్నాడనే ధైర్యం, నమ్మకం బింబిసారునికి ఉండటం వల్ల వైశాలినీ నగరంలోని ఆమ్రపాలి భవనానికి వెళతాడు (17). ప్రయాణంలో అనేక శుభశకునాలు కనిపిస్తాయి (21). రాజు, తన సేనాని గోపుడు మారువేషాల్ని ధరించి వైశాలినీ పట్టణాన్ని సంభ్రమాశ్చర్యాలతో తిలకిస్తారు(22). ఆమ్రపాలి, బింబిసారుడు ఆరు రోజులపాటు ప్రణయ రసతరంగాల్లో తేలియాడతారు (5-24). ఆ విషయ మెలాగో తెలుస్తుందో (28) విచ్ఛవులు ఆమె విధించిన షరుతు ప్రకారం భవనాన్ని సోదాచేయదలిచామని ఆమ్రపాలికి వర్తమానాన్ని పంపుతారు(5-29).

ఎంతో వీరుడు, ధైర్యవంతుడైన బింబిసారుడు తాను చేసిన ఎంగిలి పనికి పశ్చాత్తాప పడుతూ (31) 'నీకు కొడుకు కలిగితే ఈ ఉంగరాన్ని తొడుగు, పరిస్థితులు ఎలా మారతాయో చెప్పటమెవరికీ సాధ్యంకాదు. ఉంగరాన్ని ఇచ్చి నా దగ్గరికి పంపిస్తే, అపుడు సంతోషంతో పుత్రుడుగా గ్రహిస్తాన'ని (33) ఆమ్రపాలి చేతిలో ఉంగరాన్ని పెట్టి తన రాజ్యం వెళ్లిపోతాడు బింబిసారుడు. లిచ్ఛవులు ఆమ్రపాలి గృహాన్ని ఎంత వెతికినా ఎవరూ కనిపించక సిగ్గుతో తలదించుకుంటారు. కానీ, ఆమె వ్యూహ కల్పనా శక్తికి వాళ్లు ఆశ్చర్యపోయి, హర్షించక తప్పలేదు (34).

లిచ్ఛవుల గురించి హృదయభారంతో ఉన్న ఆమ్రపాలికి కొన్ని నెలలకు ముచ్చటైన బాలుడు కలిగి ఆమెను ఆనందింపజేస్తాడు (5-35). పుత్రుణ్ణి చూచి ఈనాటితో పున్నామ నరకం పోతుందని, తల్లిదండ్రుల ఆశలన్నీ ఫలించాయని సంతోషిస్తుంది (36). బింబిసారుడే మరోసారి తన గర్భంనుండి ఊడిపడినట్లుగా ఉన్న బాలుని రూపురేఖలను చూచి ఆనందిస్తుంది (38). కుమారుడు సర్వశాస్త్రాల్లోనూ పాండిత్యాన్ని సంపాదించి, యుద్ధవిద్యల్లో తంత్రాలను తెలిసికొని , తండ్రికంటే మొనగాడనిపించుకుంటూ, చూసేవారందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటాడు(39).

మూర్ఖులైన లిచ్ఛవులు పాలిస్తున్న అధర్మపాలనవల్ల రాజ్యంలో అల్లకల్లోలం బయలుదేరుతుంది. ఆమ్రపాలి దానికెంతో ఆందోళన చెందుతుంది. 'బాబూ! ఈ లిచ్ఛవుల కోపజ్వాలలు ఏ క్షణాన్నైనా రాజ్యాన్ని దగ్ధం చేస్తాయి (41) మగధను పాలిస్తున్న బింబిసారుడు నీ తండ్రి, అందుచేత నువ్వు అక్కడికి వెళ్ళు. సుఖసంతోషాలను కలుగజేస్తాడు (42), కీర్తిని, ఉన్నత పదవులనూ పొంది, పొగరుబోతులైన విచ్ఛవుల నోరుకట్టిపెట్టి, నీ తల్లికి మంచి పేరు తెచ్చిపెట్టు. భ్రష్టమయిపోయిన సమాజాన్ని రక్షించటానికి కంకణబద్ధుడవై, నాలుగుదిక్కులా నీకీర్తిని వ్యాపింపజేయమ'ని (45) ఆశీర్వదిస్తుంది. అంతేకాకుండా 'ధైర్య, శౌర్యాలకు, దయకూ, కళలకూ, విద్యకూ ప్రతీక నీ తండ్రి, నీ పనులను చూచి ఎంతో ఆనందిస్తాడు (46). మీ తాత మహాముని (శాక్యధనికుడు) శుభాశీస్సులు, నిన్ను కనిపెంచిన తల్లి మాటలూ నిన్ను సర్వవేళలా కాపాడతాయి (47). విమలకొండా! నిష్కలంక హృదయుడైన మీ తండ్రి బింబిసారుణ్ణి చూచి ఎంతో వేడుక పొందుతావు. ఈ బంగారపు ఉంగరాన్ని నీ తండ్రికి చూప'మంటూ, అనురాగంతో చేతికి తొడగగా, విమలకొండ మగధకు బయలుదేరతాడు (52).

## 2.4.6. షష్ఠాశ్వాసం (ఆగమనము)

వర్షాకాలం ప్రవేశిస్తుంది (2). ఆ కాలంలోనే బోధి సత్వుడు వస్తున్నట్లు తెలియగానే ప్రజలు వైశాలీనగరమంతా ఇసుకవేస్తే కిందకి రాలనంతగా నిండిపోతారు (6). గౌతమ బుద్ధుడిని ప్రజలు పోటీపడి మరీ చూస్తుంటారు (7). చీకటి కమ్ముకున్న వైశాలినికి బుద్ధుని రాకతో ఎన్నాళ్ళకో వెలుగురేఖ వచ్చినట్లు తలుస్తుంటారు (8).

బూజపట్టిన మానవాళి హృదయంలో సత్యాన్ని, శాంతిని, దయని కలిగించాలనే ధ్యేయంతో రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు సన్యాసిగా మారి ప్రపంచ శ్రేయస్సు నాకాంక్షించిన బుద్ధునికి ప్రజలు హృదయపూర్వకంగా జేజేలు పలుకుతారు (10). సంసారానికి మూలమైన మాయామోహాన్ని, భవబంధాలనుండి విముక్తి కలిగించటానికి జనన మరణ మూలాల్ని అన్వేషించాలని

మహోన్నతమైన రాజ్య సింహాసనాన్నే త్యాగం చేసి సామాన్య జీవితాన్ని జీవిస్తూ మోక్షమార్గాన్ని నిర్దేశిస్తున్న బుద్ధుడిని ఎన్నో విధాలుగా కీర్తిస్తారు (14).

అనేక విధాలుగా కీర్తిస్తున్న ప్రజల జయ జయధ్వానాలు ఆమ్రపాలి భవనం దాకా మార్మోగాయి (20). ఇంతకు ముందొకసారి తాను గౌతముడితో జరిపిన సంభాషణా, సంఘటనలన్నీ గుర్తుకొచ్చి, ఆనందం చిరునవ్వుగా చిందులు త్రొక్కి కరుణామయుని కృప తప్పక దొరుకుతుందని ఆత్మవిశ్వాసం కలుగుతుంది ఆమ్రపాలికి! (21). తన భిక్షను స్వీకరిస్తాడనే నమ్మకంతో బుద్ధుని దర్శనానికి తన చెలికత్తెను వెంట బెట్టుకుని వెళుతుంది (29).

చెప్పలేనంత ఆనందంతో వారిరువురూ కలిసి, బుద్ధుడు ఉన్న ఆరామానికి వెళ్లి, తమ గోడుని చెప్పాలని ప్రయత్నిస్తారు. అంతలో సిద్ధార్థుని ప్రియశిష్యుడు ఆనందుడు అక్కడి వస్తాడు (31). 'ఇది మహాముని బుద్ధుని పాదాలవల్ల పవిత్రమైన స్థలం. పతితులు ఇక్కడికి రాకూడదు. మీరాకవల్ల పాపం చుట్టుకొంటుంద'ని చెపుతాడు (32). 'మీరు ఎంత కష్టపడి వచ్చినా వేశ్యలు అంటరానివాళ్లు, బుద్ధుని దర్శనం జరుగదు (33). మీరిక్కడినుండి వచ్చిన మార్గాన్నే వెళ్లిపోవటం ఉభయులకీ శ్రేయస్కరమ'ని చెపుతాడు(34). ఆ మాటలు భగవానుడైన బుద్ధుని ఆత్మలో మెరుస్తాయి(35). ఆనందుడిని పిలిచి, వేశ్యలైనంత మాత్రాన వాళ్ల జ్ఞానసంపదకు దూరం కానవసరంలేదని పాపం చేయనివాడు లోకంలో ఎవ్వరూ లేరని 'పాపి' అనటం వల్లనే అటువంటివాళ్లను మరింత పాపమార్గానికి మలచినట్లవుతుందని , మంచిని పెంచుకొనేలా చేయాలని బోధిస్తాడు బుద్ధుడు (37).

'అమ్మా! నీ ఇంటికి రేపు భిక్షకొస్తాను. నీ హృదయంలోని మాలిన్యాన్ని పోగొట్టుకొని ప్రవర్తించాలి అనీ. ఆనందుడు స్వచ్ఛమైన భావంతో మెలిగే జాలికలిగినవాడని చెప్పి పంపిస్తాడు బుద్ధుడు(39). బుద్ధదేవుని దయకు ఆమ్రపాలి ఎంతగానో ఆనందించి భక్తితో బుద్ధదేవుని పాదాలమీద వాలుతుంది (40).

స్వయంగా బుద్ధుడే ఆమ్రపాలి ఇంటొకొచ్చి, ఆమె పెట్టే భిక్షను స్వీకరిస్తాడట! మావంటి ధనవంతులకే శృంగభంగమయ్యింది. ఒక వారకాంత పెట్టే భిక్షను గ్రహించటం, ఆమె ఆనందించటం, ప్రశస్తి పొందటం ఎక్కడ జరుగుతుందని ధనవంతులు వ్యంగ్యంగా మాట్లాడతారు (41). ధనం గుట్టలు గుట్టలు పోసినా, మూడులోకాలను గుప్పిటలో పెట్టినా బుద్ధ దేవునికి భిక్ష పెట్టటమనే శుభకార్యాన్ని మానను అనీ (42) ఎన్నో సంవత్సరాలుగా దానికోసం నిరీక్షిస్తున్నానని (43) అడిగిన వాళ్లందరికీ వినయంగా ఆమె సమాధానమిస్తుంది. ఎన్నో కమ్మని, సువాసనను వెదజల్లే పిండివంటలను తయారుచేయించి, ప్రేమతో బుద్ధునికి కబురుపంపిస్తుంది (45). బుద్ధుడిని పూవులతో స్వాగతం పలికి యథోచితాసనంపై

కూర్చోమని ప్రార్థిస్తుంది. తమ రాకతో నన్ను ఉన్నతికి తీసుకొని పోయినట్లున్నదని తన ఉత్సాహానికీ, ఆనందానికీ మీరే కారణమని అంటుంది (47). ఎంతో గౌరవంతో విసనకర్రతో గాలి విసురుతూ సపర్యలు చేస్తుంది. ఆమె చూపించిన ఆదరణకు, నిర్మలమైన మనసుకి బుద్ధుడు ఎంతో సంతోషిస్తాడు (48). ఆమ్రపాలి ఎన్నో రకరకాల పిండివంటలు వండించినా, అటువంటి విందులు చేయని బుద్ధుడు ఆమ్రపాలి తినే అటుకులనే భిక్షగా స్వీకరిస్తాడు (51). అటువంటి అద్భుతమైన విందు ఈ యుగంలో ఎక్కడా లేదని సంతృప్తిగా తిని శిష్యులు మెచ్చుకుంటారు (49).

తరువాత ఆమ్రపాలి పిలుపు మేరకు వైశాలినిలోని ప్రజలు కూడా సంతృప్తిగా భోజనాన్ని తింటారు (52). ఆమ్రపాలి చాలా ఖర్చుచేసిందని, కొందరేమో దానికేముంది బుద్ధదేవుని దీవెనల్ని పొందగలిగిందనీ వ్యాఖ్యానిస్తారు (53).

ఇదిలా ఉండగా, వైశాలినిలోని ప్రముఖులు బుద్ధుని దగ్గరకొచ్చి, ఆమ్రపాలి పెట్టిన భిక్షను స్వీకరించటం మంచిది కాదనే తమ సంశయాన్ని బుద్ధుని ఎదుట వ్యక్తం చేస్తారు (55). కులటను ముట్టుకోకూడదు. ఆ ఇంటి ఛాయలకే పోకూడదు. తమరు ధర్మశాస్త్రమంతా తెలిసినవారు. ఒక మలిన కులస్థురాలిచ్చిన మంచినీళ్లను ఎలా తాగుతార'ని తమ అతి తెలివిని ప్రదర్శిస్తూ వారి అనుమానాన్ని బయటపెడతారు (56). వారికి సమాధానంగా ఆమ్రపాలి పూర్వ జన్మ వృత్తాంతాన్ని విశదీకరిస్తాడు బుద్ధుడు.

## 2.4.7. సప్తమాశ్వాసం (వివరణము):

నవ్వినవారూ, శాపాలుపెట్టినవారూ ప్రతి ఒక్కరూ ఆమ్రపాలి జన్మవృత్తాంతానికి ఆశ్చర్యపడతారు (12). తరువాత, ఆమెను గొప్పగా ప్రశంసిస్తారు (13). ఆమ్రపాలి శరీరం పులకరించి సంతోషం నిండిన మనసుతో ఎంతో అణకువభావం కలిగినదై బుద్ధుడితో 'నా జన్మ ధన్యమైంద'ని తృప్తిగా పలుకుతుంది (15).

'భగవాన్! నంగనాచి పిచ్చిసంఘం నన్ను పొందాలని నావివాహాన్ని భంగంచేసి, జీవితాన్ని శిథిలమయ్యేటట్లు చేసింద'ని (19) తొందరపడి నిర్ణయం తీసుకొన్నానేమోనని, తప్పంతా నాదేనేమోనని అనుకొని విచారించానని చెపుతుంది (20). పూర్వజన్మవలనే గణభోగ్యగా త్యాగమయ జీవితాన్ని గడపవలసి వచ్చిందని గ్రహించి, ఊరటచెందుతుంది. అంతేకాకుండా తండ్రీ! తమ కృపాకటాక్షాల వల్ల పాపం ప్రక్షాళనమైందనీ, (21), తమ అఖండ దయాసాగరంలో మునగకుండా ఎన్ని జన్మలెత్తినా ఏ ఫలితం ఉండదని, తనవంటి భోగకాంతకు మరో దిక్కులేదంటుంది (22).

బుద్ధుని ధర్మ మార్గమెంత గొప్పదో ఆమె తను తెలిసినంతలో తెలిసినభాషలో విన్నవించుకొని తన జీవితం కొత్తమార్గం వైపు పయనించేటట్లు జ్ఞానబోధ చేయమని ప్రార్థిస్తుంది. (23). ఆమె మరలాతానేకల్పించుకొని 'జగజ్జనకా! మీతో ఒక మాట విన్నవించుకొంటున్నాను. దాన్ని మన్నించాలని' వేడుకొంటుంది (26) 'మీ తపస్సుతో సారవంతమైన మామిడితోటలోనే నన్ను కూడా ఆశీర్వదించమంటుంది (27). ఆ మామిడితోట ఆమెకు తండ్రి శాక్యధనికుడు ఇచ్చింది. ఆ చెట్టునీడలోనే ఆమె దొరికింది. ఆ చెట్టు దగ్గరే బుద్ధుని దివ్యదర్శనం కూడా కలిగింది. కాబట్టి ఆమెకు ఉన్న ఆ తోటను బుద్ధునికి తమపాదాల సాక్షిగా సమర్పిస్తున్నాని, దయతో స్వీకరించమని ప్రార్థిస్తుంది (28),

పవిత్రమైన హృదయంతో ఆమె వాక్యాలను అక్షరాలా 'ఆమ్రవాటిక క్షపణకులందిరికీ నివాసమగు గాక!' అని బుద్ధదేవుడు ఆశీర్వదిస్తాడు (30). ఆమ్రపాలి మనసు స్వచ్ఛమైన కాసార జలములా పరిఢవిల్లి బుద్ధభగవానుని సముఖంలోనే ప్రతిజ్ఞచేసి, బౌద్ధ సన్యాసాన్ని స్వీకరిస్తుంది (30). తన కుమారుడు అంతకుముందే బౌద్ధసన్యాసిగా మారిపోతాడు (32).

## 2.4.8. అష్టమాశ్వాసం (స్వీకరణము)

బుద్ధుడు, ఆమ్రపాలి సమర్పించిన మామిడి తోట దగ్గర ఉండగా, వారి సందేశంకోసం ఎంతోమంది ప్రజలు వస్తారు అపుడు బుద్ధుడు ఆశీర్వచనాలు పలుకుతూ 'ఈ ఆమ్రాఖ్యకు, మీకూ ఎల్లప్పుడూ మేలగునుగాక!' అని ఆశీర్వదిస్తాడు(1). ఉపదేశానికి వచ్చిన ప్రజలతోపాటు ఆమ్రపాలి కూడా అక్కడే ఉంటుంది. వారినందరినీ ఉద్దేశించి బుద్ధుడు నీ ప్రాణాన్ని ఎట్లు చూసుకొంటావో, అదే విధంగా తోటిప్రాణులను చూడటం వల్ల నీ జన్మ సఫలమవుతుందని తన సందేశాన్ని అందిస్తాడు (3). అశాశ్వతమైన జీవితంకోసం, లేనిపోని తుచ్ఛమైన భోగాలకోసం మానవులు అర్రులు చాస్తుంటారని, కోరికలను పెంచుకొంటారని (4) నూరేళ్ళు బతికినా మరణం తప్పదనే (5) జీవితసత్యాన్ని వివరిస్తాడు. ప్రాణం ఉన్నప్పుడే ధర్మాన్ని తెలిసికొని మంచిని పెంపొందిస్తే అది శాశ్వతంగా నిలుస్తుంది, కోపం ఈర్ష్య, ద్వేషం అనేవి విషం వంటివి వాటిని విడనాడాలని బోధి స్తాడు (7). కోరికలను వీడి ఉత్తమ ఆదర్శాలతో, ఉత్తమ శీలంతో జీవించాలి (8), ఎవరినీ అపభ్రంశ వాక్యాలతో నిందించకూడదు(10). ధర్మమార్గంలో నడుచుకోవాలి. తోటివారికి సహాయపడాలని (11) చెపుతాడు. ఎవరికీ హాని తలపెట్టరాదు. సరైన ఆలోచన చేయాలి. (13) చెడు ఆలోచనలు రాకుండా సరైన ధ్యానాన్ని ఆచరించాలని (15) అష్టాంగ మార్గాలను వివరిస్తాడు బుద్ధుడు. దైవమే భూమిమీదకు వచ్చినట్లు ప్రజలంతా తలుస్తారు. బౌద్ధత్రిశరణాలను బుద్ధుని ప్రియశిష్యుడు ఆలపించగా, అక్కడ ఉన్నవాళ్ళుకూడా వాటిని ఉచ్చరించి, బుద్ధభగవానుని ఆశీస్సులు పొంది, ఎవ్వరి ఇళ్లకు వాళ్లు వెళ్లిపోతారు (16).

# మూడవ అధ్యాయం

# పాత్రపోషణ

## 3.0 నిర్వచనం :

కవిభావాలను, కవితాశిల్పాన్ని తెలిసికోవటానికి కావ్యంలో కవి చిత్రించిన పాత్రలను పరిశీలించవలసి ఉంటుంది. సమర్థుడైన కవి వివిధ మనస్తత్వాలను అనుసరించి పాత్రలను వర్ణిస్తాడు. కావ్యంలో *''కథాగమనమునందలి వివిధ సన్నివేశములలో తత్తదుచితముగా ఆయా పాత్రముల చేష్టాదికములతో, మనఃప్రవృత్తులలో గలుగు క్రమోన్మీలమును పూర్వాపర సందర్భముగా ప్రపంచించి నిరూపించుట పాత్రపోషణమని నిర్వచించవచ్చును''*[33] అని వివరించారు ఆచార్య తమ్మారెడ్డి నిర్మలగారు. కవి సామాన్యంగా తనకు తెలిసిన జీవితాన్నే చిత్రించినప్పుడు, అది సజీవమైన పాత్రపోషణ అవుతుంది. పాత్రల సుఖ దుఃఖాలను తానుగా అనుభవించాలి. పాత్రపోషణ కథకీ, రసానికీ సన్నివేశానికీ సంబంధించిన సమన్వయానికి తోడ్పడుతుంది. *''కవి కార్యము నిర్వహించుటకు కథ ప్రధానమైనది. కథలోని ప్రధానమైన పాత్రలనాశ్రయించే రసభావాదులను కలుగును. కవి స్వీకరించిన యొకానొక కథ తాను చెప్పబోవు మహావిషయయమునకనుగుణంగా ప్రవృత్తమగుచుండును ఈ మహావిషయాభిముఖంగా కవి తన కావ్యము నందలి సర్వసంఘటనలను కల్పించును. పాత్రల మనోవృత్తులను తీర్చును''*[34] అని పాత్రలప్రయోజనాన్ని ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యగారు విశదీకరించారు. కాబట్టి, పాత్రపోషణను బట్టే నాయికా నాయకులకు, కథకు ఔన్నత్యం చేకూరుతుంది. కావ్యంలో పాత్రలు రసానికీ, కథాగతికీ ఆలంబనాలు. రసం నాయికా నాయకాశ్రితమై, కవి రస భావాలను నాయికా నాయకులపై ఆరోపించి, ఆ పరిసర ప్రకృతిని వారికి ఉద్దీపనగా చేస్తూ రసాన్ని ఆవిష్కరిస్తుంది.

డా॥ యస్.టి.జ్ఞానానందకవి గారు కొన్ని పాత్రలను వర్ణించేటపుడు ఆయా సన్నివేశాలను బట్టి, తమ తమ బహిరంతర ప్రవృత్తులను తామే వ్యక్తంచేస్తున్నట్లు రాయటం, మరికొన్ని చోట్ల పాత్రల్లో కవి అంతర్లీనంగా ప్రవేశించటం కన్పిస్తుంది. అల్లారుముద్దుగా పెంచుకున్న ఆమ్రపాలి తన కళ్ల ఎదుటనే లిచ్ఛవులు గణభోగ్యగా మార్చేసుకోవటాన్ని, లిచ్ఛవులతో ఒక తండ్రిగా

శాక్యధనికుడు పడిన ఆవేదనతో కవి హృదయం తాదాత్మ్యం చెందింది. కావ్యంలో 'స్వయంవరణము' శీర్షికలో గల పద్యాలు దీనికి చక్కని ఉదాహరణలుగా వివరించవచ్చు.

## 3.1. ఆమ్రపాలి కావ్యంలోని పాత్రలు

ఆమ్రపాలి, బుద్ధుడు, బింబిసారుడు, శాక్యధనికుడు, లిచ్ఛవులు ప్రధానపాత్రలు. ఆనందుడు (బుద్ధుని శిష్యుడు), ఇంద్రుడు, విమలకొండ, గోపుడు, నెమలి మొదలైన పాత్రలు కథకి సమన్వయాన్ని కలిగిస్తూ, ఆయా సన్నివేశాలను బట్టి కావ్య పరిపూర్ణతకు తోడ్పడిన సామాన్య పాత్రలు.

## 3.2. ఆమ్రపాలి

కథానాయిక పేరు 'ఆమ్రపాలి' పాత్రను చిత్రించటంలో కవి ఎంతో నేర్పునీ, ఔచిత్యాన్ని ప్రదర్శించారు. మొదటినుంచి చివరి వరకూ పాత్రకూ, కథకూ మధ్య విడదీయరాని బంధాన్ని ఏర్పరిచారు. ఆమ్రపాలి పాత్రను కవి సందర్భానుసారంగా కథాకథన పద్ధతి [35]లో చెప్పటం, పాత్ర చేతనే పలికించటం ద్వారా కూడా పోషించారు.

ఆమ్రపాలి ఒక అనాథ. ఒక మామిడితోటలో, గణతంత్ర రాజ్యమైన వైశాలినికి గణనాయకుడైన శాక్యధనికునికి దొరుకుతుంది దేవుడిచ్చిన వరంగానే పెంచబడుతుంది. పిల్లలు లేని శాక్యధనికుని ఆనందానికి కారణమవుతుంది ఆమ్రవాటిలో దొరికినందువల్ల ఆ శిశువుని 'ఆమ్రపాలి'గా పిలుస్తారు. ఆమె సమస్త కళలను నేర్చుకుంటుంది.

*''భరతమౌని యశస్సు పదికాలములఁ బాటు*
*నాట్యశాస్త్రములోని నాణ్యమెఱిఁగి*
*సురలోక వాసుల సొత్తైన కమనీయ*
*గాంధర్వ విద్యలో గణనకెక్కి*
*నలువ చెలువ కృపాకలన వేయి విధాల*
*సాహిత్య జగతిలో సంచరించి*
*ఘనతఁగాంచిన తపోధనుల ప్రోక్తములైన*
*తతమహావిజ్ఞాన గతుల నేర్చి*

*నాటి సంఘమందు మేటి గౌరవమున్న*
*స్త్రీల కర్షమైన తీరులందు*

*చదువు సాములందు శాస్త్ర విద్యలయందు*

*తనరె నేర్పు శాక్యధని తనూజ*''(1-13). అంతేకాకుండా అందచందాల్లో, గుణశీలంలో తనతోటివారందరికీ తలమానికంగా ఉండేది. తల్లిదండ్రులు, బంధువులంతా మెచ్చుకొనేటట్లు మసులు కొనేది. తండ్రితోపాటు సభాకార్యక్రమాల్లోనూ, పూజాపురస్కారాల్లోను పాల్గొనేది. అక్కడ దేవాలయాల్లో చేసే నాట్యాల్లో పాలు పంచుకొనేది(19). కవి రాబోయే కథాసన్నివేశానికి ఆమ్రపాలిని, తండ్రితోపాటు సభాకార్యక్రమాల్లో పాల్గొన్నట్లు వర్ణించి మంచి జాగ్రత్త తీసుకున్నారు. తద్వారా లిచ్ఛవుల మనస్తత్వాలు బాగా తెలిసికోవటానికి గణభోగ్యగా తనే ఓ నిర్ణయం తీసుకోవటానికీ కవి ఔచిత్యభరితంగా పాత్రను పోషించటంలో జాగ్రత్తను తీసుకున్నారు.

ఆమ్రపాలి అతిలోకసుందరి (2-9) తండ్రి, కూతురికి స్వయంవర సభ నేర్పాటుచేసి-

*''అమ్మన్నందనే విశ్వభూపలయ మోహప్రక్రియా స్ఫూర్తి, ది*
*వ్యన్మే రానన, రమ్యనాటక కలాప్రావీణ్య, రాకాసుధా*
*రశ్మిశ్రీ నిభృత స్వరూప, గుణభారస్ఫార విక్రాంతి, సా*
*రస్మారాశి....*''(2-1) అని ప్రకటిస్తాడు. లిచ్ఛవుల ఎదుట నిలబడిన ఆమె సౌందర్యాన్ని వర్ణిస్తూ కవి మెరుపు తీగలా, శశిరేఖలా, దేవకాంతలా ఉందంటారు (2-32). భూలోకంలో తనకు సాటి గలవారెవ్వరూ లేరిన ఆమ్రపాలీయే ఒక సందర్భంలో భావించుకొంటుంది (3-12). ఇంకా బింబిసారుడు నోటితో-

*''అందాలకు మాటల మక*
*రందాలకు సర్వసత్కళా జీవనవున్*
*చందాలకు నందాలకు*
*మందిరమ*''ని పలికిస్తారు కవి. కవి కథను కొనసాగిస్తూ ఆ యుగంలో ఆమ్రపాలిని మించు అందగత్తె లేదనీ, ఆమె అందానికి రంభ, ఊర్వశి, మేనక అనే ముగ్గురు అప్సరస కాంతలూ కూడా తలదించుకున్నారట! ఆమ్రపాలి సౌందర్యాన్ని అవకాశం కలిగినపుడల్లా వర్ణిస్తూనే వచ్చారు. లిచ్ఛవులు తమలో తాము ఆమె అందచందాల పట్ల అనేక విధాలు భావించుకునేటపుడు కూడా సౌందర్య వర్ణన ధ్యోతకమవుతుంది. కావ్యంలో ఆమె సౌందర్యాన్ని ఇంత నిడివిగా వర్ణించటానికి గల కారణం. ఆమె అందాన్ని చూసేకదా, లిచ్ఛవులందరికీ చెందాలనుకుంటారు. ఎవరో ఒక్కరికే దక్కటానికి

ఇష్టపడలేదు. (2-10) గణనాయకుడైన శాక్యధనికుని కుమార్తెనే 'గణభోగ్య'గా చేయమని సాహసించారంటే, అమె ఎంత సౌందర్యరాశిగా ఉండాలి! అందుకే 'అసమ సౌందర్య గుణశీలి'గా ఆమెను వర్ణించారు కవి.

శాక్యధనికునితోపాటు అధికార కార్యక్రమాల్లో పాల్గొంటున్న ఆమ్రపాలి అందం లిచ్ఛవులు మోహం పెంచుకోవడానికి కారణమవుతుంది పైగా తమ కోర్కెల్ని తీర్చుకోవటమే వారి ధర్మం. వారి ప్రవర్తన తెలిసిన తండ్రి ఆమ్రపాలికి పెళ్లి చేయాలని స్వయంవర సభనేర్పాటుచేసి, వారిలో ఎవరినో ఒకరినే వివాహం చేసుకొంటుందని ప్రకటిస్తాడు (2-7) దానికి లిచ్ఛవులు అంగీకరించరు. ఆమె అందరికీభార్య (వేశ్య)గా కావాలని పట్టుపడతారు. 'భార్య' లోకార్థంలో కాకుండా 'వేశ్య'గానే లిచ్ఛవులు ప్రయోగించారనేది వారి మనో భావాలను బట్టి తెలుస్తుంది.

ఒక వక్క పిల్లలులేని తండ్రికి లేకలేక దొరికిన పిల్లని, ఎంతోగారాబంగా పెంచి పెళ్లి చేయాలనుకున్న పిల్లని తానేమి చేస్తాడనే ఉత్సుకత పాఠకునికి కలుగుతుంది. సమస్యకు పరిష్కారాన్నెలా నిర్వహిస్తాడనే తార్కిక దృష్టి మొదలవుతుంది. ఇటువంటపుడే కవి సామర్థ్యం బయటపడుతుంది. కవి తన ప్రతిభను వెల్లడించటంలో ఔచిత్యాన్ని ప్రదర్శించాలి. '*ఏది దేనికి తగి ఉంటుందో దానిని ఉచితమని, ఉచితమైనదాని ధర్మేమే ఔచిత్యమ*'ని అంటారు.[30].. కావ్యంలో ఔచిత్యం పద, వాక్య,ప్రబంధ కథావస్తువు, గుణం, అలంకారం, రసం, క్రియ, కారక, దేశం, కులం, వ్రతం, సత్యం, తత్వం, అభిప్రాయం, స్వభావం, సారసంగ్రహం, ప్రతిభ, అవస్థ, విచారం, పేరు, ఆశీర్వాదాల్లో వ్యాపించి ఉంటుందని చెబుతారు మన లాక్షిణికులు, కేవలం 27 రకాలనే క్షేమేంద్రుడు చెప్పటమనేది ఔచిత్యం కోసం చెప్పినా ఇంకా చాలా చోట్ల కావ్యంలో ఔచిత్యాన్ని ప్రదర్శించవలసి ఉంటుంది.

జ్ఞానానందకవి గారు మొదటి నుంచే రాబోయే ఈ సన్నివేశానికి తగిన విధంగా పాత్రను పోషించుకువచ్చారు. తండ్రితోపాటు ఆమ్రపాలిని పూజాపురస్కారాల్లో పాలుపంచుకునేటట్లు వర్ణించటం కూడా ఈ ప్రయోజనాన్ని ఆశించే! అందువల్లే ఆమ్రపాలి మొదటినుంచీ లిచ్ఛవుల మనఃప్రవృత్తులను గ్రహించగలిగింది. ఒక్కసారిగా స్వయంవర సభలో ఆమెను ప్రవేశపెట్టి ఉంటే కావ్యానికింత రమణీయత వచ్చి ఉండేదికాదు. తండ్రి పడుతున్న ఆవేదనను గ్రహించి లిచ్ఛవుల కోర్కెను పసిగట్టి, ఉచితానుచితాలు పాటించే సమయస్ఫూర్తిగల వివేకవంతురాలు (2-31)గా తీర్చిదిద్ది, ఆమె

గురించి వచ్చిన సమస్యను ఆమె చేతనే పరిష్కరింపజేయటం కవిలో ఉన్న ప్రతిభకు తార్కాణమై, చక్కని ఔచిత్యాన్ని ప్రదర్శించినట్లైంది. నిస్సహాయుడై, ఆవేదనతో కుమిలిపోతున్న తండ్రి పరిస్థితిని అర్థం చేసుకున్న ఆమ్రపాలి సాహసంతో ఒక నిర్ణయానికొచ్చి(2-30), మందహాసంతో, మధురంగా సభనుద్దేశించి మాట్లాడుతుంది (2-30).

మీ మాటలవల్ల గణభోగ్యను కావాలనుకుంటున్నారనేది స్పష్టమయ్యిందని, దానికోసం ప్రతీకారాలను పెంచుకోవటమెందుకనీ, గణభోగ్యను ఔతానని అంగీకరిస్తుంది. (2-35). ఈ భారతభూమిలో ఏకపత్నీవ్రతుడైన శ్రీరాముడు వంటి మహారాజులు ఉన్నారనే కథల్ని చదువుకొన్నాను. అటువంటివి ఇపుడేమి లేవు అని గత చరిత్రను గుర్తు చేయగలిగిన విద్యావంతురాలు. కాని, వారి మనసు కరగక పోవటంతో కొన్ని షరతుల్ని విధిస్తుంది. వాటిని అంగీకరిస్తే గణభోగ్యగా అంగీకరిస్తాననంటుంది (2-37). అవేమిటో చెప్పమని అడుగుతారు లిచ్ఛవులు (2-39). ఎంతో గౌరవ మర్యాదలు, గొప్ప చరిత్ర కలిగిన మా తండ్రి శాక్యధనీంద్రుడు నా అచ్చటా ముచ్చటా వివరిస్తే, అవి మీకు రుచించలేదనీ (2-44) గౌరవ ప్రదమైన క్షత్రియ వంశంలో పుట్టి, ప్రజల్ని అమాయకుల్ని చేసి, కామం కోసం అవివేకంగా ప్రవర్తిస్తున్నారనీ (2-42) సభలోనే నిందించగల ధైర్యవంతురాలు. బుద్ధుడు పుట్టిన పవిత్రభూమికి, అర్ష సంప్రదాయానికే మచ్చ తెచ్చారని (2-45), వారనుసరిస్తున్న దుర్మార్గాల్ని వివరించి-

*''కట్టింపవలయును చక్కని ప్రదేశమునందు*
*తన రార నాకునద్దాల మేడ*
*చెల్లింపవలెను నిక్షేపాన నైదువం*
*దల జాలువాఱెడి నాణెములను*
*వదమూనవలెను నాభవనాన కొకరోజు*
*నకొకండు రసికు'డైనట్టివాఁడు*
*నెమకంగవలయు వారము కట్టకడవట*
*నాయింటిని పరీక్ష సేయునెడల*

*వచ్చిపోవువారిపై విలాసము గూర్చి*
*ప్రశ్న వేయుటకును వలను వడదు*
*షరతులన్నీ మీరు సావధానమ్ముగా*
*విన్నవార లొప్పుకొన్నవారొ!''* (2-47) అని బహిరంగంగా షరతుల్ని

ప్రకటించి, దానికేమంటారని సభ కొంతసేపు స్తంభించిపోయేటట్లు (2-48) చేయగలిగిన వాక్చాతుర్యంగలది. లిచ్ఛవులు ఆమెపెట్టిన షరతుల్ని అంగీకరిస్తారు. తాను తీసుకొన్న నిర్ణయం ఫ లితంగా లిచ్ఛవులకి బానిసగా మారకుండా, తన స్వతంత్రను కాపాడుకోగలిగింది. నిబంధనలను విధించే వారిపైనే నియమనిబంధనలను పెట్టి మకుటంలేని మహారాణిగా జీవించగలిగింది. గణభోగ్యగా ఆమె అంగీకరించకపోతే దుర్మార్గులైన లిచ్ఛవులు ఆమె జీవితాన్ని కుక్కలు చింపిన విస్తరిగా చేసి ఉండేవారేమో! ఆ అవకాశాన్ని వారికివ్వకుండా తనకు తానుగా వారికి సమర్పించబడిన త్యాగమయిగా, స్ఫురద్రూపిగా ఆమె పాత్రను పోషించారు కవి!

అందరికీ భార్య (వేశ్య)గా మారిన ఆమ్రపాలికి ధనానికి గాని, సేవలకుగాని, భోగాలకు గాని కొదవలేకపోయినా ఏదో మానసిక సంఘర్షణకు లోనవుతుంది. ప్రపంచమంతా హేయంగా కన్పిస్తుంది(3-1) తన శేష జీవితాన్నైనా ప్రశాంతంగా గడపాలనుకుంటుంది. తాను దొరికిన మామిడితోటలోకి వెళ్తుంది. (3-2) అపుడు కవి ఆకాశం నుంచి స్వచ్ఛమైన వెన్నెల కురుస్తున్నా, ఆ కిరణాలు క్రిందికి ప్రసరించకుండా మామిడాకులు అడ్డుపడుతున్నాయని, అందుచేత క్రీనీడలు క్రమ్ముకుంటున్నాయనీ (3-6)వర్ణించారు. ఇది పాత్రపోషణలో కవి పాటించిన మంచి శిల్ప చాతుర్యానికి మచ్చుతునక. *''శిల్పము కథాగతమైయుండును. కథను, జెప్పుటలో కథయొక్క పౌర్వాపర్యములను విచారించి కథయొక్క ఆయువు పట్టు తెలుసుకొని, అది సువ్యక్తమగుటకు కొన్ని మెలకువలుపయోగించును. అది శిల్పమని చెప్పవచ్చును''*[37] అని శిల్పమంటే ఏమిటో విశ్వనాథ వివరించారు.

*''కావ్య శిల్పం అన్నపుడు కావ్యం కూర్పులోని సర్వాంశాలకు సంబంధించిన ఒకానొక నైపుణ్యం, అంటే కవి గ్రహించిన వస్తువులో చేసిన పాత్రచిత్రణలో, పరిపోషించిన రస భావాల్లో ఈ శిల్పం ఉంటుంది''*[38] అంటారు ఆచార్య ఎస్. గంగప్ప గారు. వీటిని బట్టి శిల్ప పోషణలో కార్య నిర్మాణ వైవిధ్యం తెలిసిన జ్ఞానానందకవిగారు ఈ శిల్పాన్ని చక్కగా సమన్వయాన్ని చేయగలిగారు. తొలిసారిగా బుద్ధుడిని దర్శనం చేసుకొనేటప్పటికి ఆమ్రపాలి 'లావణ్యయౌవన సుధాఖని' (3-8), అందువల్లనే ఆమెకి 'మోహన కళామహోదయానిధి' గా కన్పించటంలో ఆశ్చర్యంలేదు. ఆమె మన స్థితినిబట్టి, ఆమె గుణాన్ని జాగ్రత్తగా వర్ణించారు. 'సహకారపత్రముల యుద్యోగమ్ము చంద్ర ప్రభాభ్యుదయ శ్రీలకునడ్డమైయ్యా'యని వర్ణించటంలోనే శిల్పరహస్యం దాగిఉంది. అప్పటికామెకి పరిపూర్ణంగా కోరికలపట్ల వ్యామోహం పోలేదు. కానీ,

ఏదో ఒక అసంతృప్తి మాత్రం మానసికవేదనకు గురిచేస్తుంది. దాన్ని తొలగించుకోవటానికే తాను దొరికిన మామిడితోటలోకి వచ్చింది. కష్టాల్లో సహజంగా కలిగే వైరాగ్యమే ఆమెలోనూ కన్పించింది. తర్వాత 'వక్రీభూతపుటక్రమాల్ని' (3-7) పోగొట్టడానికొచ్చాడేమోనని అనుకొంది. అతనితో కాపురం చేసి, సుఖాన్ని పొందటానికి చెలిమిని కోరుకోవాలనీ అనుకొంటుంది. బతుకులోని సుఖమంటే అతన్ని పొందటంలోనే ఉందనీ తనలో తాను తన్మయత్వంతో ఊహాప్రపంచంలో మునిగిపోతుంది. ఇది ఆమెకు కలిగిన మోహావేశాన్ని తెలియపరుస్తుంది. ఆమె ఇంకా పూర్తిగా వైరాగ్యం చెందలేదు. అటువంటి స్థితిలో శృంగార భావానికి లోనుకావటమనేది విచిత్రమైన విషయమేమీకాదు. ఎందుకంటే ఒక మునిని చూసిందామే. ఆ ముని చాలా అందమైనవాడు. సహజంగానే యౌవనవతికి శృంగారాకాంక్ష కలుగవచ్చు. ఒకసారి అప్సరసలు కూడా బుద్ధుడి అందాన్ని చూసి శృంగార భావానికి లోనైనట్లు శ్రీహర్షుడు నాగానందంలో వర్ణిస్తాడు. అంతేకాకుండా ఆమ్రపాలికి బుద్ధుడే తపస్సు చేసుకుంటున్నాడని మొదట తెలియదు. ఎవరో ముని అనుకొని 'సమస్త మహాపచారాన్ని' చేస్తాను. ఇంటికి రమ్మంటుంది.(3-16) తనెవరినో బుద్ధుడు వివరించేసరికి పాపిని నేను చాలా పొరపాటు మాట్లాడానంటుంది (3-31) అతని పాదాలమీదపడి తన ఆతిథ్యాన్ని స్వీకరించ మంటుంది. (3-33). నా తపస్సు పండిన తరువాత నీ భిక్షను స్వీకరిస్తారనని చెపుతాడు ఆమెకి ఆనాటి సంఘటన ఒక కొత్త అనుభవాన్ని కలిగిస్తుంది.(3-35)

ఆమ్రపాలి నోటినుంచి 'ఆతిధ్యం' బుద్ధుడి నోటి నుంచి 'భిక్షా స్వీకరణ'మని కవి ప్రయోగించిన పదాల్లో, ఆమె పూర్తిగా ఆధ్యాత్మిక ప్రపంచంలో అడుగుపెట్టలేదనేది ధ్వనింపజేస్తూ, ఆ విషయాన్ని బుద్ధుడిచేత అకుంఠిత సాధన 'ఫలించినట్లైతే' అపుడు స్వీకరిస్తాననిపిస్తాడు. ఇక్కడ నిష్కల్మష హృదయురాలిగా తయారయ్యేందుకు ఆమ్రపాలి అకుంఠిత సాధన చేయాలనేది కవి స్ఫురింపజేసే సూచనగా వ్యాఖ్యానించటం బాగుంటుదేమో!

ఆమ్రపాలి గణభోగ్యగా మారిన తర్వాత ఆమె మానసిక స్థితిని ఆలోచనల పరంపరను చతుర్థాశ్వాసం 'చింతనం'లో కవి ప్రకటించారు. తాను తీసుకున్న నిర్ణయంవల్ల తల్లి దండ్రులు ఎంతగా కుమిలిపోయారోనని అనుకొంటుంది.

ఎవరికైనా ఆత్మీయులు దూరమైతే మనసు వికలమైపోతుంది. జీవితం

గడవటం కష్టమనిపిస్తుంది. ఆమ్రపాలి పయనించే కష్టాల కడలిలో చుట్టూనీరు ఉన్నా, దప్పికతీర్చే గుక్కెడు మంచినీళ్లు లేనట్లుగా, ఎన్నో భోగాలు ఇంటిలో ఉన్నప్పటికీ, ఆత్మీయతను పంచుకునేవారు కరువవుతారు. ఒంటరితనాన్ని మించిన బాధ ప్రపంచంలో మరొకటి ఉండదు. అదే అనుభవిం చిందామె. జీవించాలకున్న దానికి భిన్నంగా మారిన ఆమె జీవిత బింబాన్ని చూచి, తనలో తాను మానసికవ్యధకు గురైన తీరుని కవి

*''అల్లారుముద్దుగా నవనిఁ బెంచిన యట్టి*
*తల్లిదండ్రుల నెడందఁదలఁచి తలఁచి*
*చిననాటినుండియు తనతోఁ జరించు నె*
*చ్చెలుల శ్లేషోక్తికిఁ గులికి కులికి*
*తన విద్దియులకు కారణ భూతులగు గురున్*
*బత్తినిండఁగ చేతెలెత్తి యెత్తి*
*వయసుతో పాటుగఁ బయనించు కోర్కెలు*
*వూఢ్చఁగాఁబడెనంచు నేఢ్చి యేఢ్చి*

*గుండెలు పగులునట్లు కుమిలిపోయి*
*చెప్పరాని వెతల కుప్పలోన*
*కూలఁబడిన యామ్రపాలి నెవ్వారలు*
*ప్రేమతోడ నాదరింతు రొక్కొ* (4-18) అని ఎంతో ఆత్మీయంగా వర్ణించారు. గతజీవి తాన్ని అంతటినీ గుర్తు చేసుకొని, అనురాగాన్ని తలచుకొని, అదిలోపించినందుకు ఎంతో వ్యధకు గురైంది. తల్లి దండ్రులకు బాధకల్గించే నిర్ణయమే తాను తీసుకొన్నా, దాని వల్ల ధర్మస్థాపన చేయగలిగాననే అనుకొంటుంది (4-13). నేర్చుకొన్న విద్యను నలుగురికీ పంచటంలోనే ఆనందం ఉంటుందనే తృప్తి ఆమెకి కొంత ఊరటనిస్తుంది (4-16). ఆమె కోసం నిర్మించిన భవనంలో శృంగారాన్ని ఉద్దేశింపజేసే ఎన్నో కళాఖండాలను సృష్టించిన కళాకారుల ప్రతిభను మెచ్చి, తగిన రీతిలో వారిని గౌరవించి పంపటం ఆమె సంస్కారాన్ని వెల్లడిస్తుంది. భవనంలో నెలకొన్న కళాఖండాల్ని పరిశీలిస్తూ (4-21) మగధ చక్రవర్తి బింబిసారుని చిత్రానికి ఆకర్షించబడి. పూర్వజన్మబంధమేదో గాఢానురాగానికి గురిచేస్తుందనుకొంటుంది (4-24). లిచ్ఛవులకి శత్రు రాజైనప్పటికీ తన మనోహరుడు బింబిసారుడేనని భావిస్తుంది. ఆతడి సుగుణాలను శౌర్యాన్ని చెలికత్తె వివరించటంతో ప్రేమ మరింత రెట్టింపు చేసుకొంటుంది (4-37).

దూతను పంపించి మారువేషంతో చక్రవర్తినే తన భవనానికి రప్పించుకోగలిగిన జాణ (5–15) ఆరురోజులపాటు ప్రణయాన్ని కొనసాగించి (5–24) పుట్టబోయే బిడ్డకి తండ్రిగా బింబిసారుడేనని అతనిచేతనే పలికించి, గుర్తుగా ఉంగరాన్ని కూడా గ్రహించిన దూరదృష్టి గలది (5–34). మూర్ఖులైన లిచ్ఛవులు సోదాచేసినా దొరకకుండా చేయగలిగిన వ్యూహకల్పనాశాలి. పిల్లలు లేని తల్లిదండ్రుల చేతిలో పెంచబడిన అనాథైన ఆమ్రపాలికి సంతానం కలిగినపుడెంత ఆనందిస్తుందో కదా! కవి –

*''ఈనాడు నాపుణ్య కృత్యాలు ఫలియించి*
*పున్నామ నరకమ్ము పోయెఁగాదె*
*ఈనాఁడు నాదు పూజాన యోత్సవములు*
*చల్లఁగా నను నొక తల్లిఁజేసె*
*ఈనాడు నామ్రొక్కు లీతీరుగాఁ బండి*
*గర్భమ్ము ఫ లియింపఁగలుగుఁజాలె*
*ఈనాఁడు నా కోర్కెలెల్ల భాసిల్లఁగా*
*ఘనతేజుఁడైన నందనుని గంటి*

*నన్నుఁ గన్న యట్టి నా తల్లి దండ్రుల*
*ఆసలన్ని నేడు మోసులెత్తఁ*
*బూన దొడ్డ తరుణమీనాఁడు గదా యని*
*హర్ష జలధిఁ దేలె నామ్రపాలి* ''(5–36) అని తల్లిగా ఆమె ఎంత సంతోషించిందో కలకాలం నిలిచిపోయే గొప్ప సీసపద్యంలో రాశారు కవి. 'అపుత్రస్య గతిర్నాస్తి' అనేది ఆర్యోక్తి, పిల్లలు లేనివారికి పుట్టగతులు ఉండవని అంటారు మన పెద్దలు. భారతీయ కుటంబవ్యవస్థ, జీవన సంస్కృతుల మీద కవికి ఉన్న అచెంచెల గౌరవభావం కావ్యమంతటా కన్పిస్తుంటుంది. ఆమ్రపాలి వేశ్యకాబడినా ఆమెకూడా ఒక తల్లి, ఆమెకీ అప్యాయతానురాగాలు ఉంటాయి. తల్లి ప్రేమను మించింది ఈ జగతిలోనే లేదు. ఆమ్రపాలి కూడా ఒక తల్లిగా ఎంతో ఆనందపడింది. పుట్టిన బిడ్డను చూచి బింబసారుడే తన గర్భంనుండి మరోసారి జన్మించినట్లు ఆమె భావించుకొంటుంది (5–38). *''భర్త భార్యయందు ప్రవేశించి ఆమె గర్భమున తానే పుత్రుడుగా పుట్టును 'అంగాదంగాత్సంభవసి' అను వేదవచనముచే తండ్రి కొడుకులకు భేదము లేదు''*[20] కాబట్టే, తల్లికి ఉండవలసిన ఆత్మీయతను ప్రదర్శించగలిగింది. అంతేకాకుండా తన కొడుకు భవిష్యత్తుపట్ల చాలా జాగ్రత్త తీసుకొని, లిచ్ఛవుల ప్రతీకార జ్వాలకు బలికాకుండా (5–41)

అతని తండ్రి బింబిసారుడనే సంగతిని తెలివిగా వివరించి, మగధరాజ్యానికి పంపగలిగిన అనురాగమూర్తి ఆమ్రపాలి.

జ్ఞానియైన బుద్ధుడు వైశాలినికి ధర్మబోధ చేస్తూ వస్తాడు. ప్రజలు అనేకరకాలుగా జయజయధ్వనాలు చేస్తుంటారు. అవి ఆమ్రపాలి భవనందాకా మార్మోగి, తనకు బుద్ధునితో మామిడి తోటలో కలిగిన తొలినాటి దర్శనాన్ని గుర్తుచేసుకొంటుంది. తప్పకుండా ఆ కరుణామయుని కృపాకటాక్షం దొరుకుతుందని విశ్వసిస్తుంది (6-21). తనతోపాటుగా చెలికత్తెను తీసుకొని, బుద్ధుడు ఉన్న ఆరామానికి చేరుకొంటుంది. పతితులు రాకూడదని బుద్ధుని శిష్యుడు ఆనందుడు అడ్డుకోవటం, భగవానుడైన బుద్ధనికి విషయం తెలిసి, ఆమెకి కూడా దర్శనం లభిస్తుంది (6-35). స్త్రీ సహజ హృదయమే ఆమ్రపాలికి కూడా ఉండటం చేత పవిత్ర జీవనానికి అర్హత లేదనే విషయానికి బాధపడింది. తర్వాత బుద్ధుడిచ్చిన వివరణతో భక్తితో పాదాల మీద వాలుతుంది.

ఎంతోమంది ధనవంతులు బుద్ధునికి భిక్ష పెట్టాలని ప్రయత్నించినా లభ్యంకాని అవకాశం ఆమ్రపాలికి లభిస్తుంది. ఎన్నో ఏళ్లుగా ఆ భిక్ష సమర్పించటానికి నిరీక్షించిందామె (6-43). బుద్ధుని రాక సందర్భంగా ఎంతో హడావిడి పడుతూ, ఆనందపడుతూ ఎన్నో పిండివంటల్ని సువాసనలు వెదజల్లేటట్లు, ఎంత ధనం వ్యయమైనా ఫర్వాలేదని తలచి ఖర్చుచేసింది (6-45). గౌరవంతో ప్రేమతో బుద్ధుడ్ని ఆహ్వానిస్తుంది. ఆమె ఇంటికి బుద్ధుడు శిష్యులతో కలిసివస్తాడు. ఆమె పుష్పాలతో స్వాగతం పలికి, యథోచితాసనంపై కూర్చోమని ప్రార్థించి, తన జీవితం ధన్యమైందని తన సంతోషాన్ని వెల్లడిస్తుంది (6-48).

బుద్ధునికి భిక్షపెట్టే సమయంలో శిష్యులకీ, వైశాలినీ నగర ప్రజలకీ కూడా సంతృప్తిగా భోజనాల్ని పెడుతుంది (6-52). ఇంత చేసినా కొంతమంది బుద్ధుడిముందుకులట ఇంట భిక్షను స్వీకరించినందుకు తమకి తెలిసిన ధర్మశాస్త్రాల్ని ఏకరువుపెడతారు (6-56). ప్రజలు తమకి అనుకూలంగా ఏవిధంగానైనా మారిపోయి, మాట్లాడే స్వభావానికి సమాజం కోసమే జీవితాన్ని త్యాగం చేసినా ఆ సమాజమే నిందించటం, ఆ ఇంటి ఛాయలకే పోకూడదనటంతో ఆమెకి ఆవేదన కలుగుతుంది. అది సున్నితమైన మనసు ఉన్న ప్రతివారికి కలుగుతుంది. అది గమనిస్తాడు బుద్ధుడు (6-57) అపుడు వారికి ఆమె పూర్వజన్మ వృత్తాంతాన్ని చెపుతాడు (6-58).

గత జన్మలో ఆమె ఒక నెమలి. అడవి కాలిపోతూ, అందులో కాపురం ఉండే పక్షులు దహనమైపోతుండటాన్ని చూడలేక వాటిని రక్షించుకోవాలను

కొంటుంది. తన రెక్కల్ని తడిపి నెమలి సాహసం చేస్తుందని, ఇంద్రునికి సిగ్గూ, కోపం పెనవేసుకుంటాయి. ఇంద్రుడు పక్షితో మంటల్ని తన సహాయం లేకుండా ఆర్పటం సాధ్యంకాదంటాడు. సంభాషణ కంటే, ఆ సమయాన్ని కూడా మంటల్ని ఆర్పడానికి వినియోగించాలని అనుకొంటుంది (7-7). ఇంద్రుడు ఉగ్రుడై, గాలిని గట్టిగా ఊదటంతో మంటల్లో పడి ప్రాణ త్యాగం చేస్తుంది (7-9). సాటి ప్రాణుల్ని రక్షించటానికే తన జీవితాన్ని కూడా లెక్క చేయలేదు.

ఆమ్రపాలి ఇంద్రుని కోపానికి అన్యాయంగా గురైన త్యాగమూర్తి అని తెలిసేసరికి జనం ఆశ్చర్యపడేలా వారిచేతనే గొప్పగా ప్రశంసించబడుతుంది (7-13). బుద్ధుడితో నా జన్మధన్యమైందని అంటుంది (7-15). తనది తొందరపడి తీసుకున్న నిర్ణయంకాదనీ, పూర్వ జన్మ ఫలితంగానే గణభోగ్యగా మారాననీ, ఇతరులను నిందించటం అనవసరమని తెలిసికోగలిగిన వివేకవంతురాలు.

బుద్ధుని కృపాకటాక్షాల వల్ల ఆమె పాపం ప్రక్షాళన కాబడింది (7-21). ఒక విధంగా ఆమె పాపం చేయలేదు అనవచ్చు. తనకి తండ్రి బహూకరించిన, తాను దొరికిన ఆమ్రవాటిని బుద్ధునికి సమర్పిస్తుంది (7-28). తరువాత ఆమె బౌద్ధ సన్యాసాన్ని స్వీకరించి, స్వచ్ఛమైన మనసుతో మసులుకొంటుంది (7-31). తాను నేర్చుకున్న మధురమైన కవిత్వాన్ని బౌద్ధ ధర్మాన్ని ప్రచారం చేయటానికే వినియోగిస్తూ జీవితాన్ని బౌద్ధ భిక్షువుగా మార్చుకొని ధన్యమైంది. కావ్యమంతటా 'ఆమ్రపాలి' తన స్వయంనిర్ణయాధికారంతోనే జీవించి, తన స్వాంత వ్యక్తిత్వాన్ని కాపాడుకోగలిగింది. పరిస్థితులను గ్రహించి గణభోగ్యగా జీవితాన్ని త్యాగం చేయటంలో గానీ, గణభోగ్యకు కావలసిన నియమ నిబంధనలను విధించటం (2-47)లో గాని, ప్రియుడైన మగధ చక్రవర్తి బుద్ధుని దర్శనానంతరం, బౌద్ధభిక్షువుగా మారటం (7-31)లో గాని, ఎక్కడా రాజీ పడలేదని తెలుస్తుంది.

వేశ్యగా జీవితాన్ని మార్చుకోవటమనేది జీవితంతో రాజీపడటమవ్వదు. విధివశంగా, పూర్వజన్మ ఫలితంగా తీసుకొన్న నిర్ణయమే అవుతుంది. లేకపోతే సంఘాన్ని నిందించి కూడా, మరలా దాన్ని సరిదిద్దుకోగలగడం అసాధ్యం. ఆమ్రపాలి పేరునే కావ్యానికి ఉంచారు కవి. దీన్ని బట్టే ఆమ్రపాలి పాత్ర ఎంత ప్రధానమైందో స్పష్టమవుతుంది. కావ్యమంతటా ఆమ్రపాలి సౌందర్యం మెరుస్తుంటుంది. అయితే బాహ్య సౌందర్యంతో శాక్యధనికుని పెంపుడు కూతురుగా, అన్ని భోగాలు ఉన్న గణభోగ్య గా కన్పించిన ఆమెలో బుద్ధుని ధర్మబోధన, సందేశాలకు ప్రభావితమైన తరువాత ఆమెలో ఆధ్యాత్మిక సౌందర్యం ప్రకాశిస్తుంది.

## 3.3 బుద్ధుడు :

ఆమ్రపాలి కావ్యనాయకుడు బుద్ధుడు. ప్రపంచమంతా దుఃఖమయమనీ, దుఃఖానికి కారణం కోరికలనీ, కోరికలను విడనాడటానికి అష్టాంగమార్గాన్ని బోధించిన జ్ఞాని. సర్వజీవుల పట్ల కరుణను చూపిన దయామూర్తి. తన బోధనలతో మానవుని జీవన విధానంలోనూ, ఆలోచనా దృక్పథంలోను సరికొత్త శక్తిని కలిగించి, మోక్షానికి అందర్నీ అర్హులుగా ప్రకటించిన దివ్య తేజస్వి. కవి బుద్ధుని పాత్రను పోషించటంలో ఎంతో జాగ్రత్త వహించి, సమయాన్ని బట్టి ఆతని గుణ గణాలను బహిరంతర రూపాన్ని ఆయా పాత్రల చేత పలికించి, అవసరమైన చోట కవి కథాకథనంలో వర్ణించారు. కావ్యద్వితీయాశ్వాసం (స్వయం వరణము)లో తొలిసారిగా శాక్యధనికుని పాత్రతో బుద్ధుని ప్రస్తావన కన్పిస్తుంది.

*''తన త్యాగమహిమచే ధర్మమ్ము భువనాన*
*స్థాపింప దొరకొన్న శాంతమూర్తి*
*తన వాక్ప్రభావాన దయము శాంతియు భూత*
*కోటికి నేర్పించు మేటి గురువు*
*తన తపస్సిద్ధిచే ధారుణీవలయాన*
*జ్ఞానమ్ము పండించు మౌనిమౌళి*
*తన యహింసా సూత్రమున స్వర్గమునకు ని*
*శ్రేణిఁ గల్పించు విశిష్ట గుణుఁడు*
*మానవునకు క్రొత్త మార్గమ్ము చూపఁగ*
*తపము నాచరించు ధర్మపరుడు''* (2-20) అని బుద్ధుణ్ణి కీర్తింపజేశారు కవి. బుద్ధుడు శాంతమూర్తి అనీ, కరుణా హృదయుడనీ, ఒక ఆశయం సాధించటం కోసమే తపస్సు ఆచరించాడని, అది మానవులకు కొత్త మార్గాన్ని చూపి, ధర్మపథంలో నడిచేలాగున చేయాలనే సంకల్పం గలవాడని తెలుస్తున్నది. ఆతని తల్లిదండ్రులు మాయాదేవీ, శుద్ధోధనుడు, భార్య యశోధర. కపిల వస్తుపురానికి యువరాజు కాదగిన అన్ని అర్హతలు ఉన్నవాడు. అతడిని సిద్ధార్థుడని పిలుస్తారు (3-30). ఈ విషయాలన్నీ బుద్ధుని చేతనే పలికిస్తారు కవి. బుద్ధుని గొప్పతనం ఆతడిని చూడకముందే ఆమ్రపాలికి కూడా తెలుసు. స్వయంవర సభలో విప్రులతో మాట్లాడుతూ బుద్ధుడు జన్మించిన పరిశుద్ధమైన భారతదేశంలో కన్యగా పుట్టటం పొరపాటవుతుందా! (2-44) అని ప్రశ్నిస్తుంది. కానీ ఆమె అప్పటికి బుద్ధుడిని ప్రత్యక్షంగా చూడలేదు. బుద్ధుడు కూడా తపస్సులో పరిపూర్ణత సాధించటానికి కృషిచేస్తున్నాడు. ఈ విషయాన్ని కవి-

*"విశ్వసృష్టిలోని విశ్లేషణముఁగూర్చి*
*తెలిసికొనఁగ బయలుదేరి యిచటఁ*
*గూరుచున్నవాఁడఁ గొండంత యాసతోఁ*
*తెలిసికొనుట యెపుడు కలుగు నాక్కొ?"* (3-27) అని తెలపటం ద్వారా తెలుస్తుంది. ఆమ్రపాలి తొలిసారిగ చూచి, మోహావేశరాలైనపుడు ఆ ప్రదేశంలో 'ఆమ్రపాలి-బుద్ధుడు' తప్ప మరో వ్యక్తి లేడు (3-13). అటువంటి పరిస్థితుల్లో బుద్ధుడే ఆమె ఎవరో తెలిసికొని, తానెవరో తెలియపరుస్తాడు. ఆతని ఆలోచనలను కూడా కవి వర్ణించారు. 'బుద్ధుడు జ్ఞానమనే ధనం కోసం తపస్సు చేయాలని సంకల్పించిన చిన్నవాడు' (3-21) 'చిన్నవాడు' అనే ప్రయోగం వయసురీత్యా, విజ్ఞానరీత్యా రెంటింటినీ పరిగణలోకి తీసుకొనే ఆ పదప్రయోగం చేసి ఉంటారు కవి! చిన్న నాటినుండి తాత్త్వికవిషయాలపై ధ్యాస కలిగి ఉండేవాడని, ఆతని స్వభావాన్ని -

*కుంటిమేకను భుజమంటఁగా నిడుకొని*
*నిజముగా నెనరూని నిమిరినాఁడు*
*పొలము దున్నుచున్న ముసలివానిని గాంచి*
*కడవెడు కన్నీరు గార్చినాడు*
చనుచున్న *దారిలో శవమును* తిలకించి
*గుండెలో నెంతయో కుమిలినాఁడు*
*ఆశబాడఁబెటికి యనవద్యగతులకు*
*మానవాలి నెల్ల మలచుటకును..* (6-16) ఎంతో ప్రయత్నిస్తున్నాడని వివరించారు కవి. చారిత్రకముగా బుద్ధుడు నాలుగు దృశ్యాలను చూస్తాడు.[10] అవి 1.శరీరం కృషించిపోయిన ముసలివాడు (వార్ధక్యం) 2.అనేకరోగాలతో బాధపడుతున్న రోగి (రోగం). 3. ఖననం చేయడానికి తీసుకొని పోవుచున్న శవం (మరణం), 4.ప్రపంచానికీ తనకీ ఏ సంబంధం లేకుండా తాదాత్మంతో ఉన్న ఒక సన్యాసి (సన్యాసం), వీటిని చూసిన తరువాత బుద్ధుని జీవితంలో వైరాగ్యం ప్రవేశించి, లౌకిక సుఖాలు, జీవితాల పట్ల విరక్తి కలిగి సమస్తాన్ని త్యజిస్తాడు. దీన్ని కవిగారు పై పద్యంలో బుద్ధుడు ముసలితనాన్ని, శవాన్ని చూచిన విషయాన్నే స్పృజించారు. ఒక లక్ష్యాన్ని సాధించే ప్రయత్నానికి దగ్గరలో ఉన్న బుద్ధుడు తన గురించి తెలియని ఆమ్రపాలికి తానెవరో వివరించటానికి కారణం ఆతనిలో గల పరంగితజ్ఞ. పుట్టిన ప్రతీజీవి చనిపోవలసిందేననీ ప్రకృతిలో ఉన్న రహస్య వస్తు భేదాన్ని తెలిసికోవాలను కొంటున్నానీ చెప్తాడు (3-26). దీనివల్ల లౌకికమైన భోగాలపట్ల ఆసక్తి లేనివాడనేది తెలుస్తుంది.

బుద్ధుని బాహ్యాంతరస్థితులను కవి వర్ణించినా, అతని బోధనలకే ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇవ్వటం జరిగింది. అతని బాహ్యసౌందర్యం ఆమ్రపాలికి 'తేజోమయ దేహుని' గా కన్పించింది. మానసిక సంఘర్షణ, అశాంతితో నిండినప్పటికీ ఆమెకి బుద్ధుడ్ని చూసినపుడు చివరికి ఒకరకమైన ఆధ్యాత్మిక భావనే కలుగుతుంది.

*''ఆ గిరిజాల జూటంచుల కోర్కెమై*
*స్వర్గభూముల ముడివైచెనేమొ?*
*అవినిశ్చల తపోధ్యాన సంపద యరి*
*షడ్వర్గమును కాల్పఁజాలెనేమొ?*
*ఆ నిర్మలంబైన యాననంబున శాంతి*
*విమల భావము తాండవించెనేమొ?*
*ఆ మహాతేజశ్ఛటామూర్తి మంతంబు*
*ధరణి విభుతకు గుత్తకొనెనేమొ?'' (3-9)*

ఈ పద్యం ద్వారా బాహ్యస్వరూపాన్ని అంచెనా వేస్తే గిరిజాల జూటుగలవాడనీ, తేజోవంతమైన శరీరం గలవాడని వెల్లడవుతుంది. ఆంతరంగిక సౌందర్యాన్ని పరిశీలిస్తే ఆగిరజాల జూటంచులకు స్వర్గాన్ని, భూమిని ముడివేశాడేమోననీ, అనగా కోర్కెలను పెంచుకోవద్దనీ, అవినిశ్చల తపోధ్యాన సంపద అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభమైన ముఖంలో శాంతి, విమల భావాలు తాండవించాయేమోననీ, ఆ మహాతేజస్సు, మూర్తిమత్త్వంతో ప్రపంచాన్ని ఆకర్షించి మార్పుతేవటాని కేమోనని బుద్ధుని వ్యక్తిత్వానికి బాహ్యాంతర సౌందర్యాలను కలిపి ముడివేశారు కవి. మరి ప్రపంచమంతా ఆకర్షణకు లోనయ్యే పరిస్థితుల్లో, ఒక యౌవనవతి, తన ఆశలు తీరక సంఘంలో కొంతమంది చేసిన కుట్రకి జీవితాన్నే త్యాగం చేసిన ఆమ్రపాలి అతనితో చెలిమిన కోరుకోవటంలో ఆశ్చర్యమేమి ఉంటుంది! ఎంతో అపురూప సౌందర్యవతియైన ఆమె అతనిపై మనసు పెంచుకొని **ఈ శాక్యధనిసుతకెవ్వరీడే లేరు, భువిలోననని వీనిఁ బొందవలయు** (3-12)నని అనుకోగలిగిన సౌందరర్యమూర్తి బుద్ధడని స్పష్టమవుతుంది. బుద్ధుడు ఆమెతో మాట్లాడినపుడు, తాత్త్విక విషయాలే బహిర్గమవుతాయి. అతడు ఎవరో తెలియక శృంగార భావాన్ని మనసులోనే పెట్టుకొన్న ఆమ్రపాలి సర్వభోగాలను సమకూరుస్తాననీ (3-17) తన ఇంటిలో ఆతిథ్యమిస్తానంటుంది(3-19). ఆమె మానసికావస్థను గ్రహించగలిగిన బుద్ధుడు చిరునవ్వుతో ఆమె మనసులో నున్న బరువు తొలిగిపోయేటట్లు (3-21) జీవిత సత్యాలను విశదీకరిస్తాడు(3-24).

కపిలవస్తుపురానికి యువరాజుని కావాల్సిన వాడినైనా, రాగము, భోగము నాకు గిట్టవనీ (3-28) పేద, రైతు అనే భేదం లేకుండా ఈ ప్రపంచంలో ఉన్న మానవులందరికీ చావు తప్పటంలేదనీ, దాని హేతువుని తెలిసికోవాలనే లక్ష్యంతో బయలు దేరాననీ (3-25) తన జీవన పథాన్ని వివరిస్తాడు. బుద్ధుని మధుర వాక్కులు ఎన్నో కోర్కెలతో రగిలిపోతున్న 'గణభోగ్య' ఆమ్రపాలిని కూడా కోర్కెలను అణచుకొనేలా చేసి, పొరపాటు మాటలాడానిన పశ్చాత్తాప హృదయాన్ని కలిగించగలిగాయి (3-31). ఆమె బుద్ధుని పాదాలమీద పడుతుంది (3-32). తన ఆతిథ్యాన్ని స్వీకరించమని ప్రార్థిస్తుంది (3-33). కానీ, ఇంకా పరిపూర్ణమైన పరివర్తన ఆమెలో కలగలేదని, మనసులో నెలకొన్న శృంగార భావావస్థను గ్రహించగలిగి, తాను చేసే తపస్సు ఫలిస్తే, అపుడు ఆమె పెట్టే భి క్ష స్వీకరిస్తానని చెప్పి సంతృప్తి పరుస్తాడు (3-34). దానితో కొత్త అనుభవాన్ని పొంది నమస్కరిస్తుంది (3-35). బుద్ధునిలో ఉన్న శక్తి అటువంటింది.

'ప్రాంచదఖండ శాంత గుణ రమ్యుడై'న బుద్ధుడు వైశాలినీ నగరానికి వచ్చినాడనె వార్త తెలియగానే ఇసుక రాలనంత జనం ఎగబడి చూస్తారు (6.6) ఎన్నో విధాలుగా కీర్తిస్తూ, జయ జయ ధ్వానాలు చేస్తారు. అవి ఆమ్రపాలి భవనం దాకా వినిపిస్తాయి (6-20). ఇంతకుముందు ఆమ్రవనంలో వారి దర్శనం కలిగినపుడు, తపస్సుఫలిస్తే, ఏదొకనాడు అటు వచ్చినపుడు భి క్షస్వీకరిస్తానని బుద్ధుడు పలికిన మాటలు గుర్తొచ్చి, ఆమె ఎంతో సంతోషపడుతుంది (6-22). బుద్ధుని పలుకులే సంతోషదాయకాలు.

*''సత్యము నెమకంగ ధాత్రిని*
*మృత్యువు రాహస్యమెల్ల నెఱుగంగ నెంతో*
*ప్రత్యగ్ర భోగరాశుల*
*నత్యంతము వీడిన మహిమాఢ్యున్ జూతున్''* (6-23) అని అనుకొంటుంది. అప్పటికే బుద్ధుని దర్శించాలనే ఆసక్తి కలిగి ఉంది. సత్యాన్ని గ్రహించగలిగిన బుద్ధుని జీవితాన్ని అంతటినీ ఒక్క కందపద్యంలోనే ఆమ్రపాలి నోట ఎంతో రమ్యంగా పలికించారు కవి. తనవంటి కలుష విషనాయికకు భగవంతుడైన బుద్ధుని దర్శనం కలుగుతుందో లేదో (6-26) అని సందేహించి ఆ పుణ్యాత్ముడు పాపాత్ములను పరిశుద్ధం చేయగలడని ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించుకొన్నదని వివరించారు (6-26). ఈ భావన వల్ల బుద్ధుని ఔన్నత్యం మరింత తేటతెల్లమయ్యింది.

బుద్ధుని దర్శనాన్ని, ఆతని శిష్యుడు ఆనందుడు నిరోంధించినపుడు బుద్ధభగవానుడు గ్రహిస్తాడు (6-35). లోకంలో పాపికాని వాడెవడూ లేడనీ పాపి అని అనటం వల్లనే వాళ్లను మరింత పాప మార్గానికి మళ్ళించినట్లవుతుందని, మంచిని పెంచుకొనేలాగున చేయాలని వేశ్య అయినంత మాత్రాన జ్ఞానార్జనకి అర్హత లేదనకూడదని బోధిస్తాడు (6-36,37). ఇంటికి రేపు వస్తానని చెప్పి, ఆమె మనసులో క్రమ్మిన మలిన భావాల్ని తొలగించుకొని మెలగమని హితబోధ చేస్తాడు (6-38) ఆనందుడు స్వచ్ఛమైన భావంతోనే మసులుకుంటాడనీ, మనసులో బాధపెట్టుకోవద్దనీ నచ్చజెపుతాడు (6-39) బుద్ధుని కృపాయత్తైక చిత్తానికి మహదానందంతో భక్తితో పాదాలమీద వాలుతుంది (6-40). శిష్యుడు తన విధిని నిర్వర్తించటంలో లోపం లేదనీ, ఆనందుడిని సమర్థిస్తూనే బోధన కూడా చేసి ఇరు వర్గాలవారినీ ఆనందింపజేశాడు. బుద్ధునికి అందరూ ఆనందంగా ఉండాలన్నదే లక్ష్యం.

బుద్ధునికి భిక్షను సమర్పించాలని ఏడు సంవత్సరాలుగా ఎదురు చూసింది ఆమ్రపాలి. ఆతడు సమ్మతించాడు (6-43). ఆ సంఘటనతో సంభ్రమాశ్చర్యాలతో భిక్షను సమర్పించటానికి అన్ని పనుల్ని చేస్తుంటే కొంతమంది ఆమెను పరిహసిస్తారు. అంతటి మహాత్ముడు వచ్చి భిక్షను స్వీకరించడమెక్కడ జరుగుతుందని అనుకుంటారు (6-4). ప్రజల కష్టాలను పోగొట్టడానికి తపస్సు నాచరించిన బుద్ధుడు భిక్షను స్వీకరిస్తానని చెప్పి వెళ్లకుండా ఉంటాడా! ఆమ్రపాలి భక్తి శ్రద్ధలతో కమ్మని పిండివంటల్ని తయారుచేయించి స్వాగతం పలుకుతుంది (6-45). శిష్యసమేతంగా బయలుదేరి వస్తాడు. బుద్ధుని మూర్తిమత్త్వాన్ని అక్షరీకరించటంలో కవి చక్కని ఔచిత్య భరితమైన పదాల్ని ప్రయోగించారు.

> *"శిష్యవ్రాతము వెంటరా మునిజన శ్రేష్ఠుడు సన్మార్గ సం*
> *ప్రోష్యుండుత్తమ యోగసాధకుఁడు సంపూర్ణుండు యోగీంద్రుచ*
> *క్షుష్యశ్రీ యగునామె దేహళికి ప్రస్ఫోటించు ధర్మ ప్రథా*
> *నిష్యందైక దయామతిన్ జనియె తాన్ భిక్షమ్ముగైకొంటకున్"* (6-46)

దీన్ని బట్టి ఉత్తమ 'యోగ సాధకుడైన బుద్ధుడు', తన శిష్యులు వెంటరాగా, ఆమ్రపాలి ఇంటికి వెళ్లి భిక్షను స్వీకరించి ధర్మబోధ చేయటానికి కరుణా హృదయంతోవెళ్లాడు. 'ఉత్తమయోగసాధకుడు యోగీంద్రుచక్షుశ్రీ' అనే విశేషణాలు ప్రయోగించటం వల్ల మూర్తిమత్త్వానికి ఉన్నతి ఏర్పడింది. ఉత్తమ యోగ సాధకుడు అయినందునే తాను తపస్సుని ఆచరించటం, ఆవేదన నిండిన యౌవనవతిని ఆధ్యాత్మిక మార్గానికి మరల్చగలగటం సాధ్యమయ్యింది. ఇతరులకు

ఆనందాన్ని కలిగించగలిగే శక్తి గలవాడనే విషయం ఆమ్రపాలి పెట్టే భిక్షను స్వీకరించటానికి ఇంటికి వచ్చిన బుద్ధునిలో తన ఆనందానికి మీరే కారణమనటమే నిదర్శనం (6–47). ఎన్నో రకరకాల రుచికరమైన వంటల్ని తయారుచేయించినా బుద్ధుడు వాటిని ఆహారంగా స్వీకరించలేదు.

*''అటుకులశునమ్ము దినునట్టి యామ్రపాలి*

*అటుకులశనమ్ము పెట్టె బుద్ధాహ్వయునకు''* (6–51) వేశ్యాజీవితాన్ని గడుపుతున్న ఆమ్రపాలి తినే అటుకులనే బుద్ధుడు విన్నాడని వర్ణించటం వల్ల త్రికరణశుద్ధిగానే ఏ పనినైనా చేసే వ్యక్తిత్వాన్ని వెల్లడించటానికి కవి చక్కని సృజనాత్మకతను ప్రదర్శించారు. కేవలం బుద్ధునికీ, ఆతని శిష్యులకే ఆ పిండివంటలను పరిమితం చేయకుండా మిగిలిన వైశాలినీ ప్రజలకు కూడా పెట్టినదాన్ని గమనించి ఎంతో సంతోషిస్తాడు బుద్ధుడు(6–52).

ఆమ్రపాలి ఇంటిలో భిక్షను స్వీకరించిన అనంతరం బుద్ధునితో వైశాలినీ నగర ప్రముఖులు ఆమె మీద రక రకాలుగా చెపుతారు (6–54). ఎంతోమంది భాగ్యవంతులు మీకు భిక్షను పెట్టాలనుకుంటున్నా వేశ్య ఇంటిలో భిక్షాన్నాన్ని భుజించటమేమిటని ప్రశ్నిస్తారు (6–55). ధర్మ శాస్త్రాలన్నీ తెలిసిన వారనీ కులటను ముట్టుకోవటం గాని, ఆ ఇంటి నీడలకే పోకూడదనీ ఏకంగా భిక్షనే ఎలా స్వీకరించారో తెలియటంలేదనీ తమ అనుమానాన్ని, అవివేకాన్ని వెల్లగ్రక్కేస్తారు (6–56). వారి మాటలకు కన్నీళ్లు పెట్టుకున్న ఆమ్రపాలిని చూస్తాడు (6–57). అపుడు ఆమె పూర్వజన్మ వృత్తాంతాన్ని ప్రజలంతా మెచ్చుకొనేటట్లు వివరిస్తాడు (6–58).

ఆమె పూర్వమొక నెమలి. ఒకసారి అడవి కాలిపోతుంటే, దానిలో పడిపోయి ప్రాణాలు కోల్పోతున్న పక్షుల్ని రక్షించబోయి, ఇంద్రుని తలచుకోలేదనే ఆగ్రహానికి బలైపోయిందనీ పుట్టి గణభోగ్యగా జీవితాన్ని త్యాగం చేసిందని తెలియజేస్తాడు (7–10). బుద్ధుడు ఇటువంటివే ఎన్నో కథలు తన శిష్యులతో, ప్రజలతోను చెప్పినట్లు జాతక కథలను బట్టి తెలిసే చారిత్రక సత్యం.[41] కవిగారు కూడా చరిత్రను ఆధారం చేసుకొనే ఆమ్రపాలి జాతక కథను చెప్పారు. కానీ మార్పులన్ని చేశారు.

ఆమ్రపాలిని ఒక వేశ్యగా పరిగణించి పాపాత్మురాలుగా చూచిన వారినీ, వేశ్యాజీవితానికి కారణంగా భావించి ద్వేషం పెంచుకొన్న వారందరినీ బుద్ధుని బోధనలతో రెండు పక్షలవారినీ సమైక్యం చేయగలిగాడు. సంఘంలో శాంతి నెలకోవాలంటే సంఘర్షణలు, ఒకరిపట్ల మరొకరికి అపనమ్మకం, అవగాహనా

లోపం, నిజం తెలియకపోవటం వంటి సమస్యలను పరిష్కరించే సమన్వయంగా చేయగల మేథావి ఉండాలి. బుద్ధుడు ఆ పాత్రని సమర్ధవంతంగా నిర్వహించగలిగాడు. సంఘంలో ప్రేమబంధాన్ని పటిష్టపరచగలిగాడు. ఇరుపక్షాల్లో ఆనందం వెల్లివిరిసింది. ఆ ఆనందానికి ఆమె ఎన్ని జన్మలెత్తినా మీ అఖండమైన కరుణ ప్రసరించకుండా, నావంటి భోగకాంతకి దిక్కులేకపోవునంటుంది (7-22). ఆమె భక్తితో ఆమ్రవనాన్ని బుద్ధుడిని స్వీకరింపమన్నపుడు. క్షవణకులందరకును దాన్నివాసంగా స్వీకరిస్తాడు (7-30). ఆమ్రపాలిలో తప్పు చేశాననే ఆత్మన్యూనతా భావాన్ని పోగొట్టి ఆత్మవిశ్వాసాన్ని పెంచగలిగాడు.

ఆమ్రవనాన్ని, దానిలో ఉన్న ఆరామాన్ని స్వీకరించిన అనంతరం, తన చుట్టూ కూర్చున్న ప్రజలకు ఉపదేశం చేస్తాడు (8-2). నీ ప్రాణాలను ఎలా చూచుకొంటావో, అలాగే ఇతరుల ప్రాణాల్ని కూడా చూసినట్లయితే జన్మసాఫల్యమవుతుందనీ, విశ్వమంతా శాంతితో శోభిల్లుతుందని ప్రవచిస్తాడు (8-3). క్షణికమైన దేహాన్ని నిలుపుకోవటం కోసం, తుచ్ఛమైన భోగాల్ని అనుభవించటానికి అర్రులు చాస్తుంటారని విశ్లేషిస్తాడు (8-4) ఎన్నాళ్ళు బతికినా చావు తప్పదనే సత్యాన్ని వెల్లడిస్తాడు (8-5) మంచి చేసినట్లయితే అది శాశ్వతంగా మిగులుతుందని సన్మార్గం వైపు పయనించాలని ఉపదేశిస్తాడు (8-6). కోపం పనికిరాదనీ, ఈర్ష్యాద్వేషాలను విడనాడాలనీ, 'సారహీనమైన సంసార జడధి' లో ఈత కొట్టే కోరికలను నశింపజేసుకోమనీ ఉద్బోధి స్తాడు(8-7). ఆర్యసత్యాలను, అష్టాంగ మార్గాలను ఉపదేశిస్తాడు ఆతడిని ప్రజలు బుద్ధదేవునిగా '**దైవమీవిధముగా వచ్చెన్ ధరామండలికిన్**' అని నమ్ముతారు. ఆతని సందేశాలకు, బోధనలకు అందరూ ఆనంద పడతారు (8-16). బుద్ధుని ఆశీస్సులు పొందిన తరువాతనే తమ ఇళ్లకు వెళతారు.

కవి బుద్ధుని పాత్రను పోషించటంలో గల ప్రత్యేక అంశాలను విశ్లేషించుకొంటే, వాస్తవ, చారిత్రక విషయాలకు మెరుగులు దిద్ది కావ్యరమణీయతకు తోడ్పడే విధంగా మలచగలిగారు. శాక్య వంశానికి చెందిన రాకుమారునిగా, వివాహం చేసినా జీవిత సత్యాన్ని అన్వేషించటానికి భార్య, బిడ్డ, తల్లిదండ్రులను, రాజ్యాన్ని తృణప్రాయంగా వదిలివేశాడని తెలుస్తుంది. ఇవన్నీ చరిత్రతో కూడిన అస్థి పంజరాన్ని తయారుచేస్తే కవి సృజన మాంసాన్ని, ప్రాణాన్ని పోసినట్లయ్యిందని అభివర్ణించవచ్చు. ఆమ్రపాలి ఒంటరిగా బుద్ధుడిని ఆమ్రవనంలో చూచి, మోహావేశ వివశురాలవడం, గమనించిన బుద్ధుడు, తన జీవితాన్ని వివరించటం, ఆమె సమాధానం, సంభాషణ నాటకీయశైలిలో వర్ణించారు. అదే

అస్థిపంజరానికి మంసాన్ని సమకూర్చగలిగింది. బుద్ధుని దర్శనం, భిక్షను స్వీకరించటం అతని కరుణ హృదయంతో కథ మలుపుతిరిగి ప్రాణాన్ని పోసినట్లయ్యింది. ఇన్ని విషయాలరీత్యా ఈ కావ్యానికి బుద్ధుడే నాయకునిగా పరిగణింపబడినాడు. కావ్యనాయిక ఆమ్రపాలి జీవితాన్ని కూడా కొత్త మార్గానికి మళ్లించగలిగిన బుద్ధుడు కావ్యనాయకుడు అవుతాడనేదే నా అభిప్రాయం. ఇది శృంగార రస ప్రధానమైన కావ్యం కాదు. కాబట్టి బుద్ధుడే కావ్యనాయకుడు.

బుద్ధుని గుణగణాలను కావ్య ఇతివృత్తాన్ని రసవంతంచేస్తూ, బౌద్ధ ధర్మ ప్రతిష్ఠాపన దిశగా పాత్రను పయనింపచేశారు. భారతీయ సంస్కృతిలో గల శాంతి సందేశాన్ని, క్షమాగుణాన్ని, దయను మూర్తీభవించిన పాత్రగా బుద్ధుని పాత్రను పోషించి దేశ ఔన్నత్యాన్ని ప్రకటించారు కవి.

## 3.4. బింబిసారుడు

మగధ రాజ్యాన్ని క్రీ.పూ.6వ శతాబ్ది మధ్య కాలంలో హార్యాంక రాజ వంశానికి చెందిన ప్రసిద్ధ ప్రభువు బింబిసారుడు పరి పాలించాడు. క్రీ.పూ.545లో సింహాసనాన్ని అధిష్టించాడు. ఇవి చారిత్రకంగా తెలిసే విషయాలు. వీటికి ఎక్కడా భంగం కలుగకుండా డా॥జ్ఞానానంద కవి ఆమ్రపాలి కావ్యంలో బింబిసారుని పాత్రను పోషించారు.

కావ్యంలో కూడా బింబిసారుడు బుద్ధుని సమకాలికుడు. మగధ రాజ్యాన్ని శాంతియుతంగా కాపాడుతూ, ప్రజల్ని సుఖ సంతోషాలతో పాడిపంటలకు లోటులేకుండా తన ధైర్యసాహసాలతో పరిపాలిస్తుండేవాడు (4-31). ఉత్తమ వంశానికి చెందిన క్షత్రియునిగా, వీరునిగా, ధైర్యవంతునిగా, అందమైనవానిగా సరస సంభాషణాచతురినిగా, ప్రియురాలికోసం రాజైనప్పటికీ మారువేషంలో ఆమె ఇంటికి వెళ్లి ప్రణయకేళిలో మునిగితేలిన శృంగారిగా కన్పిస్తాడు. అలా రహస్య ప్రణయకేళి సాగించినా, ఆమెకి పుట్టబోయే బిడ్డకి వారసత్వాన్ని ఇవ్వటానికి అంగీకరించిన నిజాయితీ పరునిగా అవసరమైనపుడు ఆత్మీయుల సూచనలు, సలహాలనువిని, తానే ఆఖరి నిర్ణయాన్ని తీసుకొనే నాయకత్వ లక్షణాలు గల వ్యక్తిత్వ వివేకశీలిగా, బింబిసారుణ్ణి చిత్రీకరించారు. అతడు పలుయువతులను వివాహం చేసుకోవట మనేది రాజ్య విస్తరణ వ్యూహంలో భాగమే! కానీ, అంతటి భుజ బల పరాక్రామవంతడై ఉండి కూడా గణభోగ్యను అందరిలాగా తానూ అనుభవించటం వరకే పరిధిని నిర్ణయించాడనుకోవచ్చు. రహస్యంగా చేసిన ఆ పనికి సిగ్గుపడటం కంటే, బహిరంగంగానే వివాహం చేసుకుంటే కావ్యానికి నాయకుడై ఉండేవాడు. ఒక వేశ్యను రాజుగా వివాహమాడి అంతఃపుర

రాణిని చేసుకోవటం అతనికి ఇష్టమున్నట్లు ఎక్కడా కన్పించదు. ఆమె అందాన్ని దొంగ చాటుగా పొందాడు. ఈ గుణమే బింబిసాడిని కావ్యనాయకుడనే ఉన్నతస్థానాన్ని కూలగొట్టింది. ఇది కవి తెలియక చేసిన వర్ణనకాదు. బౌద్ధ ధర్మాన్ని ప్రతిష్ఠాపించటానికీ, చీకటి గదుల్లో ఆవేదనతో కుమిలిపోతోన్న ఆమ్రపాలి, వారిలాంటి వారెందరికో బింబిసారుణ్ణి కావ్యనాయకునిగా చేయకుండా బుద్ధుడినే కావ్యనాయకునికి ఉండవలసిన ఉత్తమలక్షణాలన్నింటినీ కలిగించారుకవి.

వేశ్యగా మారిన ఆమ్రపాలి నిర్మించిన భవనంలో కళాకారులు చిత్రాలను, శిల్పాలను ఆకర్షణీయంగా సమకూరుస్తారు. ఆమె వాటిని పరిశీలనగా చూస్తున్నపుడు మగధరాజైన బింబిసారుని చిత్తరువు కన్పిస్తుంది. విచ్ఛవులకు శత్రురాజైనప్పటికీ, వైశాలినీ నగరవధువుకి నిర్మించిన భవనంలో బింబిసారుని చిత్తరువు ఉండటమనేది ఆతని ప్రసిద్ధిని తెలియజేస్తున్నది. ఆ చిత్రాన్ని చూచి సోయగవు ముద్దగా భావిస్తుందామె. పూర్వ జన్మ వల్లనో, దైవసంకల్పం వల్లనో ఆమెకి అతనిపై అనురాగం కలుగుతుంది. కవి, వీరిమధ్య ఉన్నది కామ సమాగం కాదని, దైవ ప్రేరితమని సూచిస్తున్నారు.(4-24)

బింబిసారుణ్ణి కనీసం చూచే భాగ్యమైనా ఆమ్రపాలికి కలుగుతుందో లేదోనని అనుకోగలిగిందంటే ఎంత అందగాడో తెలుస్తుంది(4-25). చెలికత్తెలు ఆమె సిగ్గు దొంతర్లలో దాగిన ప్రేమ హృదయాన్ని గ్రహిస్తారు. ఆ అంత రంగాన్ని తెలిసికోవాలనుకొని బింబిసారుని గురించి తమకి తెలిసిన విషయాలను వెల్లడిస్తారు .(4-27)

*భుజ బలోద్ధతి హిందూభువనమ్ము పాలించు*
*పురుష సింహుడు ముగ్ధ మోహనుండు*
*నిరతాతిశయ హర్ష నిర్భరుల్ పాటించు*
*జగతి పేర్గాంచిన మగధ రాజు*
*దిక్చక్ర రాశి ప్రతిధ్వనింపంగ రణ*
*వ్యూహముల్ సాగించు సాహసుండు*
*వలరాజు కన్న నిబ్బడి యంద చందాల*
*నంతరించిన రసజ్ఞ ప్రభుండు*

*సాహసోదగ్రమూర్తి విస్తార రాజ్య*
*పాలకుడు శత్రుభీకరుండో లలామ!*
*పేరు బింబిసారుండు పృథివీ పతీంద్రుం*
*డితని పేరను లిచ్ఛవు లేవగింత్రు'' (4-28).*

దీనిలో బింబిసారుని గొప్పతనమంతా ఇమిడి ఉంది. మొదట హిందూమతాభిమానియై ఆతడు తరువాత కాలంలో బౌద్ధాన్ని ఆదరించాడు. ఇది చారిత్రక సత్యం. ముగ్ధమోహనుడు, రణవ్యూహ చాతుర్యం గలవాడు, రసజ్ఞుడు, విశాలమైన రాజ్యాన్ని పాలిస్తున్న వాడని, ఆతడంటే లిచ్ఛవులకు గొట్టదనీ తెలుస్తుంది. వీరిమధ్య శత్రుత్వమున్న సంగతి తెలిసినా బింబిసారుడిని తన భవనానికి రప్పించుకోవాలని భావించినదంటే ఎంతగా ఆతడు ఆమ్రపాలిని ఆకర్షించాడో అర్థమవుతోంది (4-29). వ్యక్తిలోని మంచి గుణాలు సమ్మోహన పరిచేందుకు ఎంతో ప్రేరణను కలిగిస్తాయి. చెలికత్తెలు బింబిసారుడు ప్రజలకి ఏ కష్టాలుకలగకుండా పరిపాలిస్తున్నాడని, దాని వల్ల ప్రజలు హాయిగా బతుకుతున్నారని చెబుతారు (4-30,31). ఒక చెలికత్తె ప్రజలు అంతా రాజుని కీర్తిస్తున్నారని అంటుంది (4-32). ఇవన్నీ ఆమ్రపాలి బింబిసారుడి పట్ల ప్రేమాభిమానాలు పెంచుకోవడానికి ప్రేరకాలుగా పనిచేశాయనటంలో సందేహంలేదు.

స్వీయ రాజ్యాన్ని రక్షించుకొనే వ్యూహంలో భాగంగా కోసల, వైశాలినీ, విదేహ రాజ్యాల రాకుమారిలను వివాహం చేసుకున్నాడు (4-33). ఆతని గొప్పతనాన్ని జైన మత గ్రంథాలు కూడా చాటుతున్నాయి (4-34). ఇంకా అతడిని వర్ణిస్తూ-

''ఇతని సంగర సముద్ధతికి హస్తాలెత్తి
బ్రహ్మదత్తుని యంగరాజ్యలక్ష్మి
ఇతని శౌర్యోజ్జ్వల స్థితికి నవంతి గాం
ధార రాజులు చెల్మిఁ గోరినారు
ఇతని పౌరుషరాశి యీ లిచ్ఛవ ప్రభు
సుత చాలన కు హర్ష గతిని గూర్చె
ఇతని మహోదార దృష్టిని బరికించి
శాక్యమునీంద్రుడు సంతసించె

రాజనీతిజ్ఞుఁడితడు ధర్మమునకెపుడు
దెబ్బరానీని మగధ పృథ్వీతలేంద్రుఁ
డితని బాహాబలమ్మది యింతగాదు
నెచ్చెలీ! నిజాన కతండు మెచ్చు నిన్ను'' (4-35) అని ప్రోత్సహిస్తుంది చెలికత్తె. ఈ వర్ణనను బట్టి బింబిసారుని బల పరాక్రమాలు, ధర్మదృష్టి వ్యక్తమవుతున్నాయి. ఎలాగైనా సరే బింబిసారుడిని తన మందిరానికి

రప్పించుకోవాలని, ఆమ్రపాలి తనకి నమ్మకస్తుడైన వ్యక్తితో సందేశాన్ని పంపితే సందేశం పట్టుకొచ్చిన దూతని తగిన రీతిలో సత్కరించి వైశాలినీ నగరానికి వస్తానని చెప్పి పంపిన సంస్కారి. ఆమ్రపాలి పట్ల ఆకర్షితుడై మన్మథపీడితుడవుతాడు. ఆమె అందమైందని ఇదివరకే విన్నాడు. అందుచేత ఆమె తనను ఆహ్వానించినందుకు గణభోగ్య అయినా ఫర్వాలేదని తలచాడు (5-5). తనలో ప్రవేశించిన మన్మథవికారానికి తనకే ఆశ్చర్యమేస్తుంది (5-8). శత్రువుల మదాన్ని అణచివేసేవాడు అయిన ఒక మగధరాజే వేశ్యవలపులో చిక్కుకోవటమేమిటని తనలో తాను తర్కించుకొనటం(5-7) తనని తాను ఎప్పటికప్పుడు పరిశీలించుకోవటమే అవుతుంది. ఆమెలో ఉన్న నాట్య నైపుణ్యం, సౌందర్యాలకు ఆకర్షితుడై ఆమె పట్ల అనురాగం పెంచుకుంటాడు (5-9).

తనకి ఆత్మీయులైన మంత్రులను పిలిచి ఆమ్రపాలి పట్ల తన ఇష్టాన్ని తెలిపితే, తొందరపడి వైశాలినీ నగరానికి వెళ్లవద్దని సలహానిస్తారు (5-10). వైశాలినిని పాలించే చాటకాధి పతి కుమార్తె చాలన్నను పెండ్లిచేసుకొన్నప్పుడు, నీ భుజ బలానికి, విచ్చవ రాకుమారులు అసూయపడ్డారని, మిమ్మల్ని జయించలేక ఇపుడేమైనా పన్నాగం పన్నవచ్చు. అందుచేత వెళ్లటం మంచిదికాదని చెబుతారు. వారి మాటలను వినికూడా తానేమి చేయాలో ఆలోచించుకొని, తన మిత్రుడు, సేనానీ అయిన గోపుడిని పిలిచి విషయాన్ని వివరించి ఆమ్రపాలి ఉండే నగరానికి బయలుదేరతారు (5-15) రాజు సలహాకోరవచ్చు, అయినంత మాత్రాన ఆ సలహాలనే పాటించాలనే నియమమేదీ లేదు. తానేమీ చేస్తే అదే శాసనమైనా, ధర్మమైనా అవుతుంది. ఒక శత్రుదేశానికి చెందిన అందమైన యువతి ప్రేమించాననీ, భవనానికి రమ్మని కబురు పంపితే భయపడి వెళ్లకపోతే ఆ రాజు ధైర్యశౌర్యాలేమిటని భావించి ఉంటాడు. హృదయంతో కూడా ఆలోచించి ఉంటాడు. ప్రేమకి విలువ నివ్వగలిగాడు. మంత్రులు మంచిని చెప్పినా వాళ్లు బుద్ధితోనే ఆలోచిస్తారు. రాజ్యశ్రేయస్సు, రాజశ్రేయస్సు ప్రధానమని తలుస్తారు. రాజుమాత్రం బుద్ధికీ, హృదయానికీ పని కల్పించగలిగాడు. ఆమ్రపాలి హృదయాన్ని తన హృదయంలో పోల్చిచూసుకొని ఉంటాడు. అందుకే మంత్రుల సలహాలను పట్టించుకోలేదు. ఆమెనెపుడూ చూడలేకపోయినా, గోపుడే అన్ని పనులు చక్కబరుస్తాడనే నమ్మకంతో ఏ బందోబస్తు లేకుండా సేనాని గోపుడిని వెంటబెట్టుకొని నగరానికి బయలుదేరతాడు (5-19,20).

బింబిసారుడు, ఆమ్రపాలి భవనానికి వెళ్లే ప్రయాణాన్ని వర్ణించినపుడు, నన్నయ్య విరచిత 'ఆంధ్రమహాభారతం'లో శకుంతల ఉండే ఆశ్రమానికి దుష్యంతుడు వెళ్లేటప్పుడువలికే స్వాగత వర్ణన గొర్తొచ్చేలాగున వర్ణించారు కవి.

ఆమ్రపాలి కావ్యంలో ఈ వర్ణన చేసేటపుడు లీలామాత్రంగానైనా ఆంధ్రమహాభారత వర్ణన గుర్తుకి వచ్చి ఉండవచ్చుననిపిస్తుంది.

*మగధభూనాధున తెగువను గమనించి*
*యుడు మార్గమున మొగుల్ గొడుగు పట్టె*
*హార్యాంక విభుప్రేమయానమ్ము వీక్షించి*
*వాయుపోతము పహరా యొనర్చె*
*బింబిసారావనీ ప్రియుని రాకడఁ గాంచి*
*పరభృతమ్ములు పాట పాడసాగె*
*నిశ్శ్రేయగుణుఁడు శ్రేణికుని జాతరఁజూచి*
*పూలబాలలు సుగంధాలు సల్లె*

*వరుసనకు బేధములు కల్గు ప్రకృతికాంత*
*మహిత మంగళ ప్రదముగా మారిపోయే*
*ధరణి విభునకు మధ్యే పథమ్ము నందు*
*వేనవేల్ శుభశకునాలు గానుపించె (5-21)*

మగధరాజైన బింబిసారుని తెగువను గమనించి రెండు మార్గాలు గొడుగులు పట్టాయట! హార్యాంక వంశానికి చెందిన ఈ రాజు చేసే ప్రేమ ప్రయాణాన్ని చూచి వాయుపోతము పహారా కాచింది అతని రాకను చూచి కోకిలలు పాటలు పాడాయి. పువ్వులనే బాలలు సుగంద పరిమళాలను చల్లాయి. ప్రకృతి కాంతయే మంగళ ప్రదంగా మారిపోయింది. ఇటువంటివెన్నో శుభశకునాలు కనిపించాయి. ఒక వేశ్య ఇంటికి వెళ్లేటప్పుడు శుభశకునాలేమిటనీ, అనౌచిత్యమనే పొరపాటు పడటానికి వీలుంది. శత్రురాజు, వైశాలినికి వెళుతున్నాడు. ఏ అపజయం జరుగదనేదిసూచన. అంతేకాకుండా బిడ్డపుడితే తన దగ్గరకు పంపించడమనేది ఈ శుభశకునాల ఫలితమే! లేకపోతే వేశ్యకు పుట్టిన బిడ్డనెవరు కొడుకుగా అంగీకరిస్తానని ఒప్పుకొంటారు. కావ్యాన్ని చదివే పాఠకులకు ఈ గుణమే బింబిసారుని పట్ల కొంత సానుభూతి అభిమానాన్ని కలిగిస్తుంది.

బింబిసారుడు, గోపుడితోపాటు మారువేషాల్ని ధరించి గూఢచారులకు కూడా తెలియకుండా వైశాలినీ నగరమంతా చూచి ఆశ్చర్యపోతాడు (6-22). ఏ మాత్రం అనుమానం రాకుండా ఆమ్రపాలితో ప్రణయకేళిలో మునిగి అరురోజులు గడుపుతాడు (5-23). తన ప్రేమానురాగ ప్రణయంతో ఆమె పుణ్యం ఫలించిందని, కొడుకు పుడతాడనే సంతోషానికి కారణమవుతాడు (5-25).

విచ్ఛవులకీ విషయం ఎలాగో తెలిసి ఆమె భవనాన్ని సోదా చేయాలని తలుస్తారు (5-29). తాను చేసిన రహస్యమైన ఎంగిలిపనికి పరితపించి, మగధకి బయలుదేరేటపుడు తన చేతి ఉంగరాన్ని ఆమె చేతికిస్తాడు. కొడుకు కలిగితే ఉంగరాన్ని తొడగమంటాడు. పరిస్థితులు ఎలాగ ఉంటాయో చెప్పలేమనీ, ఉంగరాన్ని ఇచ్చి పంపితే కొడుకుగా అంగీకరిస్తానంటాడు. లిచ్ఛవుల కంట బడకుండా ఆమ్రపాలి సహాయంతో అక్కడి నుండి తప్పించుకుంటాడు (5-34).

వైశాలిని నుండి పుత్రుడు విమలకొండని బింబిసారుని దగ్గరకు ఆమ్రపాలి పంపినా, యువరాజుగా పట్టాభి షేకం చేయలేదు. ఆ ప్రయత్నం చేసినట్లు కూడా కావ్యంలో ఎక్కడా చెప్పబడలేదు.

ఇవన్నీ పరిశీలించిన తర్వాత బింబిసారుడుకి కావ్యనాయకుడు కాదగిన అర్హతలు లేవని తేలింది. భుజబలపరాక్రమవంతుడైతే ఆమె సౌందర్యానికి ముగ్ధుడైనవాడు, ఎంతమందినో వివాహమాడినవాడూ, ఆమెను ఎందుకు వివాహం చేసుకోలేకపోయాడు! ఆమ్రపాలితో గడిపి వెళ్లిపోయేటపుడు - ***''కాంత! నీకు పూర్తిగా నవమాసాలు నిండెనేని కడుపు పండెనేని కొడుకు కల్గెనేని తొడుగుమీయుంగర''*** (5-32) మని చెప్పాడు. తొమ్మిది నెలలు నిండితే, అనగా వేశ్య కాబట్టి 'గర్భము' నిలబడదనా? నిలబెట్టుకోదనా? ఒకవేళ నిలబెట్టుకున్నా కడుపు పండాలి కదా! పండితే అనగా ప్రాణాలతో నిలిస్తే శిశువు జన్మిస్తే ఆ శిశువు **'మగపిల్లవాడు ఐతేనే'** తన ఉంగారాన్ని తొడగమంటాడు. **'అంగుళీయంబిమ్మి ముదానఁ బంపు మపుడేనుగ్రహించెద వానిఁపుత్రునిగా'** (5-33) అని పేర్కొంటాడు. దీన్ని బట్టి ఆతని ఆంతరంగిక స్వభావాన్ని పరిశీలిస్తే ఆమ్రపాలిని కేవలం అనుభవించటానికే నాటకమాడాడడనిపిస్తుంది. ఇటువంటి లక్షణాలు ఉత్తమ నాయకునికి కళంకాలుగా మిగిలిపోతాయి. కవి జాగ్రత్తగా విమలక బింబిసారుడు పుత్రునిగా స్వీకరించినట్లుగాని, యువరాజుగా రాజ్యాభిషేకం చేసినట్లు గాని వర్ణంచలేదు. దీని వల్ల బింబిసారుని పాత్ర మనస్తత్వం బాగా వ్యక్తం కావటానికి దోహదపడింది.

ఆంధ్రమహాభారతంలో అంగుళీయకం లేకపోయినా శకుంతలను ఆకాశవాణి వాక్కులు రక్షించాయి.[42] కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం లో మత్యకారులకు దొరికిన అభిజ్ఞానాన్ని చూచి దుష్యంతునికి గతమంతా జ్ఞాపకం వస్తుంది.[43] ప్రియుణ్ణి మనసులో తలచుకొంటూ, దుర్వాసమహర్షి రాకను గమనించలేదని, అంటే పెద్దలను గౌరవించలేదని భావించి ఆ మహర్షి శపిస్తాడు. దేనికోసమైతే అంత ఏకాగ్రతతో ఉండే ఎదుటివారిని నిర్లక్ష్యం చేశావో సమయానికి

అతను నిన్నుమరచిపోతాడని శపిస్తాడు. అందువల్ల అభిజ్ఞానం ఆ కథల్లో ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. ప్రస్తుత కావ్యంలో బింబిసారుడు అభిజ్ఞానం వల్ల పొందే ప్రత్యేక ప్రయోజనమేదైనా ఉందంటే అది రాజముద్రిక గా పనిచేయవచ్చు తప్ప, కొడుకుని గుర్తించడానికి అదే ఆధారం కానవసరంలేదు. అదొక నెపంగా పెట్టాడు బింబిసారుడు. తరువాత కథని వివరించటం కంటే అసలు కథకే ప్రాధాన్యతను ఇవ్వటం వల్ల కవి దాన్ని పట్టించుకోలేదనిపిస్తుంది. బింబిసారుడు ఒక శృంగారిగా, బలపరాక్రమవంతునిగా రాజ్యవిస్తరణ చతురునిగా తీర్చిదిద్ది, ప్రధానకథకు ఈపాత్ర తోడ్పాటుని ఎంతగానో కలిగించారుకవి.

## 3.5 శాక్యధనికుడు

ఆమ్రపాలి తండ్రిపేరు శాక్యధనికుడు. ఒక సాయం సమయంలో వేటకు బయలుదేరుతాడు. పిల్లలు లేకపోవటం వల్ల ఎంత ఉన్నతస్థితిలో ఉన్నప్పటికీ అతని మనసు ఎందుకో విచారంగా ఉంటుంది. ఒక ఆమ్రవనంలో అడుగుపెట్టగానే ఒక పొదచాటునుండి కేకవినిపిస్తుంది. చుట్టుప్రక్కల మనుషులు ఎవరూ కనిపించరు. చూచి, ఆ పసిపిల్ల అనాథ అనుకొని, ఎంతో మక్కువతో ఎత్తుకొని ఇంటికి తీసుకొని వెళతాడు. భగవంతుడిచ్చిన వరంగా దంపతులిద్దరూ భావిస్తారు. **నాపుణ్యమ్ము ఫలించె నేఁడని మహానామ్ముండు సంతోషకేళీ పాథోధి తరంగ భంగములఁదేలతాడు.** ఆ పిల్లల్ని తన స్వంత కూతురులాగానే భావించి ఆమ్రవనంలో దొరికినందువల్ల ఆమ్రపాలిగానే పిలుస్తూ సమస్త కళలను నేర్పించాడు (1-18). తనతోపాటు పూజా పురస్కారాల్లో పాల్గొనేటట్లు చేసిన వాత్సల్యశీలి. అసమసౌందర్య గుణశీలి అయిన ఆమ్రపాలిని దుర్మార్గులైన విచ్ఛవరామకులేమి చేస్తారోనని అనుమానిస్తూనే ఉండేవాడు (1-22). ఈ విషయంలో తనలో తాను చాలా ఆవేదనకు గురయ్యేవాడు.

శాక్యధనికుడు శౌర్యరసస్వరూపులకు చక్కటి తావలమైన ఇంటిలో జన్మించినవాడు, భాగ్యవంతుడు, ఆర్యులు మెచ్చే జీవితాన్ని కొనసాగించాలనే లక్ష్యం గలవాడు (1-25). విచ్ఛవులకి భయపడి చెడుమచ్చకి గురికాకూడదనుకొని కూతురికి ఎంతో వైభవంగా పెళ్లిచేయాలనుకుంటాడు . ఆ సంగతి జనపదాలన్నింటికీ తెలుస్తుంది. తన కుమార్తెకు నచ్చిన వీరుడినే వివాహం చేయాలనే తలంపుతో స్వయంవరసభను ఏర్పాటు చేస్తాడు. సభకి దేశదేశాలకు చెందిన రాజులు వస్తారు. సభలో కూతురి పట్ల తనకెంత ప్రేమ ఉందో 'పంచరత్నాలు'[8] వంటి అయిదు పద్యాల్లో వివరిస్తాడు. అవకాశాన్ని పురస్కరించుకొని, ఆహ్వానాన్ని మన్నించి వచ్చిన లిచ్ఛవరాజులను, సభనూ

ఉద్దేశించి, ఎవరినో ఒకరిని వరిస్తుందని ప్రకటిస్తాడు (2-7). ఆ ప్రకటనకు నిశ్చేష్టులైన విచ్ఛవులు అలా జరగటానికి వీలులేదని వ్యతిరేకిస్తారు. వారి చేష్టలకు తల్లడిల్లిన శాక్యధనికుడు –

*''కలలోనైనఁదలపంగా నిజము వక్కాణింప నాశ్చర్యమే*
*కలుగున్ బిడ్డలఁగన్న వారలకు లోకబందు నీలాటి వ*
*ల్కులు విన్నంతనె ముల్కులై వెలసి మాగుండెల్ విదారించు మీ*
*రలు రాజన్య కుమారకుల్ భువన ధర్మశ్రీ సముద్ధారకుల్''* అని ప్రశ్ని

స్తాడు (2-13). ఒక తండ్రిగా ఏమాటలైతే వినకూడనివో, అవే వినేసరికి తండ్రిగా పుత్రికమీద వాత్సల్యాన్ని కాపాడుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తాడు. సభలోనున్న వారికి విచ్ఛవులు చేసే పని తప్పని చెప్పటానికి ప్రయత్నిస్తాడు. విచ్ఛవుల ఉన్నతిని కీర్తిస్తాడు (2-17). గొప్పదయామయుడైన బుద్ధుని అడుగు జాడల్లో పయనించేవారనీ, ఆ కరుణ మీకు కూడా కలిగి, తన కుమార్తె పెండ్లికి ఆటంకం కలిగించవద్దనీ ప్రార్థిస్తాడు (2-20-27) అందరికీ భార్య కావాలనే ఈ కోరిక మంచిది కాదని సభలోని ప్రజలందరినీ తన పక్షాన చేసుకొన్నట్లు–

*''అందురా? యిది ధర్మమైన కార్యమ్మని*
*లేరాకో? తమకు చెల్లెండ్రు నుడవ*
*విందురా? యిది మహానంద సత్క్రియయన్న*
*ఎఱుఁగరో? ధర్మంపు చరిత మీరు*
*కందురా? యిది బుద్ధ కర్మంది బోధగా*
*చదువరో? ధమ్మాల సారనీతి*
*కొందురా? యిది బుధానంద వస్తువు గాఁగ*
*తెలియరో? హైందవస్త్రీల చరిత*

*గురుకులాన విద్యఁ గఱచిన మీకెల్ల*
*ననుభవైక వేద్యమై తనర్చు*
*నన్నుఁబోలువాని విన్నాణవుంబల్కు*
*లెంతలేసి నుడువ నీక్షణాన''* (2-25) అని ఆవేదన చెందుతాడు.

తమకి చెల్లెళ్లు ఉంటే ఎవరూ ఇది ధర్మమైన పని అని అనరు. ధర్మం తెలిసిన వారెవరూ ఇది మంచిపని అని చెప్పరు. బౌద్ధ ధర్మాన్ని వివరించే ధమ్మాలలో ఎక్కడా ఇటువంటి విషయం ప్రోత్సహించలేదు, ఎంతో గొప్ప చరిత్ర ఉన్న భారతస్త్రీ పాతివ్రత్యాన్ని తెలిసికోవాలని శాక్యధనికుడు చేసిన ప్రసంగంలో ప్రశ్న తానేవేసి, దానికి సమాధానం కూడా తానే చెపుతాడు.

ఒక విషయాన్ని ప్రతిపాదించటం దాన్ని ప్రశ్నించటం ద్వారా ఖండించటం, పూర్వప్రతిపాదిత విషయాన్నే సమర్థించటమనేది ఎదుటివాళ్లను తన వైపుకి తిప్పుకొనే వక్తకి ఉండే ఉత్తమ లక్షణం. ఈ ప్రయత్నం వల్ల కూడా వారిలో మార్పు కనిపించలేదు.

'మంచిగుణాలతో అందరూ మెచ్చుకొనేటట్లు నడుచుకొంటున్న నా కూతురు మీకు గణభోగ్యగా కావలంటున్నారు. దానికి బదులు గుండెల్లో కత్తులు నృత్యం చేయటమే నాకు సుఖాన్ని కలుగజేస్తుంది (2-26).

'ఇక్కడ ధర్మదేవత నాల్గుపాదాల నడిచింది. సాంఘిక ఆచారాలకు దేవత పన్నీరు జల్లింది. ఐకమత్యం కొనసాగింది. కులభావాలు ఎన్ని ఉన్నా కలిసి మెలిసి తిరిగారు. అర్హమత ధర్మం శాంతిని నెలకొల్పింది. అటువంటి గొప్పదేశం మనదని గుర్తుచేస్తాడు (2-27). ఆమ్రపాలిని గణభోగ్యగా చేయాలనుకున్న తర్వాత మాది గొప్ప సార్వభౌమత్వమని గర్వంగా చాటుకోలేదు. ప్రజలు చులకనగా చూస్తారు. ఇటువంటి పనులకు ప్రజలు హర్షించరనీ శతవిధాలుగా వివరిస్తాడు. ఆమ్రపాలి వేశ్య కాకుండా చేయాలని ప్రయత్నించి, నిస్సహాయతతో కన్నీళ్లు పెట్టుకుంటాడు (2-29).

లిచ్ఛవ యువరాజుల కోరిక, వాళ్లని ప్రశ్నించే సాహసం ప్రజల్లో కన్పించకపోవటం, తనని కాపాడాలని తండ్రిపడుతున్న ఆవేదన, ఇవన్నింటినీ గమనించిన ఆమ్రపాలి తండ్రివైపు తేరపారచూస్తుంది (2-30). **విద్ధమనస్కుడై విషాధ పరీతుఁడై** హఠాత్తుగా నిలబడి పెళ్లికి పనికిరాదు, కానీ ఆమెమీకు గణభోగ్య **కావాలా?** అని నిస్సహాయ నిలువెత్తు రూపమై వాళ్లని నిందిస్తున్నట్లుగానే నిలబడిపోతాడు (2-31). తరువాత ఆమ్రపాలి లేచి తన నిర్ణయాన్ని ప్రకటిస్తుంది.

కవి, శాక్యధనికుని పాత్రను పోషించటంలో, ఎక్కడా ఆమ్రపాలిని గణభోగ్యగా అంగీకరిస్తున్నట్లు వర్ణించలేదు. కావ్యంలో కీలకమైన అంశం ఆమ్రపాలి గణభోగ్య వేశ్యగా మారటమనేది ఎలాజరిగిందనేదే కావ్య విలువను తెలియజేస్తుంది. ***''ఒక కావ్యాన్ని విమర్శిస్తున్నపుడు వస్తు కళలను రెంటినీ అంచనా వేయాల్సిందే. రెంటికీ కట్టిన విలువే కావ్యం యొక్క మొత్తం విలువగా తేలుతుంది.***[49] అంటారు ప్రముఖ విమర్శకులు డా॥ ముదిగొండ వీరభద్రయ్య గారు. కాబట్టి కావ్యాన్ని వస్తువు, శిల్పం రెండింటిమీదా కవి దృష్టిని సారించాలి. జ్ఞానానందకవిగారు వస్తువుని శిల్పంలోను, శిల్పాన్ని వస్తువుతో కలిపి కావ్యసొగసుకి ఉపయోగించారు. తండ్రిగా ఎవరూ తన కూతుర్ని వేశ్యగా అంగీకరించరు. అది అనురాగానికి, ఆత్మీయతకు, మానవతా విలువలకు పతాక సన్నివేశం.

శాక్యధనికుడు విచ్ఛవులను ప్రార్థించటం, హెచ్చరించటం, సభలో స్పందన కరువైనందుకు నిస్సహాయుడిగా మిగిలిపోవటం వంటి సన్నివేశాల్లో కనిపిస్తాడు. వీరుడా? కాదా! అనేది నిర్ణయించడంలో 'వైశాలి' ఒక జనపదం. దాన్ని పరిపాలించడానికి ఒక పరిషత్తు ఉంటుంది. ఏ పరిస్థితుల్లోనైనా పరిషత్తు నాయకుని పని నచ్చకపోయినా, తొలగించటం సులభమే అవుతుందనటంలో సందేహంలేదు. ఆమ్రపాలి గణభోగ్యగా అంగీకరించకపోతే, తండ్రియైన శాక్యదనికుడు ఆమెను రక్షించుకోవటానికి ఒంటిరిగానైనా యుద్ధం చేసి ఉండునేమో! వీరత్వ ప్రదర్శనకంటే, శాక్యధనికుని పాత్రలో ఒక ఉన్నతమైన తండ్రి హృదయాన్ని చాలావరకు చూపటానికి కవి ప్రయత్నించారని తెలుస్తుంది. వేశ్యగా మారిన తరువాత ఆమె రాజ్యానికి చెందిన అందరికీ గణభోగ్య. కనుక ఆమెను మరలా చూసినట్లుగాని, ఆమెతో సంభాషణ చేసినట్లుగాని అతడిని ప్రవేశపెట్టలేదు. బహుశా! ఏ మనోవ్యధకో గురై మరణించి ఉంటాడని భావించవచ్చు. కవి దీన్ని పాఠకులకే వదిలివేశారు.

## 3.6. లిచ్ఛవులు

డా॥జ్ఞానానందకవిగారు ఆమ్రపాలి కావ్యంలో వైశాలినిని పాలించే యువరాజులను 'లిచ్ఛవులు' అని మాత్రమే పేర్కొని, వాళ్లకి ప్రత్యేకించి పేరు పెట్టకుండా సృష్టించిన పాత్ర. వీరి దుర్మార్గం వల్ల చరిత్రలో పేరు లేని వాళ్ళుగానే మిగిలిపోవటం మంచిదని తలచిగాని, కనీసం ఏ లిచ్ఛవ యువరాజుకీ పేరుపెట్టలేదని చమత్కరించవచ్చు.

లిచ్ఛవులు, వైశాలినీ పట్టణాన్ని తమ భుజ బలంతో కళ్లు మూసుకుపోయే గర్వంతో పరిపాలించేవారు (1-20). ఆమ్రపాలిని చూచి లిచ్ఛవులు గుటకలు మింగుతుండేవారు (1-21). తమ కోర్కెలను నెరవేర్చుకోవటమే ధర్మంగా బతికేవారు. శాక్యధనికుడు గణతంత్ర రాజ్యానికి నాయకుడై ఉండికూడా, వారిని ఏమీ అనలేకపోయేవాడు (1-22). చక్రవర్తిని నామమాత్రంగానే ఉంచి, అధి కారాన్ని అంతటినీ వారే చెలాయించే వారని దీన్ని బట్టి స్పష్టమవుతుంది. వాళ్ల స్వభావం తెలుసును కాబట్టే, తన కూతురికి ఏదైనా జరిగినట్లయితే కలుగచేసుకుందామని చక్రవర్తి నిమ్మకునీరెత్తినట్లు ప్రవర్తించేవాడు (1-23). వాళ్లు ఆమ్రపాలి మీద మోహాన్ని పెంచుకుంటారు. లిచ్ఛవులకి భయపడి కూతురికి పెళ్లిచేయటం ఆపకూడదని అనుకొని శాక్యధనికుడు వివాహప్రయత్నాలు చేపడతాడు. అది అందరితోపాటు లిచ్ఛవులకీ తెలుస్తుంది.

లిచ్ఛవులుకి ఆమ్రపాలి పట్ల గల వ్యామోహాన్ని కవి వివరించారు. ఆమెకు ఏర్పాటుచేసిన స్వయంవరసభను చూడటానికి సంబరపడిన వాడొకడూ (1-29). వేదాధ్యయనం, భరతనాట్య శాస్త్రాల్లో ఆరితేరిన ఆమెతో తనకే పరిణయం జరగాలని ఆశిస్తున్న వాడొకుడూ (1-30). అంత లావణ్యవతికి తానే భర్తనని మరొకపేరు తలచుకోవటమేవెర్రి అవుతుందనే గర్విష్టి మరొకడూ (1-31), ఎన్నో జన్మాల ఫలమైన ఆమ్రపాలి ఎవరిసొత్తు అవుతుందోనని ఎదురుచూచినవాడు ఇంకొకడూ (1-32), అని వాళ్ల వ్యక్తిత్వాన్ని తెలిపారు కవి. వాళ్లలో కూడా వేదవిజ్ఞానం, భరతనాట్యం వంటి సాహిత్య, సాంస్కృతిక అంశాలపట్ల అభిమానం ఉన్నవాళ్లు ఉన్నారని వెల్లడవుతుంది. వీటి అన్నింటికీ మించి ఆమెను పొందాలనే ఇచ్ఛకలవాళ్లే ఎక్కువనేది స్పష్టమవుతుంది. నాలుగేపద్యాల్లో వాళ్ల వ్యక్తిత్వాన్ని వర్ణించటంలో 'దుష్టచతుష్టయం' వంటి వాళ్లు అనేది కవి చూపిన శిల్ప నైపుణ్యం.

ఆమ్రపాలికి స్వయంవర సభనేర్పాటుచేసి, వివాహ ప్రకటన చేసిన శాక్యధనికునిపై కోపాన్ని ప్రదర్శిస్తారు. ఆమెకు పెళ్లి చేసి ఒక్కనికే దక్కటం కుదరదనీ, అందరికీ భార్యగా కావాలని పట్టుపడతారు(1-9). వాళ్లని ఎన్నో విధాలుగా శాక్యధనికుడు కీర్తించి, ప్రార్థించి, హెచ్చరించి, నిర్వర్యుడై పోతాడు. అలా చేస్తారు వాళ్లు. చక్రవర్తిని నామమాత్రంగా చేసి, ప్రజల్ని అమాయకుల్ని చేసి రాజ్యాన్ని తమ చేతుల్లోకి తీసుకొని, తమకి నచ్చిందే ధర్మంగా ప్రవర్తించే కాముకులైన యువరాజులు లిచ్ఛవులు. శాక్యధనికుడు వాళ్లనుండి ఆమ్రపాలిని రక్షించాలనే ప్రయత్నంతోనే బుద్ధుని మార్గంలో పయనించే వారిగా శ్లాఘిస్తాడు. బుద్ధుని మార్గంలో పయనిస్తూ, పరిపాలించే వాళ్లయితే అంత దుర్మార్గంగా ప్రవర్తించరు. గురుకులంలో విద్యనభ్యసించినా ఆ మంచి లక్షణాలు వాళ్లకి అబ్బలేదు. గూఢాచారులను సరైన వాళ్లను నియమించుకోలేని అసమర్థులనేది, ఆరు రోజుల పాటు శత్రురాజైన మగధరాజు బింబిసారుడు, తన సైనికునితో మారువేషంలో వైశాలినీ నగరం రావటం, ఆరురోజులు ఆమ్రపాలి భవనంలో ప్రణయకేళి సాగించటమే నిదర్శనం (5-23). లిచ్ఛవరాజ్యంలోనే బతుకుతూ కూడా లిచ్ఛవుల పట్ల కంటే శత్రురాజైన బింబిసారుని రాజ్యాన్ని, ఆ రాజ్య ప్రజల సుఖ సంతోషాలను ఆమ్రపాలి చెలికత్తె మెచ్చుకోవడం ప్రజలు వాళ్లనేవిధంగా భావిస్తున్నారేది తెలుస్తుంది. లిచ్ఛవులలో సరసగుణాలు, ఆకర్షణ లేదని, అసమర్థులని బింబిసారుడు ఆమ్రపాలి భవనంలో ఆరురోజులు గడపటం, వైశాలినీ రాజ్యానికి చెందిన 'చాటక అధిపతి' పుత్రిక చాలనను పెండ్లిచేసుకోవటం, శత్రురాజు చేసుకోవటం, అపుడతనిని లిచ్ఛవులు జయించలేక కోపాన్ని పెంచుకోవటమే వాళ్ల నిర్వీర్యతను వెల్లడిస్తుంది.

కావ్యంలో లిచ్ఛవులను అసమర్థులుగా, విద్యను అభ్యసించినా దాన్ని స్వార్థ ప్రయోజనాలకే వినియోగించుకొన్న కాముకులని, ప్రజల్ని సరిగా పట్టించుకోనివారిగా చిత్రించారు. ఇటువంటి వాళ్లు కాబట్టే ఆమ్రపాలిని గణభోగ్యనుగా చేయమని ఆమె తండ్రి, తమ చక్రవర్తి అయిన శాక్య ధనికుడ్ని నిలదీయగలిగారని కవి వాళ్ల పాత్రలను **దుర్మార్గుల సామూహిక పాత్రగా** పోషించారని విశ్లేషించవచ్చు.

## 3.7. ఆనందుడు

సమాజంలో సాధువులు కూడా వేశ్యలను ఎలా పరిగణిస్తున్నారో చూపుతూ, బుద్ధుని లాంటి వాళ్లు వారినెలా ఆదరిస్తున్నారో తెలియజెప్పేందుకు, బౌద్ధ ధర్మ ఔన్నత్యాన్ని చాటేందుకు ఆనందుని పాత్ర చిత్రణను కావ్యానికి వినియోగించారు కవి.

ఆనందుడు బుద్ధుని ప్రియశిష్యుడు. అతడు కర్తవ్య నిర్వహణలో నిమగ్నమైనవాడు. వేశ్య అయిన ఆమ్రపాలి, బుద్ధుణ్ణి దర్శించాలనుకొన్నప్పుడు అడ్డుకున్న వాడు (6-32). వేశ్యలకు బుద్ధుని దర్శనం లేదని చెపుతాడు (6-34). ఆ దృశ్యం బుద్ధుని ఆత్మలో మెరుస్తుంది. ఆమెకు దర్శనం ఇవ్వడానికి బుద్ధుడు అంగీకరించి, వేశ్య అయినంత మాత్రం చేత జ్ఞానార్జనకు (మోక్షానికి) అర్హత లేదనరాదని బోధించిన భగవానునికి ఎదురుచెప్పలేదు ఆనందుడు. ఆమ్రపాలితో ఆనందుడు పలికిన వాక్యాలను బాధపెట్టుకోవద్దని, స్వచ్ఛమైన భావంతోనే మసులుతాడనీ, జాలికలిగిన వాడనీ బుద్ధునిచేత ప్రశంసించబడినవాడు (6-39). ఆనందుని పాత్ర బుద్ధుని ఔన్నత్యాన్ని మరింతగా దేదీప్యమానంగా కావటానికి ఉపయుక్తంగాను, వేశ్యను బుద్ధుడు ఎందుకు చేరదీసి ఆమెనుండి భిక్షను స్వీకరించాడో వివరించటానికి తోడ్పడింది.

## 3.8. గోపుడు

మగధరాజు బింబిసారునికి నమ్మకస్తుడు, మిత్రుడైన సేనాని గోపుడు. ఆమ్రపాలిని కలుసుకోవాలనుకొన్న రాజు ఆలోచనను పునఃసమీక్షించుకోమని మంత్రులు చెప్పినప్పటికీ, చివరిగా గోపునితో మాట్లాడి, వైశాలీనగరానికి వెళ్లటానికి నిశ్చయించుకొంటాడు (5-15). గోపుడు రాజుకి అంతరంగికునిగా కూడా వ్యవహరించేవాడని దీన్ని బట్టి తెలుస్తుంది. బింబిసారునికి, ఆమ్రపాలి ఏ పరిచయమూ లేనప్పటికీ వారిద్దరి మధ్య ప్రణయకేళి జరగడానికి గోపుడే తోడ్పడ్డాడు (5-18). గోపుడు వెంట ఉంటే రాజుకి సైనికుల అవసరం కూడా

ఉండదు. ఏ బందోబస్తూ అవసరంలేదు (5-19). అందుచేతనే గోవుడిని మాత్రమే వెంటబెట్టుకొని శత్రురాజ్యమైన వైశాలినీ నగరానికి రాజు వెళ్లాడు. రాజుతో పాటు ఆతడు కూడా వేషం మార్చుకొని నగరమంతా చూచి, ఆమ్రపాలి ఇంటిలో రాజు బింబిసారుడు ఆరురోజులు స్వేచ్ఛగా ఆనందంగా గడపగలిగాడంటే గోవుని సామర్థ్యం వెల్లడవుతుంది. కథకి అవసరమైనంతమేరకే ఈ పాత్రను పోషించారుకవి.

## 3.9. ఇంద్రుడు

తనపెద్దరికాన్ని లెక్కచేయకుండా, తన సహాయాన్ని అర్థించకుండా నిర్లక్ష్యంతో వ్యవహరించిందనే కోపంతో నెమలిని శపించిన ఆవేశపరునిగా ఇంద్రుని పాత్రపోషించబడింది. ఆ శాపం ఫలితంగానే ఈ జన్మలో ఆమ్రపాలిగా జన్మిస్తుంది (7-11). ఆమ్రపాలి కావ్యానికి గొప్ప మలుపు ఇంద్రుని శాపం. ఒక అడవిలో నివసిస్తున్న నెమలి కాలిపోవుతున్న అరణ్యాన్ని రక్షించాలనే ప్రయత్నంతో, తన రెక్కల్ని నీటితో తడిపి, ఆ మంటల మీద జల్లుతుంది (7-5). అది ఇంద్రునికి ఒక విధంగా అమాయకతనంగా కన్పిస్తుంది. ఆ సాహసానికి సిగ్గుపడతాడు (7-5). తనలాంటి వాళ్ల సహాయం లేకుండా మంటలు ఆర్పడమెలా సాధ్యమవుతుందని, తనని నిర్లక్ష్యం చేశావని నెమలిని గద్దిస్తాడు (7-6). ఎంతో ఆగ్రహంతో హెచ్చరించినా, ఆ మాటల్ని పట్టించుకోకుండా తన పనిలో తాను నిమగ్నమవుతంది. దేవతలకు అధి పతి ఐన ఇంద్రుడినే లెక్కచేయకపోవటంతో అధికారం ఉండి కూడా భంగపాటుకి గురైనట్లు బాధపడతాడు. ఆవేశంతో పెద్ద గాలిని సృష్టిస్తాడు (7-7). బ్రహ్మాండం కంపించేటట్లు ఉన్న ఆ పెనుగాలుల్లో పడి నెమల్ని ప్రాణాలు పోగొట్టుకొనేట్లు చేస్తాడు (7-9).

పెద్దవారిని గౌరవించాలనేది, వారి సలహాలను, సహాయాన్ని తీసుకోవాలనే సూచన పాత్ర చిత్రణలో వున్నప్పటికీ, ఆపదలో ఉన్నవాళ్లను రక్షించుకొనే త్యాగమూర్తులు, లౌకికాన్ని ప్రదర్శించటం కంటే తాను ఏదో ఒకవిధంగా ఎదుటివాళ్లకు ఉపయోగపడాలనే చూస్తారు. అటువంటి వారి గొప్పతనం ఈ కావ్యంలో ఇంద్రుని వంటి సంకుచిత మనస్తత్వం గల పాత్రల వల్లనే బయటపడే అవకాశాలు కొన్నిసార్లు జరుగుతుంటాయి. ఆమ్రపాలి ఏ స్వప్రయోజనాల్ని ఆశించని, లౌకికాన్ని ప్రదర్శించని త్యాగమూర్తి. నెమలిలోని గొప్ప తనం వెల్లడి కావటానికి ఇంద్రుని పాత్ర ఉపయోగపడింది. ఆమ్రపాలి ప్రజల సానుభూతికి పాత్రమవ్వడానికీ ఇంద్రుని పాత్రచిత్రణే కావ్యానికెంతోరమణీయతను చేకూర్చగలిగింది.

## 3.10. విమలకొండ

బింబిసారుని వల్ల ఆమ్రపాలికి కలిగిన పుత్రుడు. అందమైనవాడు, వీరుడు. మగధరాజైన బింబిసారుడే మరోసారి ఆమ్రపాలి గర్భం నుండి పుట్టినట్లు వాడు (5-38). నిరంతరం లిచ్ఛవుల దుర్మార్గాల గురించి విచారించే తల్లికి ఆనందాన్ని కలిగించినవాడు (5-35). విమలకొండ పాత్రను చిత్రించటంలో కవి కుటుంబం - వివాహ వ్యవస్థలు మనిషి జీవన మార్గం మళ్లించటంలో ప్రధాన పాత్రను వహిస్తాయనే అంతర్నిగూఢభావాన్ని నిక్షిప్తం చేశారు. గణభోగ్య అయిన ఆమ్రపాలికి పుట్టడం వల్ల యువరాజు కాలేకపోయాడా? లేక జీవితం పట్ల విరక్తితో శాంతిమార్గాన్ని వెతుక్కొంటూ బౌద్ధసన్యాసిగా మారాడా? అనే అనుమానం కలుగుతుంటుంది. ఆమ్రపాలిని బింబిసారుడు అంతఃపురకాంతగా చేసుకొన్నట్లయితే వారి వివాహం ఉన్నతమై, ఆ కుటుంబంలో పుట్టిన విమలకొండ జీవితం మరోవిధంగా మారి ఉండేదేమో! తల్లి దండ్రుల ప్రభావం విమలకొండ మీద చాలా పనిచేసింది. ఎందుచేతనంటే విమలకొండ చాలా పరాక్రమవంతుడు అయి ఉండి కూడా బౌద్ధాన్ని స్వీకరించాడు. దీని అర్థం బలవంతులు బౌద్ధాన్ని స్వీకరించకూడదని కాదు. తల్లి ప్రభావం అతనిలో లౌకిక విషయాలపై నిరాసక్తతను కలిగించి, పరాక్రమాన్ని రాజ్య నిర్వాహణకు ప్రయోగించలేదని తెలుస్తుంది. అతడు ఎంత పరాక్రమవంతుడో చెప్తూ

*''అది యెంత పోరాటమైన సరేనిల్చి*
*అరులను దెగటార్చునట్టి జోదు*
*అది ఎంత కొఱుక రానిదియైన శాస్త్రవే*
*దార్థాల నెఱుఁగు వేదాంగ వేది*
*అది యెంత భీకరంబైన మృగంబైన*
*చిటికలోఁ బరిమార్చు సింహబలుడు*
*అది యెంత క్లిష్ట కార్యంబైన విజయమ్ము*
*గొనుదాక నిద్రవోవని ఘనుండు*

*ఎట్టిమల్లయుద్ధమెట్టి తంత్రప్రయుక్తి*
*యెట్టి గంద్రగోళమెట్టిదైన*
*చిత్తుజేసి గొప్ప చిచ్చుఅపిడుగయ్యె*
*నమ్రమందఁగా ప్రజాలికపుడు''* (5-39) అని విమలకొండను వర్ణిస్తారు కవి. ఈ పద్యంలో విమలకొండ గుణశీలాన్ని అంతటినీ కొండ అద్దమందు కొంచమై కనబడునట్లు నైపుణ్యంతో వివరించారు. అంతగొప్ప వీరుడైనప్పటికీ చెడును గాంచి బాధపడు చిత్తము గల్గినవాడు. బింబిసారుడు అతని తండ్రి అని, మూర్ఖులైన

లిచ్ఛవుల వల్ల వైశాలినీ నగరంలో ఉండవద్దని, మగధరాజ్యానికి వెళ్లిపొమ్మని తల్లి చెప్పిన మాటప్రకారమే చేస్తాడు (5-52). తల్లి మాటనెపుడూ జవదాటనివాడు. బౌద్ధ సన్యాసిగా జీవిస్తాడు (7-32). ఒక వేశ్యకు పుట్టిన పిల్లల పరిస్థితి ఎలా ఉంటుందో విమలకొండపాత్ర వల్ల చాలా వరకూ అవగతమవుతుంది.

## 3.11. చెలికత్తెలు

ప్రత్యేకించి పేరుపెట్టకుండా 'చెలికత్తెలు' అని మాత్రమే సంబోంధి ంపబడిన పాత్రలు. ఆమ్రపాలికి సహాయకారిగా ఉండేవారు. ఆమె బింబిసారుని పట్ల ప్రేమాభి మానాలు పెంచుకోవటానికి కొంతవరకూ తోడ్పడినవారు (4-35) తాము నివాసముంటున్న రాజ్యాన్ని గురించేకాకుండా పొరుగురాజ్యాల రాజులు, పరిపాలన, ప్రజల అభి ప్రాయాలు' గమనించగలిగిన వారు. ఆమ్రపాలి అంత రంగాన్ని గ్రహించగలిగినవారు (4-27). లిచ్ఛవులకంటే బింబిసారుని గొప్పతనాన్నే మెచ్చుకొంటారు. బింబిసారునికీ, లిచ్ఛవులకీ ఆగర్భశత్రుత్వం ఉందనే సంగతి వీరికి బాగాతెలుసు. అయినా ఆ రాజుని వైశాలినీ నగరానికి రప్పించటంలోనే రాజకీయ చాతుర్యం వెల్లడవుతుందని సూచించినవారు (4-29) ఆమ్రపాలి వెన్నంటి ఉండేవారు కాబట్టే, ఎంతో పవిత్రమైన బౌద్ధ దర్శనానికి కూడా ఆమె వెంట ఒక చెలికత్తెను తీసుకొని వెళుతుంది (6-29). బింబిసారునికి గోపుడు, ఆమ్రపాలికి చెలికత్తెలు ఉండబట్టే ఇద్దరి మధ్య ప్రణయం సవ్యంగా కొనసాగింది.

## 3.12. నెమలి

లౌకికం ప్రదర్శించటం తెలియని అమాయకురాలిగా, త్యాగశీలిగా నెమలిపాత్ర కన్పిస్తుంది. ఇంద్రుని కోపానికి గురై ప్రాణం పొగొట్టుకోవటమే కాకుండా మరలా జన్మలో కూడా కష్టాలను అనుభవించింది. కావ్య సప్తమాశ్వాసం (వివరణము)లోనెమలి వృత్తాంతాన్ని బుద్ధునిచే చెప్పబడింది. ఆమ్రపాలి గణభోగ్యగా జీవితాన్ని గడపటానికి నెమలి జన్మలో గురైన శాపం ఫ లితమేనని తెలిసేసరికి ప్రజలకు ఆమెపట్ల ఎనలేని అభి మానం ప్రేమ కన్పిస్తుంది. ఆమె తప్పులేదనీ చెప్పటానికి ఈ పాత్ర సృష్టి జరిగిందని భావించవచ్చు. ఒక అడవిలో కలిసిమెలిసి బతికే పక్షులు, జంతువులూ హఠాత్తుగా సంభవించిన పెనుగాలికి వచ్చిన మంటల్లో పడి కాలిపోవటం చూడలేక సహాయపడాలనుకొంటుంది (7-2). ఆ ప్రయత్నం చాలా సాహసంతో కూడింది. ఒక చిన్నపిట్ట అడవిని అంతటినీ ఆర్పడమెలా సాధ్యమవుతుందని ఆలోచించలేదు. తన ప్రయత్నాన్ని కొనసాగించింద. ఇంద్రుడు, తనను తలచుకోకుండా నిర్లక్ష్యంతో, దుస్సాహసానికి

దిగిందనుకొంటాడు. తానుచేయని పని ఆ నెమలిచేస్తున్నందుకు సిగ్గుపడతాడు. తన సహాయాన్ని పొందకుండా అడవిని ఆర్పడం సాధ్యం కాదని హెచ్చరిస్తాడు (7-6). అమాయకురాలైన ఆ నెమలి ఆ మాటలను పట్టించుకోకుండా, తన పనిలో తాను నిమగ్నమైపోతుంది(7-7). అదే ఆ పక్షి చేసిన తప్పిదం! అది చూచి ఉగ్రుడైన ఇంద్రుడు గాలిని గట్టిగా ఊది, మంటలు మరింత పెరిగేటట్లు చేస్తాడు. ఆ గాలికి తట్టుకోలేక నెమలి మంటల్లో పడి ప్రాణం విడుస్తుంది (7-9). ఆ తరువాత జన్మలో ఆమ్రపాలిగా పుడుతుంది (7-11).

మంచివాళ్లు తాము సమాజానికి ఏదోకవిధంగా తోడ్పాలనే అనుకొంటారు తప్ప, 'రాజకీయాలు' కొనసాగించటానికి ఇష్టపడరు. అవసరమైతే ప్రాణాలను అయినా సరే తృణప్రాయంగా త్యజిస్తారు. నెమలి వంటి పూర్వ జన్మ వృత్తాంతాలను బుద్ధుడు తన శిష్యులకు, ప్రజలకు ఎన్నో చెప్పినట్లు జాతక కథలు వివరిస్తున్నాయి.

ఒక త్యాగశీలిగా నెమలి పాత్రను సృష్టించి, వేశ్యగా జీవితాన్ని కొనసాగించిన ఆమ్రపాలికి బౌద్ధ భిక్షువుగా అర్హతను బుద్ధుడు ప్రసాదించటంలోని పరమార్థం ఈ పాత్ర ద్వారా వ్యక్తమైంది.

ఈ విధంగా జ్ఞానానందకవిగారి ''ఆమ్రపాలి'' కావ్యంలో గల పాత్రలను అధ్యయం చేసినప్పుడు కవి ప్రదర్శించిన శిల్పనైపుణ్యం, కవి ప్రతిభ చక్కగా వ్యక్తం కావటమే కాకుండా పాత్ర నిర్మాణ వైవిధ్యంలో గల ప్రత్యేకత కూడా గోచరిస్తుంది. కథకూ, రసాస్వాదనకు పాత్ర పోషణ ఎంత అవసరమో పరిశీలించటం జరిగింది. చరిత్రలోని అంశాలనే స్వీకరించి కూడా కావ్యానికి రమణీయతను కల్గించే విధంగా చేసిన కల్పనలను విశ్లేషించటం వల్ల ఆయా పాత్రలు కావ్యా విలువను పెంచడానికి దోహద పడిందని తెలుస్తుంది. అంతేకాకుండా సందర్భానుసారంగా ఇతర వ్యక్తుల్లోని పాత్రలను కూడా తులనాత్మకంగా. పరిశీలించి ఆ కావ్య పాత్రలకంటే సన్నిహితమైన పాత్రను ఈ కావ్యంలో తీర్చిదిద్దిన ప్రత్యేతకనూ కావ్యానికి ఒకగూర్చిన ప్రయోజనాన్ని బహిర్గతం చేయడానికి ప్రయత్నించాను.

# నాల్గవ అధ్యాయం

# ఆమ్రపాలి కావ్య రచనా వైశిష్ట్యం

## 4.1.0. వర్ణనలు

డా॥జ్ఞానానందకవి గారి ఆమ్రపాలిలో కావ్య వర్ణనలు ఎంతవరకు ఉన్నాయో, అవి కావ్యానికి ఎలా వినియోగింపబడ్డాయో పరిశీలిచంటం ప్రస్తుత లక్ష్యం. *"కనులకింపు గొలుపు రంగులవలె కథాంశ మునకు వలయు వాతావరణమును వర్ణన మనఁదగును కథయెడల సహృదయుని సుముఖుని చేయుటకై సృజించు వాతావరణము వర్ణన మననగును"*[47] అని కావ్య వర్ణనను డా.పాన్నెకంటి హనుమంతరావు గారు నిర్వచించారు. ఈ నిర్వచనమును బట్టి కథాంశానికి కావాల్సిన వాతావరణాన్ని కలుగజేస్తూనే సహృదయుణ్ణి రస లోకాలలో విహరింప జేసి ఆనందాన్ని ఇవ్వటానికి వర్ణనలు ఎంతో అవసరమని తెలియజేస్తుంది. వర్ణన ఆవశ్యకతను మరింతగా కింది విధంగా తెలుసుకోవచ్చు.

*"కావ్యములో మొత్తము వస్తువును కథాంశమనియు, వర్ణనాంశమనియు రెండు భాగములుగా విభజింపనగును వర్ణనాంశము కథాంశమును చక్కని వాతావరణమును కల్పించును. వర్ణనలు కథను గ్రహించుటకు పాఠకుని హృదయమును సమాయత్తపరిచి, కథపై పాఠకునకు ప్రరోచనము కలిగించును. రసపోషణ విషయమున వర్ణనలకు ప్రాధాన్యము కలదు. కథాంశ జీవాతువు లైన పాత్రములు ఆలంబన విభావములుగా వర్ణ నాంశము ఉద్దీపన విభావముగా పరిగణింపవచ్చును. వర్ణనలు రసానుభవమునకు ఉద్దీపకములై దోహద మొనర్పవలెను. వర్ణనాంశము కథాంశమునకు పరిపోషకముగానుండి కథాంశము రక్తికట్టవలెను నాట్యమునకు గీతము వలెను, గానమునకు వాద్యముల వలెను కథకు వర్ణనలు హంగుగా నుండును. అందువలన నీరెండింటికిని పొత్తు కుదర్పవలెను. తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాదమును జేయరాదు. ఈ వర్ణనలు కథాగతిలో నతికి పరిమితములను సభ్యములను కావలెను మితిమీరిన వర్ణన లొనర్చినను, పొత్తు కుదరని వర్ణనలొనర్చినను పాఠకుని రసానుభూతికి వ్యాఘాతకము కలుగును"*[48] అని డా.కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రి గారు 'వర్ణన'ను వివరించారు. కావ్యాల్లో వర్ణన ఎందుకు ఉండాలో, ఎలా ఉండాలో ఎంతో వివరంగా విశదీకరించడమైంది. ఇక కావ్యలో ఏయే వర్ణనలు ఉండాలనే విషయంలో ఆలంకారికులు భిన్నాభిప్రాయాలను వ్యక్తీకరించారు[49]. మొత్తం మీద అష్టాదశ

వర్ణల్లో కొంచెం అటూ ఇటుగా ఎలా ఉన్నా, ప్రధానంగా కొన్ని వర్ణనలు మాత్రం ఖచ్చితంగా పేర్కొన్నారు. అవి నగర, ఋతు, సూర్యోదయ, చంద్రోదయ, నాయికా, నాయకుల వర్ణన, పుత్రోదయ వర్ణనలు మొదలైనవి. ఆమ్రపాలి కావ్యంలో ఈ వర్ణనలు ఎంతవరకూ ఉన్నాయో, కావ్యానికి అవి ఎలా ఉపకరించాయో పరిశీలించేముందు ఈ వర్ణనలను సులభంగా గుర్తించటానికి వీలుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతగారు చేసిన విభజన మరింత తోడ్పడుతుంది.

***"కావ్యంలో వర్ణనలు వస్తువర్ణన మనియు, రూపచిత్రణమనియు, భావచిత్రణమనియు మూడు విధములు. రమణీయములైన సూర్యచంద్రోదయాది ప్రకృతి దృశ్యములను, పాత్రలు వర్ణించు రంగస్థలాది సన్నివేశములను వస్తువర్ణనలగును. మరి ఆ రంగమున ప్రవేశించు పాత్రల రూపు రేఖలను రూప చిత్రణమనియు, వారి మనోభావములను వర్ణించుట భావ చిత్రణమనియు*** నిరూపించారు[50] ఆమ్రపాలి కావ్యంలో పై మూడు విధాలుగానూ కావ్యవర్ణన జరిగింది. కానీ, భావ చిత్రణ అనటం కంటే మనస్తత్వ చిత్రణ కావ్యంలో జరిగింది. ఆధునిక సాహిత్య సిద్ధాంతాల ద్వారా భావచిత్రం వేరని స్పష్టమైంది.[51]

## 4.1.1. పురవర్ణన

కవి, వైశాలినీ, మగధ రాజ్యాలను రెండింటినీ వర్ణించినప్పటికీ, మగధరాజ్యాన్ని, ఆరాజు గొప్పతనాన్నీ, ప్రజల సుఖ సంతోషాలను గురించే ఎక్కువగా వర్ణించారు. వైశాలినీ నగరంలో లిచ్ఛవుల మూర్ఖత్వం వల్ల గూఢచారి వ్యవస్థగాని, సరిహద్దు భద్రతలు గాని సరిగ్గా లేవు. శత్రురాజు అయినప్పటికీ బింబిసారుడు, అతని సైనికుడు మారువేషాల్లో వచ్చి నగరమంతా విహరించగలిగారు. నగరంలో గొప్ప గొప్ప భవనాలు ఉన్నాయి. **"కట్టింపవలయు చక్కని ప్రదేశమునందు తనరాన నాకు నద్దాల మేడ"** (2-47) అని ఆమ్రపాలి సభలో నిబంధన విధి ంచటమే ఆ విషయం స్పష్టం చేస్తుంది. ఆమ్రపాలికి నిర్మించిన భవనం గోడలమీద **'శృంగారమ్ము కైపెక్కు మోహన రూపాంచిత చిత్రాలు** (4-3) **శౌర్యధుర్యులౌమేటుల వర్తకోత్తముల మేలిమి చిత్రాలు'** (4-4) ఉన్నాయి. ఇంకా ఆ గోడల మీద ఎటువంటి చిత్రాలు, శిల్పాలను అమర్చేనారో కింది పద్యం వల్ల స్పష్టమవుతుంది.

*"ఎవరిదో యీ చిత్తరువు జూడ ముచ్చటౌ*
*మగధ రాజేంద్రుని దగును గాక*
*ఈ పటంబెవరిదో యెంతో ప్రసన్న రూ*
*పము గానఁబడు శాక్య ప్రభువు నిజము*

*ఎవరిదో యీ బొమ్మ హేమ కుడ్యమ్ముపై*
*లిఖియింపబడె నాట్యసఖి మయూరె!*
*ఈ చిత్రమెవరిదో ప్రాచీన భారత*
*సంస్కృతిక ప్రశస్త ప్రతీక*

*అనుచుఁదలఁచినారా లాత్మల శిల్పిది*
*గ్గజములు తమ చేయు కల్పనలకు*
*కేవలముగ దివ్య కిమ్మీరముల నాప్ర*
*పాలి మెచ్చుఁజేయఁజాలినారు*''(4-6) ఇంకా, మగధ రాజ్యాన్ని కవి చాలా పద్యాల్లో వర్ణించారు. లిచ్ఛవుల చెడ్డగుణాల వల్ల వైశాలిని నగరంలో ఎంత వైభవం ఉన్నా ఆ నగరాన్ని మెచ్చుకోకుండా, శత్రురాజ్యమైనప్పటికీ వైశాలిని ప్రజలు, మగధ రాజ్యాన్ని, రాజుని ప్రశసించారు.

''*కూడు గుడ్డలకు పాడిపంటలకును*
*కొదవలేక సుకము కొఱత లేక*
*జీవితాలు హాయిగా వెళ్లబుత్తురు*
*నగవులొలుక మొగము మగధజనులకు*'' (4-31). అందుచేతనే శత్రురాజు అయినప్పటికీ బింబిసారుడిలో గల సుగుణాలకు మెచ్చి ఆమ్రపాలి పూర్వజన్మ బంధంగా అతన్ని ప్రేమించింది.

## 4.1.2. బింబిసారుడు వైశాలీనీ నగర ప్రవేశ వర్ణన

లిచ్ఛవుల పట్ల ఏనాడూ స్పందించని ప్రకృతి, మగధ రాజు బింబిసారుడు, వైశాలినీ నగరంలో ఉన్న ఆమ్రపాలిని ప్రేమించి, ఆమె దగ్గరకు వచ్చేటప్పుడు పులకరించింది.

''*మగధనాథుని తెగువను గమనించి*
*యుడుమార్గమున మొగుల్ గొడుగువట్టె*
*హార్యాంక విభు ప్రేమాయానమ్ము వీక్షించి*
*వాయుపోతము పహారా యొనర్చె*
*బింబిసారావనీ ప్రియుని రాకడఁగాంచి*
*పరభృతమ్ములు పాట ఆపడ సాగె*
*నిశ్రేయ గుణుఁడు శ్రేణికుని జాతరఁ జూచి*
*పూల బాలలు సుగంధాలు సల్లె*

*వరుసనకు బేధములు కల్గు ప్రకృతి కాంత*
*మహిత మంగళ ప్రదముగా మాఱిపోయె*
*ధరణి విభునకు మధ్యే పథమ్మునందు*
*వేనవేల్ శుభ శకునాలు గానుపించె''* (5-21). మంచి వారికి ఏ ప్రదేశమైనా అనుకూలంగా మారుతుందన్నట్లు వైశాలినీ నగరంలో బింబిసారునికి ప్రకృతి స్వాగతం పలికింది. అంతేకాక 'వేనవేల్ శుభశకునాలు గానుపించె' అనటంతో లిచ్ఛవుల రాజ్యంలో బింబిసారుని ఏ ఆటంకాలు కలగవనీథ, ఆమ్రపాలిని కలుసుకోవటం జయప్రదమౌతుందని జరగబోయే కథాసూచనవల్ల వర్ణనకు సార్థకత చేకూరింది. ఈ వర్ణన చదివేటపుడు మనకి ఆంధ్రమహాభారతం లో శకుంతల దగ్గరకు వెళుతున్న దుష్యతుడికి పలికిన స్వాగత పద్యం గుర్తుకి వస్తుంది.[52]

*''అతిరుచిరాగతుండయిన యాతనికిన్ హృదయ ప్రమోద మా*
*తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలావ వ*
*ర్జిత కుసుమాక్షతావళులు సేసలు పెట్టిన యట్టిరైరి నం*
*వద దళనీ నినాద మృదు భాషల దీవన లొప్పనిచ్చుచున్''* (1-4-17).

## 4.1.3. బుద్ధుని పునరాగమన వర్ణన

తపస్సు చేసి జ్ఞానియైన అనంతరం బుద్ధుడు తన జ్ఞానామృతాన్ని పంచిపెడుతూ వైశాలినీ నగరానికి వస్తాడు. ఇంతకు ముందు చూసిన గౌతముడునే 'బుద్ధడు' గా మారిన తరువాత భగవంతునిగా నగర ప్రజలు భావించిన వ్యత్యాసం చక్కగా వర్ణించారు. బుద్ధుడిని చూడాలని ప్రజలు ఇసుక రాలనంతగా పోటీపడుతుంటారు. ఆ సమయంలో పల్లెల, పట్టణాలలో ఉన్న ప్రజలు బుద్ధడిని ఎలా భావించుకున్నారో కింది పద్యంలో దృశ్యచిత్రీకరణ చేశారు కవి.

''మఱచిపోయిన నిధి తిరిగి యేనాటికో
 అరుసమ్ము గలిగింప దొరికినట్లు
బహు కాలమునకు నాపద్బాంధవుండైన
 ప్రియ వివాహితుండు కాన్పించినట్లు
వివరింప లేని దీవెనల నందితి మన్న
 హృదయాల నేదియో యేలినట్లు
వెలుగు లీనిన దీపకలిక యెన్నాళ్లకో
 వైశాలినికిఁ జేరవచ్చినట్లు

శాంతమూర్తి బౌద్ధశ్రమణుని రాకడ
అంతరాళ ప్రజల కటులఁదోఁచె
వెనుక తానొకప్డు విడిదిచేసినచోట
విడిది చేసె గౌతముఁడు ముదాన ''(6-8)నగరంలోని ప్రజల అభి మతాలను కవి వర్ణించిన తీరు ప్రశంసనీయంగా ఉంది.

## 4.1.4. సూర్యాస్తమయ వర్ణన

ఆమ్రపాలి కావ్యమే ఈ వర్ణనతో ప్రారంభమవుతుంది.

*''ఆలమున వైరసేనఁ జెండాడి రక్త*
*సిక్త దేహుఁడై శ్రాంతి వాంఛి ంచినట్టి*
*రౌద్రయోధుని భంగి నస్తాద్రి శిఖరి*
*పైన కానిపించెను లోకబాంధవుండు''*(1-1).

*''సన్న సన్నగనుకాష్ఠాపురంధ్రీని దాకి*
*మలయ సమీరమ్ము మసలువేళ*
*సంతోషముబుక శకుంత సంతానమ్ము*
*చెలరేగి గూండ్లకుఁజేరువేళ*
*బంధి తంబైనట్టి యంధకారము*
*జగతి యాహ్వానమ్ము సలుపువేళ*
*ధృతి మీఱ నల నిశాపతికి దివాస్వామి*
*క్షితిపాలనము నప్పగించువేళ*

*పొలమునుండి హాలిక కులమెల్ల తమయింట*
*పట్టులకును జేరవచ్చువేళ*
*శాక్యధనికుడనెడు సార్థక నాముండు*
*వనవిహారమునకు బయలుదేరె''(1-2)* మొదటి పద్యంలో శాంతరస ప్రధానమైన రాబోతుందనే కథాసూచన కన్పిస్తుంది. తూర్పున ఉదయించి, పశ్చిమదిశలో అస్తమించటంలో సూర్యుని ప్రకృతి ధర్మం. సూర్యుడు శత్రుసేనలను చీల్చిచెండాడి రక్తసిక్తమైన దేహంతో విశ్రాంతి కోరుకొంటున్న వీరుడిలా కన్పిస్తున్నాడట! వీరుడై కూడా శాంతి కోరుకుంటున్నాడు. అస్తమయసమయంలో సూర్యుడు రక్తసిక్తమైన దేహంతో ఉన్నట్లే కనిపిస్తాడు. బుద్ధుడు ధరించబోయే కాషాయ దుస్తులను రక్తసిక్త దేహుడై అనటం సూచిస్తున్నట్లుంది. కోరికలనే శత్రు సేనలతో యుద్ధంచేసిన బుద్ధుడు మోక్షమార్గాన్వేషిగా మారబోతున్నాడనేది, మానవుని చివరి గమ్యం ఆధ్యాత్మికమేననేది ఈ వర్ణన ద్వారా తెలియజేస్తున్నారు కవి.

రెండవదైన సీసపద్యంలో శాక్యధనికుడు వనవిహారానికి బయలుదేరిన సమయమెటువంటిదో వర్ణించారు కవి. సంతోషంతో పక్షుల పిల్లలన్నీ గూళ్లలోకి చేరుకుంటున్నాయి. పొలంనుండి రైతులు తమ ఇళ్ళకు చేరుకుంటున్నారు. అపుడే చీకటి పడుతున్నది. ఎవరి గమ్యాలకు వాళ్లు చేరిపోతుంటే ఆమ్రవనంలో ఏదిక్కూలేని పసిపిల్ల ఎక్కడికి పోతుంది? పూర్తిగా వెలుతురు పోలేదు - పూర్తిగా చీకటీరాలేదు. అంధకారానికి ఆహ్వానం పలుకుతున్న వేళలో గణనాయకుడైన మహానాముడు (శాక్యధనికుడు)కి దొరికింది. కానీ పూర్వ జన్మ శాపం వల్ల ఆమె జీవితంకూడా కొంత వెలుగు, మరికొంత చీకటిగానే కొనసాగింది.

కావ్యంలో మరొక చోట కూడా సూర్యాస్తమయ వర్ణన ఉంది (3-3). ఆమ్రపాలి గణభోగ్యగా మారిన తరువాత మానసికంగా సంఘర్షణకు లోనవుతుంది. అన్ని రకాల సౌకర్యాలు ఉన్నప్పటికీ ఆమెకు ఏదో అంసతృప్తి వెంటాడి, శాంతి లేకుండా పోతుంది. అప్పుడు గతంలో ఆమె దొరికిన ఆమ్రవనంలోకి వెళుతుంది.

*''పరువిడి తప్పక పశ్చిమాకాశాన*
*అరుణ మయూఖముల్ తలుగు వేళ*
*వైరి నెదుర్ప ప్రాభవముల సొలమి జంకి*
*శతపత్ర సుందరి బ్రతుకువేళ*
*హోరెత్తబోరన యూరికి దూరాన*
*శివసంఘములు గోల సేయువేళ*
*రగడలో రభసలో తగులాటమును బడ్డ*
*సృష్టి విశ్రాంతి నాశించువేళ*

*ఉకలెత్త క్రొత్త యూహోర్మిమాలలు*
*హృదయసాగరమున కదలువేళ*
*తన రసాలసాల వనవాటి కేకాంత*

మై *దిగులున వెడలె నామ్రపాలి* ''(3-3) ఆమ్రపాలి సూర్యాస్తమయ సమయంలో శాక్యధనికునికి దొరకటం, సూర్యాస్తమయ సమయంలోనే తొలిసారిగా సిద్ధార్థుని దర్శనాన్ని చేసుకోవటం వల్ల సూర్యాస్తమయవర్ణనకు ప్రాధాన్యత చేకూరి, అది ఒక విడదీయరాని బంధంగా ఏర్పడింది. 'ఉరకలెత్తక్రొత్త యూహోర్మిమాలలు హృదయ సాగరమున కదులువేళ' లో బుద్ధుడిని చూచి ఎవరో ముని అనుకొంటుంది (3-10). అతని దగ్గరకు వెళ్లి చూచేటప్పటికి చీకటి పడింది. ఆమెలోనున్న కోరికలు పూర్తిగా పోగొట్టుకోకుండానే వెళ్లింది. అందుకే అతడిని

పొందాలనే ఊహాప్రపంచంలో ఉన్నట్లు తరువాత పద్యాల్లో వర్ణించారు (3-12). బుద్ధుని దర్శనం జరిగినా నిరాశే ఎదురవ్వడానికి అన్నట్లు రగడలో రభసలో తగులాటమును బడ్డ సృష్టి, విశ్రాంతి నాశించు వేళ గా ఆ సూర్యాస్తమయాన్ని వర్ణించారు కవి.

## 4.1.5. చంద్రోదయ వర్ణన

*''ఎదియో మానసి చాయ కన్పడగ తద్దృశ్యంబు నీక్షింపగా*
*బదములే ముందునాకామెవైచినది శుభ్రజ్యోత్స్న లాకాశమం*
*దుదయించె సహకార పత్రముల యుద్యోగమ్ము చంద్రప్రభా*
*భ్యుదయశ్రీలకు నడ్డమై నిలువఁగా బొల్పారె క్రీనీడలున్''* (3-6)

సిద్ధార్థుడు చెట్టు కింద కూర్చొని తపస్సు చేసుకొంటున్నాడు. అపుడే చీకటి పడింది. ఆకాశంలో చంద్రుడు ఉదయించాడు. చక్కని వెన్నెల కాస్తున్నది. అయినప్పటికీ పైనుండి ఆ కిరణాలు కిందికి పడకుండా మామిడి ఆకులు అడ్డుగా ఉండటం చేత క్రీ నీడలు ఏర్పడ్డాయి. ఆ సమయంలో దగ్గరకు వచ్చిన ఆమ్రపాలి ఎవరో మానవ నీడగానే భావించుకొన్నదట! ఆమెకు స్పష్టముగా బుద్ధుడని తెలిసిపోతే ఆమె మానసిక స్థితి సంపూర్ణంగా వ్యక్తం కాలేక పోయి వుండేది. క్రీనీడలు వచ్చేసాయి కాబట్టే, అసలు స్థితి బయటపడింది. ఒకవేళ బుద్ధునిగానే ఆ దర్శనం జరిగినా అది అభ్యుదయ పథంలో కొనసాగదనే దాన్ని ముందుగానే 'అభ్యుదయ శ్రీలకు నడ్డమై నిలువగా...' అని సూచిస్తున్నారు కవి. తరువాత కథలో కూడా బుద్ధడిని తన గృహానికి ఆహ్వానించినా ఆమ్రపాలితో మరోసారి వస్తానని బుద్ధుడు చెప్పటం దీన్ని ఋజువు చేస్తుంది.

## 4.1.6. స్వయంవర వర్ణన

కావ్యంలో 'స్వయంవరణము' అనే శీర్షికతోనే ఒక ఆశ్వాసాన్ని రచించారు. ఆమ్రపాలి వివాహమే పెద్ద వివాదం. దానికి స్వయంవరసభ వేదిక. ఆమె అందాన్ని పొందాలని గుటకలు మ్రింగేవారు, గుండెల్లో దిగాలుపడ్డ సంకటమతులు, తమకే ఆమె చెందుతుందనుకొనే అహంభావులు ఎందరితోనో నిండిన స్వయం వర సభను ప్రారంభించిన శౌక్యధనికుడు సభలో పాటించే అన్ని నియమాలను పాటిస్తాడు. వచ్చిన వారికి స్వాగతం చెప్పటం లిచ్ఛవులు, దేశదేశాల రాకుమారులు రావటం వల్ల కలిగిన ఆనందాన్ని వ్యక్తం చేయటం, కుమార్తె అందచందాలను, గుణశీలాన్ని పంచరత్నాలవంటి అయిదు పద్యాల్లో వర్ణించటం, సభకి వచ్చిన వారిలో ఎవరో ఒకరిని వరిస్తుందని స్వయంవర సభ లక్ష్యాన్ని ప్రకటించటం(2-7) చేస్తాడు. ఒక్కనికే ఆమ్రపాలి దక్కటానికి ఇష్టపడని లిచ్ఛవులు వ్యతిరేకించటం, తండ్రిగా,

చక్రవర్తిగా తన శక్తి యుక్తులను శాక్యధనికుడు ప్రదర్శించటం చేస్తాడు. చివరికి స్వయంగా ఆమ్రపాలియే పరిస్థితులను బట్టి, దేశక్షేమాన్ని ఆలోచించి గణభోగ్యగా ప్రకటించటం జరుగుతుంది. స్వయంవరసభ నాటకీయ సన్నివేశాలతో వర్ణింపబడి రసవంతమైంది. కావ్యంలో స్వయంవర వర్ణనే ఎక్కువగా పాఠకుల మనఃఫలకాలపై చిరకాలంగా ముద్రించే లాగున చిత్రించారు కవి.

## 4.1.7. ప్రణయవర్ణన

ఆమ్రపాలి గణభోగ్యగా మారినా, ఆమె మనసు అంతా బింబిసారుకే అర్పించింది. ఇద్దరూ ఒకరొనొకరు గాఢంగా ప్రేమించుకున్నారు. ఆ ప్రేమలో భేదాలున్నాయి. ఆమ్రపాలి ప్రేమ స్వచ్ఛమైంది. అతనిలోని మంచితనాన్ని, శౌర్య,ధైర్యాలను, పరిపాలనాదక్షత వంటి మొదలైన వాటి పట్ల ఆమె ఆకర్షితురాలైంది. పూర్వజన్మబంధం వల్ల ఆ ప్రేమ మరింత రెట్టింపు అయ్యింది. ఆమెలోని సౌందర్యం, కళాప్రావీణ్యతలను మెచ్చి ఆమెను అనుభవించాలని అతను ప్రేమించాడు. అదీ ఒక రకమైన ప్రేమే. ఇరువురిమధ్యా గల ఈ అనురాగమే ఆరురోజులపాటు ఆమెభవనంలో ప్రణయకేళిని కొనసాగేలా చేసింది. ఆ ప్రణయం ఎటువంటిదో వర్ణించారు కవి.

*''క్షణము పోనీక వెచ్చని గుండియల ఝషాం*
*కుని కేలికారంగమున జరించి*
*వసుధతో పనియేమి ప్రణయాంబునిధి తరం*
*గాల భంగిమలలోఁదేలియాడి*
*కలిసికొన్నట్టి యీ ఘడియ వచ్చునో? లేదో?*
*యని నువ్వు దొంతరలయందు మునిగి*
*పరవశించిన రసభావాల మత్తులో*
*సర్వసౌఖ్యమ్ములచవిసి జూసి*

*మధుర మధుర మంజు మంజుల గాఢాను*
*రాగబంధ ప్రణయ భోగమందు*
*మునిఁగి తేలి తేలి మునిఁగిరి యామ్రపా*
*లియును బింబిసార పృథి వి పతియు''* (5-24)

## 4.1.8. పుత్రోదయ వర్ణన

సంతానం లేకపోతే పుట్టగతులు ఉండవనేది మనవారి ఒక విశ్వాసం. ప్రతి తల్లి సంతానం కోసం ఎంతో తపిస్తుంది. ప్రపంచంలో ఎక్కడికైనా తల్లి హృదయం

ఒకలాగానే ఉంటుంది. మాతృప్రేమకు ధనం, కులం, మతం ఇవేమీ అడ్డుతగలవు. పేద, పెద్ద భేదంలేకుండా, సామాన్య స్త్రీ అయినా, వేశ్య అయినా మాతృహృదయానికి ఎప్పుడూ అత్యున్నత స్థానమే ఉంటుంది. ఆమెకు పుట్టిన శిశువుని చూచి పొందే ఆనందాన్నిమించి ఈ లోకంలో తల్లికి మరొకటి ఉండదంటే అతియోశక్తికాదు. ఆమ్రపాలి గణభోగ్య కానప్పటికీ సంతానం కోసం ఎంతో ఆరాటపడింది. ఎప్పుడూ దుర్మార్గులైన లిచ్ఛవుల గురించే మనసులో వ్యధచెందే ఆమెకి పుత్రుడు జన్మించాడని తెలిసి ఎంతో సంతోషించింది.

*''ఈనాడు నాపుణ్య కృత్యాలు ఫ లియించి*
*పున్నామ నరకమ్ముపోయెఁగాదె*
*ఈనాడు నాదు పూజానయోత్సవములు*
*చల్లఁగా నను నొక తల్లిఁజేసె*

*ఈనాడు నామ్రొక్కులీతీరుగాఁ బండి*
*గర్భమ్ము ఫలియింపఁగలుగఁజాలె*
*ఈనాడు నా కోర్కెలెల్ల భాసిల్లగా*
*ఘన తేజుఁడైన నందనుని గంటి*
*నన్నుఁగన్న యట్టి నా తల్లిదండ్రుల*
*ఆసలన్ని నేఁడుమోసులెత్తఁ*
*బూన దొడ్డ తరుణమీనాడు గద! యని*
*హర్ష జలధి ఁదేలె నామ్రపాలి''(5-36).*

## 4.1.9. వర్ష ఋతు వర్ణన

కావ్యంలో ఋతువర్ణన చేయటం కావ్య సంప్రదాయం. ఆ వర్ణన కథాంశానికి, తీసుకొన్న సన్నివేశానికి అనుగుణంగా మార్చగలిగినట్లయితే కావ్యం రమణీయంగా ఉంటుంది. బుద్ధుడు జ్ఞానియైన తరువాత వైశాలినీ నగరానికి రాబోయేముందు ప్రకృతిని వర్ణించిన పద్యమిది.

*''గ్రీష్మతీక్ష్ణ మహోద్రేకమ్ము చల్లార*
*భేకసంతతి గొంతు విప్పునప్పుడు*
*సాంద్ర పయోధర జాలమ్ము ఘనరోద*
*సీ వీథి నాట్యమ్ము సేయునపుడు*
*నలగి కలంగి బీటలు దేరి స్రుక్కిన*
*భూదేవి హృదయ ముప్పొంగునపుడు*

*ధారాపరంపర నై ఋతి పవనమ్ము*
*పెడసరియై లీవఁదొడఁగినపుడు*

*నీలిగగనాన మేలి శంపాల తాంగి*
*మెఱుపు నగవులు కురిపించి మెఱయునపుడు*
*పృథి వి జనులు గుబ్బగొడుగు లెత్తినపుడు*
*చినుకు దొరసాని భువికి వేంచేసెనపుడు''* (6-1) బుద్ధుడు వైశాలినీ నగరంలో అడుగు పెట్టకముందు ఎండలు మండి పోతున్నాయి. అవి నగరంలో ప్రజలకు లిచ్ఛవుల పట్ల ఉన్న నిరాశా నిస్పృ హలుగా చెప్పుకోవచ్చు. ఆ నిరాశా నిస్పృహలు ప్రారంభం కావటంతో ఒక్కసారిగా తొలగిపోతున్నాయనే సూచన చేస్తూ వర్ష ఋతువర్ణన చేశారు. వర్షాకాలం ప్రారంభంకాగానే కప్పలు బెకబెకమని ఆనందంతో కేరితంలు కొట్టడం, జనం గొడుగులు వేసుకోవటం, వర్షాకాల వాతావరణాన్ని కళ్ల ఎదుట నిలుపుతుంది. బీటలు దేరి స్రుక్కిన భూదేవి హృదయముప్పొంగినట్లు చేసిన ఊహ ఎంతో ఔచిత్యంతో ఉంది. భూమిని తల్లిగా భావిస్తుంటారు. తన పుత్రుడు గొప్పవాడై పదిమంది చేత ప్రశంసిస్తున్నట్లయితే తల్లి హృదయమెంతో ఉప్పొంగిపోతుంది. అలాగే భూమికూడా ఆనందంగా ఉప్పొంగిందని చెప్పవచ్చు. బుద్ధుడు నగరంలో అడుగు పెట్టడంతో ఎండిన భూమినవ్వువెలయించెను. 'గండర గండఁడైన మార్తాండుఁడు తీవ్ర జ్వాలన ధాముఁడు శాంతమూర్తియై' య్యాడు (6-2). ఆ తరువాత మరోమంచి పద్యం నగర భౌగోళిక వాతావరణ పరిస్థితిలో కలిగిన మార్పుని తెలియ జేస్తున్నది.

*''కృశియించి మఱియు నిట్టింకులు దేరిన*
*ఈ తటాకం బెంతయో తనించె*
*తమ పుష్టి జీవన ప్రమదమ్ము కోసమ్ము*
*వాగువంకలు బరాబరులు సలిపె*
*వడలుపోవుచున్న ప్రాణాలు నిలువఁగా*
*కిసలయ ప్రతతి కేకిసలు గొట్టె*
*వడగాడ్పు వలన దెబ్బతినిన జీవాళి*
*చీకు చింతలు వీడిసేదతీరె*
*ఉఱుము మెఱుము పిడుగులుద్దండ భయదమై*
*సృష్టిపై పచారు సేయునపుడు*
*చాలాకాలమునకు శ్రావస్తిపురమున*
*చరణమూనె బోధి సత్త్వు డంత''*(6-5)

## 4.2.0. రూపచిత్రణ

కావ్యాల్లో వివిధ పాత్రల రూపురేఖలను వర్ణించటం వల్ల పాఠకుల మనసులలో ఒక రూపం ముద్రింపడుతుంది. మొదటినుండి చివరివరకూ ఆ రూపమే మనసుల్లో నిలుపుకుంటారు పాఠకులు. పాత్రల్లో ఉండే శారీరక సౌందర్యం, అవయవ నిర్మాణం, అలంకరణలు మొదలైన భౌతిక నిర్మాణానికి చేసిన వర్ణన రూపచిత్రణగా చెప్పవచ్చును. దీని వల్ల పాఠకులే అద్భుతమైన రూపాన్ని చిత్రించుకో గలుగుతారు.

గిరిజాలజాట్టు, తపోధ్యానం, నిర్మలమైన ముఖం, మహాతేజస్సు, చెట్టుకింద కూర్చోవటం వంటి పదాలతో వర్ణించటం వల్ల (3-9) బుద్ధుని రూపానికి అక్షరాకృతి ఏర్పడింది. నీలిమేఘాల ఘర్షణవల్ల భూమికి చేరిన మెరుపు తీగవలె, పండువెన్నెల నుండి రాలిన రేకవలె, 'దేవకాంతవలె నందనమ్మును వీడి నరజాతి సృష్టిలో నివ్వటిల్లిన పువ్వు వోలె' (2-32), వయసుకు తోడు అవయవ సౌందర్యం వికసించిందని (1-14), వర్ణించటం వల్ల ఆమ్రపాలి రూపం అందమంతా ఒకేచోట కూడగట్టిన సౌందర్యరాశి అని తెలుపుతుంది.

భుజబలశాలి, పురుషసింహుడు, ముగ్ధమోహనుడు, రసజ్ఞప్రభువు (4-28) అని వర్ణించటం వల్ల బింబిసారుని రూపాన్ని ఊహించుకోవచ్చు. బింబిసారుడే మరోసారి తన గర్భంనుండి పుట్టినట్లు ఉన్నాడని విమలకొండ రూపాన్ని చూచి ఆనందపడుతుంది. తగినంత వర్ణననే ఉపయోగించి రూచిత్రణను స్పష్టం చేయటం కవి ప్రతిభకు తార్కాణమై నిలుస్తుంది.

## 4.3.0. మనస్తత్వ చిత్రణ

ఇది వివిధ పాత్రలు సన్నివేశానికి తగిన తత్వంతో ఎలా ప్రవర్తించాయో తెలియజేస్తుంది. కవి అనుభూతి కూడా ఇందులో నిబిడీకృతమై ఉండటానికి అవకాశం ఉంది. 'పాత్రచిత్రణ' అధ్యాయంలో ఆయా పాత్రలను పరిచయం చేసేటపుడు వారి మనస్తత్వ చిత్రణను ప్రత్యేకించి పరిశీలించటం జరిగింది. పాత్ర పొందిన మానసిక స్థితి దీనివల్ల వ్యక్తమవుతుంది. శాక్యధనికుడు పిల్లలు లేనపుడు ఎన్ని ఉన్నప్పటికీ ఆనందం చెందలేదు. పైగా 'లోలోన ఏదో విచారకర ముద్రా భారమున్ గ్రుంగిపోయాడు' (1-3). ఆమ్రవనం నందు ఒకపసిపిల్ల దొరకటంలో 'నాపుణ్యమ్ము ఫలించె నేడని మహానాముండు సంతోషకేళీ పాథోధి తరంగ భంగములఁదేలుతాడు' (1-11). ఆమ్రపాలికి యుక్తవయసు రావటంతో లిచ్ఛవుల కామానికి బలి కావలసి వస్తుందేమోనని 'యథార్థము పైకింతయుఁజెప్పలేక తన

స్వాంతంబందు గాటంపు దుఃఖము పెల్లుబ్బగ నెత్తికొట్టుకొని యాకాశమ్ము నీక్షించేవాడు' (1-22). ఎలాగైనా తనకూతురికి పెళ్లి చేయాలనుకున్నాడు. ఆమె గొప్పతనాన్ని, విశిష్టతను స్వయంవర సభలో ప్రకటించిన తీరులో తండ్రి హృదయం ప్రస్ఫుటమౌతుంది. స్వయంవరసభలో శాక్యధనికుడు ఒక తండ్రిగా, చక్రవర్తిగా పొందిన మానసిక వ్యధను చాలా ప్రతిభతో వర్ణించారు కవి. అంతేకాక సభలో తండ్రి పడుతున్న మానసిక ఆవేదనకు ఆమ్రపాలి స్పందించినప్పటి మానసికస్థితికీ, తరువాత గల వ్యత్యాసాన్ని సందర్భోచితంగా వర్ణించారు. గణభోగ్య జీవితాన్ని అనుభవిస్తున్న ఆమ్రపాలి పొందిన మానసిక పరిస్థితిని వర్ణిస్తూ... 'ఎదియో చెప్పరాని యిది యది అనరాని, భావ ఘూర్ణమున పరితపించి' నదట (3-1). ఆమ్రవనానికి వెళ్లినప్పటికి ఉన్న మానసిక స్థితి 'ఈ ప్రపంచమే హేయమని తలచిన' స్థితి ఆవనంలో తపస్సు చేస్తున్న బుద్ధుడిని మునిగా భావించి 'ఈ శాక్యధనిసుతకెవ్వరీడేలేరు భువిలోనని వీనిఁ బొందవలయునని ఊహా ప్రపంచంలో విహరించిన పరిస్థితి. ఆమె మానసిక ప్రవర్తన మూడు దశల్లో సాగినట్లు పరిశీలన వల్ల విశ్లేషించవచ్చు. విసుగు చెందిన జీవితం పట్ల విరక్తి, అవకాశం కలిగితే తనలో నిబిడీకృతంగా దాగిన తీరనివాంఛను తీర్చుకోవాలనే ఆశ, వాస్తవాన్ని తెలిసికొన్నప్పటికీ మనసు కుదుటపడిన స్థితి. చతుర్థాశ్వాసం (చింతనము)లో కూడా ఆమె మానసిక స్థితిని బాగా పట్టుకోగలిగారు కవి.

*''అల్లారుముద్దుగా నవనిఁ బెంచిన యట్టి*
*తలిదండ్రుల నెడందఁ దలచి తలఁచి*
*చిననాటినుండియు తనతోఁజరించు నె*
*చ్చెలుల శ్లేషోక్తికిఁ గులికి కులికి*
*తన విద్దియులకు కారణభూతులగు గురున్*
*బత్తి నిండఁగ చేతులెత్తి యెత్తి*
*వయసుతో పాటుగఁ బయనించు కొర్కెలు*
*పూడ్చఁగాఁబడెనంచు నేడ్చి యేడ్చి*

*గుండె వగులునట్లు కుమిలి కుమిలిపోయి*
*చెప్పరాని వెతల కుప్పలోన*
*కూలఁబడిన యామ్రపాలి నెవ్వారలు*
*ప్రేమతోడ నాదరింతు రొక్కొ?''* (4-18) పాత్రల మనస్తత్వ చిత్రణను వర్ణించిన విధానాన్ని పరిశీలించి, విశ్లేషించినట్లయితే సంతోషం కలిగినపుడు ఆనందించటం, దుఃఖం కలిగినపుడు బాధపడటమనే మనస్తత్వం సర్వసాధారణంగా

కన్పిస్తుంది. మానవ స్వభావామే అది. మానసిక చిత్రణను మరింత విపులంగా 'పాత్ర చిత్రణ' లో ప్రత్యేకించి ప్రతిపాత్రనీ విశ్లేషణ చేయటం జరిగింది.

## 4.4.0. అలంకారాలు

'ఆమ్రపాలి' కావ్యంలో కవి ఎన్నుకొన్న అలంకారాలు కావ్యానికి శోభను చేకూర్చి, కావ్య పరమార్థాన్ని వ్యక్తం చేయటంలో తోడ్పడే విధంగా వర్ణించారు.

## 4.4.1. ఉపమాలంకారం

*''అలమున వైరిసేనఁ జెండాడి రక్త*
*సిక్త దేహుఁడై శ్రాంతి వాంఛించినట్టి*
*రౌద్రయోధుని భంగి నస్తాద్రి శిఖరి*
*పైన కానిపించెను లోక బాంధవుండు''* (1-1). సూర్యుణ్ణి యుద్ధ వీరునితోపోల్చి, అతడు శత్రుసేనలతో యుద్ధంచేసి విశ్రాంతి కోరుకొంటున్నాడనటంలో, బుద్ధుడు లౌకిక భోగాలపట్ల విరక్తి చెంది, తపస్సు చేసుకోవటమనే సూచన కూడా కన్పిస్తుంది. దీనితోపాటు ఆమ్రపాలి తన జీవితంలో శత్రువులైన వారిని అందరినీ ఎదుర్కొని, భౌద్ధ భిక్షువుగా పరివర్తన చెంది ప్రశాంతమైన జీవితాన్ని కోరుకుంది. కోరికలనే శత్రువులతో యుద్ధంచేసి వాటిని జయించినపుడు చివరి గమ్యం ఆధ్మాత్మిక జీవనమే. అది ఎంతో ప్రశాంతతను కలుగజేస్తుంది. కావ్య నాయకుడు రాజవంశానికి చెందిన సిద్ధార్థుడు, తపస్సు చేసిన అనంతరం బుద్ధుడుగా మారతాడు. ఇలా మారటానికి మధ్యలోగల కాలమంతా ఒక విధమైన యుద్ధమే. పోల్చబడిన ప్రకృత వస్తువు 'సూర్యుడు,' దేనితోపోలిక చెపుతున్నామో అప్రకృత వస్తువు 'యోధుడు' ఇద్దరూ ప్రసిద్ధులే. యుద్ధ పరిసమాప్తి అయ్యేనాటికి యోధుడూ, సాయంత్రానికి సూర్యుడూ విశ్రాంతి కోరుకోవటం సమాన ధర్మాలు. అందుకే ఈ పోలికను వర్ణించటానికి ఉపమాలంకారాన్ని ఎన్నుకున్నారు.

*''మొగ్గ విరిసిన చిన్నారి పువ్వువోలె*
*శాక్యధని హృదబ్జము వికాసము వహించె*
*దిన దిన ప్రవర్ధమానమై తేజరిల్లె*
*అసమ సౌందర్య గుణశీలి యామ్రపాలి''* (1-9) ఆమ్రపాలిని పువ్వుతో పోల్చి చెప్పటం గొప్ప ఔచిత్యాన్ని పాటించినట్లయ్యింది. మొగ్గవిరిసినపుడే, అందులోని పరిమళాలు వెదజల్లబడటంతో తుమ్మెదలు ఆకర్షించబడి మకరందాన్ని గ్రోలటానికి దాని చుట్టూ చేరతాయి. చిన్ననాటినుండీ తండ్రితోపాటు పూజాపురస్కారాల్లో పాల్గొనటానికి వెళ్లే ఆమ్రపాలి మొగ్గవిరిసిన చిన్నారి పువ్వువలె

తుమ్మెదల వంటి లిచ్ఛవుల ఆకర్షణకు గురైంది. ఒకేపువ్వు అయినప్పటికీ ఎన్నో తుమ్మెదలు, దానిచుట్టూ చేరినట్టే లిచ్ఛవులు కూడా ఆమె అందాన్ని పొందాలని ఆమెను గణభోగ్యగా కావాలనుకున్నారు. పువ్వు సౌకుమార్యానికి, ఆకర్షణకు సంకేతాలు గాను, స్త్రీ జీవితానికి ప్రతీకగాను కవులు ప్రయోగిస్తుంటారు. రెండు సమానా ధర్మాలు ఉన్న వాటిని ఎంపిక చేసుకొని దానికి తగిన అలంకారాన్ని ఎన్నుకోవటంలోనే కవి ప్రతిభ వెల్లడవుతుంది.

## 4.4.2. స్వభావోక్తి

*''పుట్టిన జీవి గిట్టునిది మూలము జీవన శాస్త్ర విద్యకున్*
*ఎట్టివానికైన నిలమృత్యువు దూరము గాదు జీవనము*
*న్నటిది నాశమై చనునటన్నది సత్యము గాన ధర్మవున్*
*ఘట్టము లీప్రపంచమునఁ గన్పడఁ గల్గినచో ముదంబగున్'' (3–29).*

పుట్టిన ప్రతి జీవి మరణించటమనేది సహజం. అది లోక స్వభావం. కనుకనే సహజంగా జరిగే జీవిత సత్యాన్ని స్వభావోక్తిలో చెప్పారు కవి. ఇంకా షష్ఠాశ్వాసము (ఆగమనము)లో వర్ష ఋతు వర్ణన చేస్తూ ఆకాశనుండి చినుకులు పడుతుంటే 'కప్పలు బెకబెకమనటం', 'జనం గుబ్బగొడుగులు వేసుకోవటం' కూడా స్వభావోక్తి అలంకారానికి ఉదాహరణ.

## 4.4.3. అతిశయోక్తి

ఆమ్రపాలి సౌందర్యానికి రంభ, ఊర్వశి, మేనకలే తలదించుకున్నారనేది 'ఆమ్రపాలి' అతిలోక సౌందర్యరాశి అనిచెప్పటానికే! ఆ విషయాన్ని అతిశయోక్తి అలంకారలో వర్ణించారు కవి.

*''ఆయుగమ్ములోన నామ్రపాలిని మించు*
*అందగత్తె మందుకైన లేదు*
*ఆమెయందమునకు నాముగ్గురమ్మలు*
*క్రించమైరి తలలు వంచుకొనిరి''* (6–30).

సౌందర్యంలో అప్సరసలు తలదన్నే విధంగా ఉందని, భూలోకంలో అంత అందగత్తెలేదని చెప్పటానికి అతిశయోక్తి అలంకార ప్రయోగమే ఉచితమని భావించారు. అంత సౌందర్యరాశి కనుకనే ఒక గణతంత్ర రాజ్యానికి అధ్యక్షుడైన శాక్యధనికుని కుమార్తెనే ఆ గణసభ్యులైన లిచ్ఛవులు గణభోగ్య కావాలని అన్నింటికీ తెగించి అడగగలిగారు.

డా॥జ్ఞానానందకవిగారు తీసుకొన్న అలంకారాలతో కావ్యేతివృత్తానికి, వర్ణనకీ మధ్య గొప్ప సమన్వయం కలిగించగలిగారు. వర్ణనలను, అలంకారాలను, మితిమీరి ప్రయోగించకుండా సహజత్వానికి దగ్గరగా కావ్యేతి వృత్త నిర్వహణను రంజింపచేయగలిగారు. ఏ అలంకారాలు లేకున్నా ఆమ్రపాలి పాత్ర కూడా గొప్పగా ఆకర్షించి సమ్మోహితుల్ని చేయగలిగింది!

## 4.5.1. భాష

కవి సరళమైన భాషను సౌందర్యవంతమయ్యేటట్లు ప్రయోగించారు. ఆమ్రపాలి ఎంత సౌకుమార్యమైందో అలాగే భాషాప్రయోగంలో కూడా అంత లలితమైన పదాలనే ఎక్కువగా గ్రహించారు. *"అందరూ వాడుకునే నిత్యవ్యవహారంలో ఉన్న శబ్దాలనే వాడతాడు కవి. కానీ కవి మాత్రం అనుభూతి మూలక ఆత్మకళాభ్యాసం చేత తనకు సిద్ధించిన విశిష్ట దృష్టికి గోచరించే విచిత్ర చిత్రాల్ని, విచిత్రోక్తుల్ని వ్యక్తంచేయడానికే ఆశబ్దాల్ని వాడుకుంటాడు. ఇక్కడ ఒక ప్రధాన భేదం ఉంది. సాధారణ వ్యక్తి నిత్యవ్యవహార భాషను సాధారణోపయోగం కోసం వాడుతున్నాడు. గనుక శబ్దపు ఉపరితలాన్నే వాడుకుంటున్నాడు. కానీ కవి ఆభాషనే వాడుతున్నప్పటికీ ఒక అసాధారణ అభివ్యక్తి కోసం వాడుతున్నాడు. గనక శబ్దాన్ని వివిధ ప్రయోగ విశేషాలకు గురిచేసి శబ్దపు లోతుల్ని కొల్లగొడుతున్నాడు. భాష అదే అయినా ప్రయోగ, ప్రయోజన భేదాల చేత పర్యవసానంగా సామాన్య భాష వేరు, కవిత్వ భాషవేరు అవుతున్నాయి."*[53] అని కవిత్వంలో భాషా ప్రయోగ వైశిష్ట్యాన్ని గుంటూరు శేషేంద్ర శర్మ గారు తెలిపారు.

*"ప్రౌఢ సంస్కృత సమాసాలు తెలుగు కవిత కట్టుకున్న కోటలు. ప్రాచీనులు కోటలు కట్టారు. నవీనులు కట్టవలసింది పేటలు. ప్రగతి ఎప్పుడూ ప్రాతదనానికి, కొత్తదనానికి సామరస్యం కలపటమేకావలసిందే"* [53] నంటారు నండూరి రామకృష్ణమాచార్య గారు.

పండితులపై అభిప్రాయాలు ప్రాచీన, నవీన కవిత్వ భాషా పరిణామాలను పరిశీలించి ప్రకటించిన ప్రామాణిక వాక్యాలుగా భావించవచ్చు. నూతన పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొని, జ్ఞానానంద కవిగారు పద్యాల్లో కూడా సరళమైన సుకుమారమైన భాషను ప్రయోగిస్తూనే, అవసరమైన చోట సమాసపద భూయిష్టమైన రచన కూడా చేశారు. కవిగారిమీద పరిశోధన చేసిన డా॥ ఎస్. శరత్ జ్యోత్స్నారాణిగారు, వారి భాషను సరియైన రీతిలో విశ్లేషించారు. *"విశ్వనాథ వారికి శిష్యులైన పిమ్మట ప్రౌఢ సమాస పటిమతో రచనచేసిన ఈ కవి జాషువా పద్య సరళివైపు ఆకర్షితులై ఆ తరహా పద్యాలు కూడా చెప్పారు. ఆ చిరకాలంలోనే ఈ రెండు*

తత్త్వాలను పెనవేసుకొనిపోయి ఒక కొత్తబాణి జ్ఞానానందకవి బాణీగా స్థిరపడింది. అందువల్ల ఇటు తెనుగు నుడికారపు సారళ్యం అటు శబ్దసౌష్ఠవ పారమ్యం వీరి రచనల్లో సర్వత్రా కన్పిస్తాయి [55]. ఈవ్యాఖ్య వారి భాషను, శైలిని కూడా తెలియజేస్తున్నది. ఆమ్రపాలి కావ్యంలో కవిగారు ప్రయోగించిన భాషను పరిశీలించినట్లయితే పైన పేర్కొన్న అభిప్రాయాలకు చక్కని సమన్వయం కనిపిస్తుంది.

*''అక్కట! యీ పసికూనకు*
*దిక్కెవ్వరూ లేరటంచు తెలిసికొనుచు పె*
*న్మక్కువ నెక్కొనగాఁదా*
*నక్కునఁజేరిచి పిదప గృహమ్మునఁ జేరెన్'' (1-7)*

ఈ పద్యంలో అచ్చుతెలుగు పదాలే ఎక్కువగా ఉన్నాయి.

సంస్కృతాంధ్ర శబ్ద సమ్మేళనంతో కొనసాగిన పద్యాలు కూడా కొన్నింటిని చూడవచ్చు.

*''అస్మన్నందన విశ్వభూవలయ మోహప్రక్రియా స్ఫూర్తి, ది*
*వ్యస్మేరానన, రమ్యనాటక కళాప్రావీణ్య, రాకాసుధా*
*రశ్మిశ్రీని భృత స్వరూప, గుణభార స్ఫార విక్రాంతి, సా*
*రస్మారాశుగ మామ్రపాలి, కిటఁగల్యాణమ్ముఁగావింపగఁన్'' (2-1)*
*''శౌర్యస్ఫూర్తికి విక్రమోద్ధతకి విస్ఫారోజ్జ్వలో ద్యత్కళా*
*ధుర్యత్వమునకున్ దయాపరతకున్ దుర్దాంత బాహామహో*
*ధైర్యశ్రీకి ప్రతీక నీ జనకుఁడద్ధండు ప్రతాపుండు నీ*
*చర్యల్ గాంచి యమంద హర్షజలధిన్ స్నానమ్ము గావించెడిన్ ''- (5-46)*

పైన పేర్కొన్న మొదటిపద్యం (2-1) లో ఆమ్రపాలి సౌందర్యం, గుణం ఔన్నత్యాన్ని, రెండవ పద్యం (5-46) లో బింబిసారుని గొప్పతనాన్ని వర్ణించటానికి సంస్కృత పదాలను ప్రయోగించటం వల్ల గంభీరత దృశ్యమానమవుతుంది.

జాతీయాలు, పలుకుబడులు భాషావ్యవహారానికి ఆయువుపట్టు వంటివి. వాటిని సందోర్భోచితంగా ప్రయోగించినపుడు కావ్యం హృదయానికి ఎంతగానో ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

| | |
|---|---|
| మాటామంతి | (1-21) |
| బంగారుకూతురు | (1-21) |
| గుండెల్లో దిగాలు పడటం | (1-32) |

| | |
|---|---|
| గుటగ్రుంగు వారలు | (1-33) |
| బంగారుమేలు తీగె | (2-2) |
| గుండెలు ముక్కలైపోవటం | (2-13) |
| కన్న ప్రేమకన్న పెంచిన ప్రేమ పెక్కువిధాల అధికతరము | (2-24) |
| ధర్మదేవత నాల్గు పాదాల నడుచుట | (2-27) |
| కమ్మని పల్కులఁగ్రుమ్మరించుటం | (2-40) |
| దేబెరి గొట్టులు | (2-42;6-41) |
| జీవగఱ్ఱ | (2-50) |
| గుండె నిలువదు | (3-4) |
| పూచిన జాబిల్లి మొగము | (3-20) |
| నిప్పులకుప్ప | (4-11) |
| మగసిరి | (5-42) |
| కడవెడుకన్నీళ్లు | (6-16) |

ఇంకా ఇటువంటి జాతీయాలు, పలుకుబడులు, సూక్తులు ఎన్నో ఉన్నాయి. మాండలికపదాలను, అన్యదేశ్యపదాలను కూడ కావ్యంలో ప్రయోగించారు. దుడ్డులు (1-8). ఇది ఒక మాండలిక పదం. చిత్తూరు నెల్లూరు, అనంతపురం, కర్నూలు, కడప మండలాల్లో 'డబ్బు' అనే అర్థం వాడుకలో ఉండగా మరికొన్ని మండలాల్లో 'లావైన' అనే విశేషణంగా దీన్ని ప్రయోగిస్తున్నారు. ఉదా:- మధ్య మాండలిక ప్రాంతంలో 'దుడ్డుకఱ్ఱ' అంటే 'లావైన' కర్ర అనే అర్థంతో వాడుకుంటున్నారు. 'దుడ్డులు గల్గి లోకమునఁ దొరపు సౌఖ్యములందు దోగియే/ యడ్డము లేని జీవితము హాయిగా సల్పగ వచ్చును (1-8) అని ప్రయోగించటంలో ధనం కలిగి' అనే అర్థంలో వాడారు.

**అన్యదేశాలు :**

| | |
|---|---|
| షరతు | *(2-37;38;40;41;50;4-14)* |
| ఠికానా | *(2-40)* |
| పేచీ | *(2-44)* |
| కబురు | *(5-3)* |

**ధ్వన్యనుకరణ పదాలు :**

| | |
|---|---|
| ఠపీల్మంచు | *(4-40)* |
| చిటపటమంచున్ | *(7-3)* |
| ఉఫ్ మని ఊదుట | *(7-8)* |

సమాజంలో బతుకుతున్న కవిమీద ఆ సమాజంలో వ్యవహరించే ప్రజల భాషా ప్రభావం కూడా పడుతుందనటానికివి తార్కాణాలు. అయినప్పటికీ కావ్యంలో ఎక్కడా ఈ భాషా పదాలు కృతకంగా ప్రయోగించకుండా సహజత్వాన్ని ప్రతిబింబించే విధంగా వాడారు.

## 4.6.0.ఛందస్సు

ఆమ్రపాలి 319 పద్యాలు గల ఛందోబద్ధమైన పద్య నిర్మాణ శిల్పంతో వర్ణించబడిన కావ్యం ***''కావ్యంలో కవిచెప్పదలచుకున్న విషయాన్ని ఒకానొక ప్రయోజనాన్ని ఆశించి ఒక ప్రణాళికలో ఒదిగేలా నిర్వహిస్తాడు. దీన్ని మనం కథన శిల్పమనోనిర్మాణ శిల్ప మనో నిర్వచించవచ్చు***నని డా.పరిమి రామనరసింహంగారు పేర్కొన్నారు.[56] ఆమ్రపాలి శిల్ప నిర్మాణాన్ని కావ్యంలో ఉత్పలమాల, చంపకమాల, శార్దూలం, కందం, సీసము, ఆటవెలది, తేటగీతి పద్యాలలోపద్య నిర్మాణ శిల్పాన్ని చూడవచ్చు. పద్యనిర్ధారణను సులభతరం చేసే అక్షరం పద్యానికి ముందు ఉంచటం సంప్రదాయంగా వస్తున్న ఒక పద్ధతి. ఆధునిక కవులు రాయప్రోలు, కృష్ణశాస్త్రి మొదలైనవారు పద్యానికి ఉండవలసిన ఛందోనియమాలను అన్నింటిని పాటిస్తున్నప్పుడు అది ఏ పద్యమో ప్రత్యేకించి సూచించవలసిన అవసరం లేదనట్లు పద్యాన్ని మాత్రమే రాస్తున్నారు. ఇదొక విశిష్టమైన పద్ధతి. దీన్ని పాటించారుకవి. వీరి పద్య నిర్మాణ శిల్పాన్ని పరిశీలిద్దాం! *''గణ యతి, ప్రాసలు, వాక్య, పద, అక్షర నిర్మాణములను భావదీప్తికెట్లు పోషకమవుతాయో చెప్పటమే ఛందఃశిల్పమని''* [57] డా. బి. మంగమ్మ గారు నిర్వచించారు. విశ్వనాథ పద్య శిల్పం గురించి చెపుతూ ***శిల్పమనగా చేయుటయనికాదు. సౌందర్యమా పద్యారచనయందు భాసించుట, పద్యమెత్తుగడ, దింపుగడ బాగుండుట ప్రాస, యతి స్థానములయందు కొన్ని రమ్యములైన శబ్దములు ప్రయోగించి, పద్యమంతయు బాగుగ నున్నదనిపించుట, పద్యము ధారాశుద్ధి కలిగియుండుట - ఇట్టివి పద్యమునకు సహజ మైన సౌందర్యమును సంపాదించులక్షణములని*** [58] విశ్వనాథసత్యనారాయణగారు వివరించారు. వీటన్నింటినీ బట్టి జ్ఞానానందకవి గారు పద్యశిల్పంలో చూపిన విశిష్టాంశాలను, పై లక్షణాలతో కూడా సమన్వయం చేసి విశ్లేషణ చేయటం ద్వారా పరిశీలించవచ్చు. సుకుమారమైన భావాలకు, శృంగారాది మధురరసాలకు ఉత్పలమాల, చంపకమాల వృత్తాలు అందాన్ని కలిగిస్తాయి.

***''తొందర చేయుచున్నది యెదో వచియింవగ రానియూహనా***
***డెందము నామ్రపాలిని కడిందిని చూడఁగ నేమిచిత్ర మీ***

*చందము శౌర్యధుర్య భుజసారఃపరాక్రమవీరమూర్తి భూ*
*వందితుడైన యీ మగధ పాలున కేటికి పుట్టగావలెన్''* (5-6)

పై ఉత్పలమాల పద్యంలో బింబిసారుడు ప్రేమించిన ఆమ్రపాలిని చూడాలనే తొందరలో ఉండటాన్ని కవి సుకుమారమైన 'ఏమి చిత్రం' 'మగధపాలుడు' వంటి పదాలను ప్రయోగించటంలో ఔచిత్యాన్ని పాటించారు. గణభోగ్యను ఒకరాజ్యానికి చెందిన శౌర్యవంతుడు, భుజపరాక్రమవంతుడు అయిన రాజు బింబిసారుడు ప్రేమించటం 'విచిత్రమైనదే' అవుతుంది. పద్యమెత్తుగడ కూడా ఈ విషయాన్ని 'తొందర చేయుచున్నది' అని ఎత్తుకోవటంలోనే తెలుస్తుంది.

చంపకమాల పద్యాలను కూడా కవి శృంగారాది రసాలకు వాడి సొగసుని కలిగించారు. ఉదాహరణకి ఒకపద్యం-

*''ఇరువురి కూర్మిపేర్ములొకటే యనుట్లుగ మేళవించె సం*
*బరములు గాఁగ సత్ప్రణయ బంధుర రంగములోన నిర్వురున్*
*సరిసమమైరి వారల పసందగు విందగు నేక భావసుం*
*దరములు శ్రేష్టతా రసకితా మహనీయ కళాప్రబంధముల్ ''(5-27)*

బింబిసారుడు, ఆమ్రపాలిల ప్రణయం 'సంబరం' గా కొనసాగింది. అది ఎంతో 'పసందైనది' 'సుందరమైనది' ఆ పదాల్లో ఎంతోసౌకుమార్యం ఉంది.

'రాజాదుల శౌర్యమును స్తుతించునపుడు శార్దూల క్రీడితమును ఉపయోగించవలెను''[59] అనగా అటువంటి సన్నివేశమో, సందర్భమో అం... బాగుంటుందనేది క్షేమేంద్రుని అభి ప్రాయం కావచ్చు.

*''శౌర్యస్ఫూర్తికి విక్రమోద్ధతికి విస్ఫారోజ్జ్వలోద్యత్కలా*
*ధుర్యత్వమునకున్ దయాపరతకున్ దుర్దాంత బాహుమహో*
*ధైర్యశ్రీకి ప్రతీక నీజనకుఁడుద్దండ ప్రతాపుండునీ*
*చర్యల్‌గాంచి యమంద హర్ష జలధి న్ స్నానమ్ము గావించెడిన్ ''(5-46)*

భయ, శోక, క్రోధ, విస్మయ, జుగుప్సాది భావములందు చిత్తస్పంద విలంబనము వ్యంజించుటకు మత్తేభము ఉచితమనద గునని కొంతమంది భావిస్తున్నారు. [60]

*''కలలోనైనఁదలంపఁగా నిజము వక్కాణింప నాశ్చర్యమే*
*కలుగున్ బిడ్డలఁగన్న వారలకు లోకంబందు నీలాటి ప*
*ల్కులు విన్నంతనే ముల్కులై వెలసి మాగుండెల్ విదారించు మీ*
*రలు రాజన్యకుమారకుల్? భువన ధర్మ శ్రీసముద్ధారకుల్ ''(2-13)*

ఈ పద్యం 'స్వయంవరసభ' లో ఆమ్రపాలిని గణభోగ్యగా చేయమని

లిచ్ఛవయువరాజులు శాక్యధనీంద్రుణ్ణి నిలదీసినపుడు, ఆతని ఆవేదనను, హృదయం కరిగించేటట్లు వర్ణించారు కవి. 'గుండెలు ముక్కలైపోయేటట్లు ' అనటంలోనే రసం పాఠకునిలో అత్యున్నత స్థాయికి చేరుకుంటుంది.

'కందం రాసిన వాడుకవి, పందిని కొట్టినవాడే వీరుడు' అనే నానుడి ఒకటి ప్రచారంలో ఉంది. కందపద్యం వినసొంపుగా ఉంటుంది. ఉదాహరణకు ఒక పద్యం

*''కనుపించె శాక్యధని నం*
*దనకున్ లావణ్య యౌవనసుధాఖనికిన్*
*మునిగా తేజోమయదే*
*హునిగా మోహన కళామహోదయనిధి గా'' – (3–8)*

బుద్ధుడు ఆమ్రపాలికి కనిపించిన విధానాన్ని వర్ణించాలనుకొని కందాన్ని ఎన్నుకొన్నారు. బుద్ధుడు కనిపించాడు ఆమ్రపాలికి. ఎటువంటి ఆమ్రపాలికి? 'లావణ్య యౌవనసుధాఖని' అయిన ఆమ్రపాలికి. కందపద్యం సాధారణంగా ఆగకుండా వెళుతుంది. కానీ ఈ పద్యం యౌవనవతి వలె ఆగి, ఆగి, నడుస్తూ మృదువుగా మాట్లాడినట్లు నడుస్తుంది. 'లావణ్య యౌవన సుధాఖనికిన్' 'మోహనకళా మహోదయనిధి' గా అనే పాదాలు ఆమె కోర్కెలోగల గాఢత్వాన్ని తెలియజేస్తుంది. పద్యం 'కనిపించె ' అనే ఎత్తుగడ, కనిపించిన దృశ్యాన్ని కొంతసేపు చూసినట్లు కొంతసేపు ఆగి కొనసాగింది పద్యం.

తేటగీతి పద్యాలను ఎన్నుకోవటంలో చిన్న చిన్న పదాలతోనే వివిధ రసాలను వ్యక్తం చేశారు.

*''ఇది మహాముని బుద్ధుని పదములూను*
*పరమ పావనారామమ్ము పతితులిచట*
*నడుగుపెట్టఁగరాదు నేఁడఘము చుట్టె*
*సాకుగాదు మీ వలన మీరాక వలన''* –(6–32) ఆమ్రపాలి తన చెలికత్తెను వెంటబెట్టుకొని బుద్ధుడు నివసిస్తున్న చోటుకి వచ్చి, భగవానుని దర్శనం చేసుకోవాలనుకొంటుంది. కానీ బుద్ధుని ప్రధాన శిష్యుడు ఆమెను అడ్డగిస్తూ , బుద్ధునిపాదాలతో పవిత్రమైన స్థలాన్ని మీ పాదాలతో అపవిత్రం చేయొద్దని తేటపరచటం జరిగింది. ఆటవెలది నీతిని ఉపదేశించటానికి వేమన వంటివారు ఎన్నోవేల పద్యాలను చెప్పారు. కావ్యప్రకాశ కర్త మమ్మటుడు, కావ్యప్రయోజనాన్ని వివరిస్తూ సద్యః పరనిర్వృతిని (ఆనందం) ఉపదేశాన్ని ఫలాలుగాపేర్కొన్నాడు.

''కావ్యం యశసేఽర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే

సద్యఃపర నిర్వృతయే కాంతాసమ్మితి తయోపదేశయుజే'' శ్రీ బోధించినట్లు ఉపదేశం బోధింపబడాలి. దీనికి ఆటవెలది పద్యాలు చాలా అనుకూలమైనవిగా తలస్తున్నారు మన కవులు. జ్ఞానానందకవి కూడా బుద్ధుని బోధనలను ఎక్కువగా ఆటవెలదిలోనే వివరించారు.

*''పరులనెన్నడును నపభ్రంశ వాక్యాల*
*పాలుసేయరాదు పరమ సత్య*
*ధర్మ మార్గమందు తప్పక నడుచుటే*
*మార్గదర్శకమ్ము మానవునకు '' (8-10)*

కవి, సీస పద్యాన్ని ప్రయోగించటంలో శ్రీనాథుడు, విశ్వనాథుడు, జాషువాల ప్రభావం కన్పిస్తుంది.[62] కావ్యంలో ప్రకృతి (3-3) రూపచిత్రణ (1-3) (2-32) (3-9) (4-6) (5-39) (6-16); .దేశ ఔన్నత్యం (2-25;27) (4-35); మనస్తత్వ చిత్రణ (3-1); ఆకాంక్ష (3-12) (4-21) సంభాషణ (2-28) మొదలైన చోట్ల సీస పద్యాలను వర్ణించారు.

*''ఎవరిదో యీ చిత్తరువుఁ జూడ ముచ్చటౌ*
*మగధరాజేంద్రుని దగును గాక*
.................................................
.................................................
*కేవలముగ దివ్య కిమ్మీరముల నామ్ర*
*పాలి మెచఁజేయఁజాలినారు ''(4-6)*

ఈ పద్యంలో ఆమ్రపాలికోసం ప్రత్యేకించి నిర్మించిన భవనగోడలమీద ఉన్న శిల్పాలను, చిత్రాలను చేయిపెట్టి చూపుతున్నంతగా వర్ణించారు. 'ఈ పటంబెవరిదో; 'ఈ చిత్రమెవరిదో' మొదలైనవన్నీ ఆ భవన గోడల దగ్గరకు తీసుకెళ్లి చూపుతున్నట్లు ఉన్నాయి. కవిగారి సీసపద్యాలను మెచ్చుకుంటూ- *''జ్ఞానానందకవిగారి పద్యాలన్నియు ధారాశుద్ధికలిగి ఉన్నాయి. వారి సీసపద్యముల నడక నన్నెక్కువగా ఆకర్షించింది. అవి యొక వంక మహావేశముకును వేరొకవంక భావగాంభీర్యమునకును నిలయమై చదివిన కొలది చదువవలెనను నుత్కంఠను గలిగించును''* అని విశ్వనాథ సత్యనారాయణగారు అభిప్రాయపడ్డారు.[63] పద్యాలలో యతి, ప్రాసలను ప్రయోగించటంలో కవి, పద్యాన్ని శ్రుతహితంగా ఉండేటట్లు రచించారు. ఒకే యతితో పద్యపాదాలను అన్నింటినీ పూర్తిచేయటం, క్రియాపదాలతో పద్యాన్ని ప్రారంభించటం వీరి పద్యాల్లో కనిపించే మరో విశేషం.

*''తన త్యాగమహిమచే ధర్మమ్ము భువనాన*
*స్థాపింప దొరకొన్న శాంతమూర్తి*
*తన వాక్ప్రభావాన దయయు, శాంతియు భూత*
*కోటికి నేర్పించు మేటి గురువు*
*తన తపస్సిద్ధిచే దారుణీవలయాన*
*జ్ఞానమ్ము పడించు మౌని మౌళి*
*తన యహింసా సూత్రమున స్వర్గమునకు ని*
*శ్రేణిఁగల్పించు విశిష్టగుణుఁడు...''(2-20)*

ఏకాక్షరప్రాసలో పద్యాన్ని నడిపించి, 'తన' అని ప్రయోగించటం వల్ల బుద్ధుని గొప్పతనాన్ని మరింత తెలుసుకోవాలనే ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఒక వ్యక్తిపైనే దృష్టిని కేంద్రీకరించటం దీని లక్ష్యం.

*''అందురా? యిది ధర్మమైన కార్యమ్మని*
*లేరాకో? తమకు చెల్లెండ్రు నుడువ*
*విందురా? యిది మహానంద సత్క్రియ యన్న*
*ఎఱుఁగరో? ధర్మంపు చరితమీరు*
*కందురా? యిది బుద్ధ కర్మందిబోధగా*
*చదువరో? దమ్మాల సారనీతి*
*కొందురా? యిది బుధానంద వస్తువు గాఁగ*
*తెలియరో? హైందవ స్త్రీల చరిత*

*గురుకులాన విద్యఁగఱచిన మీకెల్ల*
*ననుభవైక వేద్యమై తనర్చు*
*నన్నుఁబోలు వాని విన్నాణపుంబల్కు*
*లెంతలేసి నుడువ నీక్షణాన -'' (2-25)*

అందురా? విందురా? కందురా? మొదలైన క్రియాపదాలతో పద్యాన్ని ప్రారంభించటం, ఈ పద్యంలో కనిపించే విశిష్టత. బిచ్చువుల క్రియ (పని) సరైంది కాదని చెప్పడానికి క్రియాపదాలతో పద్యాన్ని నడపటం గమనించవచ్చు. ద్వ్యక్షర ప్రాస త్ర్యక్షర చతురక్షరప్రాసపద్యాలను కూడ ప్రయోగించారు. కైకొందురా... డీకొందురా.. కైకొందురా...మేకొందురా...(2-28) మొదలైనవి త్ర్యక్షరప్రాస పద్యానికి చక్కని ఉదాహరణలు. చతురక్షర ప్రాసలో నడిచిన వీరి కందం అందంగా వీనులవిందుగా ఉంది. ఆమ్రపాలి తన అంగీకారాన్ని అనగా గణభోగ్యగా ఉంటానని,

లిచ్ఛవుల కోర్కెలు తీరుస్తానని చెప్పిన మాటలు లిచ్ఛవులకు వీనులవిందులు కలిగించాయి. రెండు ప్రయోజనాలను తన పద్యశైలిలో సాధి ంచారుకవి.

*''భరియించెద భర్తలుగా*
*వరియించెద మీ మనోజ్ఞభావమ్ముల,నే*
*చరియించెద నిష్ఠామతిఁ*
*గురియించెద వలపు మలపు కూర్మిలెసంగన్ ''(2-34)*

ఈ విధంగా వీరి పద్యాలను పరిశీలించినపుడు ఎన్నో విశేషాలు వ్యక్తమవుతాయి. వీరి పద్య నిర్మాణాన్ని సాహిత్యకారులు కింది విధంగా వ్యాఖ్యానించారు.

*''జ్ఞానానందకవి విశ్వనాథవద్ద శిల్పవిద్యసాధించి ఆగలేదు. జాషువాగారి వద్ద భావ మాధుర్యాన్ని, సాంఘిక జీవన విధానాన్నీ, సంస్కరణ శీలాన్నీ, అన్యాయాన్ని ఎలుగెత్తిచెప్పే చైతన్యాన్నీ, పలుకుబడిలో ఒక విధమైన పొంకాన్ని సాధించారు... పద్య రచనా శిల్పంలో శబ్దార్థ మాధుర్య గుణాలను పలురకాలుగా ప్రదర్శించే ప్రజ్ఞను సాధి ంచారు. ఆంధ్రవిశ్వకళా పరిషత్తు వారిచ్చిన కళాప్రపూర్ణ బిరుదం బహుశః ఆయన పద్యశిల్పానికే ఇచ్చారేమో అన్నంతగా ఆంధ్రులు భావిస్తారు''* అని ప్రముఖ విమర్శకులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు వ్యాఖ్యానించారు. [64]

*''జ్ఞానానంద కవిగారు ఆధునిక కాలంలో చక్కని పద్యాలు రాసేవారిలో ప్రముఖులు. పద్యం ధారాశుద్ధితో నడుస్తుంది. భాష, శైలి అలవోకగా పారతాయి. అభి వ్యక్తి డొంకతిరుగుడు లేకుండా సాదా సీదాగా ఉండటం ఆయన రచనలలో ప్రత్యేకత. ఆయన రచనలలో ఆమ్రపాలి ప్రత్యేకంగా గుర్తించవలసిన కావ్యం.*అని ప్రముఖ విమర్శకులు ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు గారు తమ అభిప్రాయాన్ని వ్యక్తికరించారు. [65] ఈ విధంగా డా॥జ్ఞానానందకవి గారి పద్యశైలిని తెలుసుకోవచ్చు.

## 4.7.0. రసపోషణ

కావ్యానికి ఆనందం కలిగించేదానిలో రసం ప్రధానమైంది. కావ్యంలో శృ ంగార, వీర రసాలలో ఏదో ఒకటి అంగిరసంగా ఉండాలనే సంప్రదాయం ఉన్నప్పటికీ, సౌందరనందనం; బుద్ధచరితం వంటి శ్రవ్యకావ్యాలలో శాంతరసమే ప్రధానరసంగా కనిపిస్తుంది. శాంతరసం విషయంలో వివిధ వాదాలు ఉన్నాయి. భరతముని నాట్యశాస్త్రంలో ఎనిమిది రసాలను, ఎనిమిదిస్థాయీ భావాలను పేర్కొన్నాడు. వాటిలో శాంతరస ప్రస్తావనలేదు.

*''శృంగార హాస్య కరుణ రౌద్ర వీరభయానకాః*
*బీభత్సాద్భుత సంజ్ఞా చేత్యష్టౌ నాట్యే రసాఃస్మృతాః*
*రతిర్హాసశ్చశోకశ్చక్రోధోత్సాహౌ భయం తథా*
*జుగుప్సా విస్మయశ్చేతి స్థాయీ భావాః ప్రకీర్తితాః''*

తరువాత కాలంలో అలంకారికులు శాంతాన్ని తొమ్మిదవ రసంగా అంగీకరించారు. వాసుకి అనే అలంకారికుడు మొట్టమొదట శాంత రసాన్ని ప్రతిపాదించినట్లు తలచారు. మరి కొందరు కోహలుడు అనే అలంకారికుడు మొదట శాంతరసాన్ని స్థాపించినట్లు తెలిపారు. కాని వాసుకి, కోహలుల ప్రమాణ వాక్యాలు లభించలేదు. భట్టోద్భటుడు తన 'కావ్యాలంకారసార సంగ్రహము'లో శాంతం తోకలిపి తొమ్మిది రసాలను తెలిపాడు. అతడు భరతుని నాట్యశాస్త్రానికి ఒక వ్యాఖ్యానాన్ని రాసినట్లు తెలుస్తుంది. భరతుని నాట్య శాస్త్ర శ్లోకపాఠాలను...

*''శృంగారహాస్య కరుణ రౌద్ర వీరభయానకాః*
*బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యేరసాఃస్మృతాః*
*రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా*
*జుగుప్సావిస్మయ శమాఃస్థాయీ భావాఃప్రకీర్తితాః''* అనే విధంగా మార్పు చేసి భట్టోద్భటుడు తొమ్మిది రసాలను, తొమ్మిది స్థాయీ భావాలను పేర్కొన్నాడు. శాంతరసానికి 'శమము' స్థాయీ భావమనేది చాలామంది పండితుల అభిప్రాయమైనప్పటికీ మరికొన్ని అభిప్రాయాలు కూడా ఉన్నాయి. రుద్రటుడు శాంతరసానికి స్థాయీభావంగా సమ్యజ్ఞానాన్ని ఆనందవర్ధనుడు తృష్ణాక్షయ సుఖమును అభినవగుప్తుడు అహంకార ప్రశ్రమము (నిరీహత్యము)ను, భోజుడు ధృతిని; కొందరు నిర్విశేష చిత్త వృత్తిని, మరి కొందరు నిర్వేదాన్ని; వేరొక కొందరు ఉత్సాహాన్ని మరికొందరు ఆత్మరతి మొదలైన వానిని పేర్కొన్నారు. ఏదశలో సుఖంగాని, దుఃఖం గాని, ప్రపంచ సుఖంగాని, రాగ ద్వేషాలుగాని, ఇచ్ఛగాని లేదో ఆ దశను శాంతం అంటారు. 'శమము అనగా వైరాగ్యాదుల చేత మనసు నిర్వికార స్థితిలో ఉండటం.'[66]

ఆమ్రపాలి భోగజీవితంపై రోత కలగటంతో మొదలైన శాంతం, ఆమె బౌద్ధ భిక్షువుగా మారటంతో రసమై నిలిచింది. ఆమ్రపాలికి అన్ని రకాల భోగాలు ఉన్నప్పటికీ కూడా ఆమెకు మనశ్శాంతి లేక బాధపడింది. దానినుండే వైరాగ్యం జనించి మనసు నిర్వికార స్థితికి చేరుకొంది. బుద్ధుడు బోధించిన బోధనలు కూడా శాంతరసానికి పోషకాలైయ్యాయి. స్వయంవర సమయంలో ఆమ్రపాలి తీసుకొన్న స్వయం నిర్ణయం వల్ల ధర్మవీరం స్థాపించడానికి జరిగిన ప్రయత్నం కనిపిస్తుంది.

కానీ దానికి ప్రతిబంధకంగా లిచ్ఛవుల మూర్ఖత్వం, కొద్దిగా క్రోధాన్ని తలపింపజేసినా వారి ఆదర్శప్రవర్తన కొంత జుగుప్సను తలపింపజేస్తుంది. ఆమ్రపాలి అవయవ వర్ణన చేయకుండా కేవలం ఆమె అతిలోక సౌందర్య వర్ణననే ఎక్కువగా చేయటం వల్ల శృంగారం మొదట భావమాత్రంగా ఉన్నప్పటికీ, ఆమె గణభోగ్యగా మారటం చేత ఏకత్రైవానురాగం, వేశ్యాశృంగారమవటంతో శృంగారమాభాసమైంది. బింబిసారునిపట్ల కొంత విప్రలంభశృంగారం ధ్వనింప చేయబడింది. కాబట్టి, ఇతరరసాలు అప్రధానంగాను, కరుణ, శృంగార, ధర్మవీరాలు తరువాత రసాలుగాను **శాంతం** ప్రధానరసంగాను నిర్వహించబడింది.

ఆమ్రపాలి కావ్యంలో శాంతమంగిరసమని సిద్ధాంత పరచటానికి కావ్యమంతా తార్కాణంగా నిలుస్తుంది. కావ్యారంభం, వస్తు నిర్వహణ, కావ్యముగింపు మొదలైన అంశాలు శాంతరసప్రాధాన్యాన్ని వెల్లడిస్తున్నాయి. కావ్యారంభ పద్యంలోనే శత్రుసేనలను చీల్చి చెండాడి రక్తసిక్తదేహుడై విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్న యుద్ధవీరునిలా సూర్యుడు కనిపిస్తున్నాడని వర్ణించటంలో కథ శాంతరస ప్రధానమైందనే విషయం సూచితమైయ్యింది.

గణభోగ్యగా మారిన ఆమ్రపాలి మానసిక వ్యధతో కుమిలిపోయి, ఘర్షణకులోనై, తాను దొరికిన ఆమ్రవనంలోకే పరుగుతీసి కొంత ఉపశమనం పొందింది. బుద్ధుని దర్శనం వల్ల మనసు ప్రశాంతమై, జీవితసత్యాన్ని గ్రహించి వైరాగ్యానికి గురైంది. బింబిసారుణ్ణి ప్రేమించటం, కుమారుడు పుట్టడం, ఆ కుమారుడిని ఆతని తండ్రి దగ్గరకే పంపించి వేయటంతో చిత్తం ప్రశాంతమై నిర్వికారస్థితిని పొందింది. విటులవింత ప్రవర్తన, సమాజ నిరాదరణ మొదలైనవన్నీ ఆమెను క్రుంగదీయగా బుద్ధుని బోధనలు ఆమెను మోక్షమార్గం వైపుకి నడిపించాయి. కాబట్టే బుద్ధుడు పెట్టే భిక్షను స్వీకరించేవరకూ ఆమె అటుకులను మాత్రమే తిని ప్రాణాన్ని నిలుపుకొంది. బుద్ధుడు తపస్సు నాచరించి వచ్చిన తరువాత ఆమె–

*"మీనిస్సీమ కృపాకటాక్షములకున్ మీదివ్య దాశీర్మహా*
*వాణీ బంధురతా విలాసములకున్ బహ్వాంజలుల్‌సేతు నా*
*లోనం బర్వులు దీయు కిల్బిషము నాలోకింప మీ ప్రేమవున్*
*దేనెల్ సోనలుఁ జిమ్ము పల్కులకు తండ్రీ! క్షాళనం బయ్యెడిన్ –"*

*(7–21)* అని ఆమె ఆవేదన, ఘర్షణలనుండి ప్రశాంతత పొందిన ఆనందాన్ని వ్యక్తం చేసింది. ఆమె చిత్తం నిర్వికారస్థితిని ప్రశాంతిని తెలియజేసేదే 'క్షాళనంబయ్యెడిన్' అని ప్రయోగించటంలోని ఆంతర్యం! ఆమె లౌకిక సంబంధమైన రాగద్వేషాలనుండి

విముక్తి పొందింది. ప్రపంచ సుఖంగాని, దుఃఖంగాని, కోరికలు గాని లేనిదశకుచేరుకుంది. ఇక తాను కూడా బుద్ధుని మార్గాన్నే అనుసరిస్తూ...

*''ఉదిత మహోన్నతాశయము లుర్వర నిల్వఁగ నిష్కళంకపున్*
*హృదిని బ్రచారముల్ సలిపి యీవతితుల్ బడుగుల్ సుఖాల్కకై*
*పదవిని వీడి ధర్మముల బాటను చన్న ప్రసన్న రూప! మీ*
*పదములె దిక్కు నాకిల నపార కృపారసభావ బంధురా* ''- అని

(7-29) తన జీవితాన్ని పూర్తిగా బుద్ధుని ధర్మబోధనలను ప్రచారం చేయటానికే అంకితం చేస్తుంది. బౌద్ధసన్యాసిగా మారిపోతుంది. తనకున్న ఆస్తినంతటినీ, తనకెంతో ఇష్టమైన ఆమ్రవనాన్నీ కూడా దానంచేసేస్తుంది. మోక్షమార్గానికి జీవిత పథాన్ని తిప్పుకోవటం ద్వారా శాంతరసం పరిపూర్ణమై వెలుగొందింది.

కావ్యంలో కరుణ, శృంగార రసాలు సన్నివేశానుగుణంగా అంగరసాలుగా పోషింపబడ్డాయి. ఆమ్రపాలిని గణభోగ్యగా చేయమని లిచ్ఛవ యువరాజులు స్వయంవర సభలోనే, శాక్యధనికుడిని అడుగుతారు. అతడు ఎన్నో విధాల వాళ్లకి నచ్చచెప్పాలని ప్రయత్నించి, చివరికి నిస్సహాయుడై దుఃఖస్తాడు. అపుడు కవి వర్ణించిన పద్యం:

*''అతి నైర్మల్య పథానువర్తియయి విద్యాభోగ సంపత్తిచే*
*మతిమంతుల్ ధృతి మంతులందఱును సన్మానింపవాసించునా*
*సుత మీకున్ గణభోగ్య గా సలువ విచ్చుంగత్తి నాగుండెలో*
*తతనృత్యం బొనరించుటే సుఖము మీ తాత్పర్యమీడేరెడిన్ -''* (2-26)

శాక్యధనుని దుఃఖం, ఆవేదనలను 'విచ్చుంగత్తి నా గుండెలో తతనృత్యం బొనరించుటే...' అనటం ద్వారా ఎంతో శక్తివంతంగా వ్యక్తం చేయగలిగారు. మరొక చోట: ఆమ్రపాలి గణభోగ్యగామారిన తరువాత ఏకాకిగా మారిపోయింది. ఆప్యాయత, అనురాగాలు కొరవడినప్పటికీ భోగరాశులకు మహారాణి అయ్యింది. అటువంటప్పుడు ఆమెమనసులో పడిన ఆవేదనను కవి ఎంతో కరుణ రసాత్మకంగా వర్ణించారు

*''అల్లారుముద్దుగా నవవనిఁబెంచియట్టి*
*తల్లిదండ్రుల నెడందఁదలచి తలఁచి*
*చిన నాటినుండియు తనతోఁజరించు నె*
*చ్చెలు శ్లేషోక్తికిఁ గులకి కులికి*

*తనవిద్దియులకు కారణభూతులగు గురున్*
*బత్తినిండఁగ చేతులెత్తి యెత్తి*
*వయసుతో పాటు గఁ బయనించు కోర్కెలు*
*పూడ్చఁగాఁబడెనంచు నేడ్చియేడ్చి*

*గుండె పగులు నట్లు కుమిలి పోయి*
*చెప్పరాని వెతలకుప్పలోన*
*కూలబడిన యామ్రపాలి నెవ్వారలు*
*ప్రేమతోడ నాదరింతు రొక్కొ* –'' (4–18) శృంగార రసాన్ని కూడా ఈ కావ్యంలో అంగరసంగానే పోషించారు. ఆమ్రపాలి– బింబిసారుడు ఒకరినొకరు ప్రేమించుకొన్నారు. ఇరువురిలో ఉన్న సౌందర్యం వారిని ఆకర్షించటమే కాకుండా, వారిలోనున్న గుణాలు కూడా వారి ప్రేమకు తోడ్పడ్డాయి. ఆమ్రపాలికి చెలికత్తె; బింబిసారునికి గోపుడు సహకరించారు. ఆమ్రపాలి భవన గోడలమీద శిల్పాలు, చిత్రాల్లో బింబిసారుని రూపం ఆమెను ఆకర్షించటం, చెలికత్తెలు ఆతని ధైర్య, శౌర్య, భుజ బల, సుగుణాలను వివరించటం ప్రేమ బలపడటానికి అవకాశాన్ని కలిగించాయి. ముందుగానే ఆమ్రపాలి సౌందర్యాన్ని తెలుసుకోవటం, ఆమెలో ఉన్న కళకు ఆకర్షింపబడటం, దీనికి తోడు ఆమెనుండి ఆహ్వానం రావటం బింబిసారునిలో ప్రేమ బలపడటానికి దోహదంచేశాయి. వీరిరువురి మధ్యగల ఈ శృంగారం చక్కగా పోషింపబడటంవల్లనే అతడు ఆమ్రపాలిని చూడాలనే అభిలాషకు లోనయ్యాడు. ఆ పద్యం:

*''తొందరచేయుచున్నది యెదో వచియింపఁగ రాని యూహనా*
*డెందము నామ్రపాలిని కడిందిని చూడఁగనేమి చిత్రమీ*
*చందము శౌర్యధుర్య భుజసార పరాక్రమ వీరమూర్తి భూ*
*వందితుఁడైన యీ మగధ పాలునకేటికి పుట్టగావలెన్* ''(5–6) వచ్చిన తరువాత ఆరురోజులు 'క్షణము పోనీక వెచ్చని గుండియల ఝషాంకుని కేళికారంగం'లో తరించారు. 'పరవశించిన రసభావాల మత్తులో సర్వ సౌఖ్యమ్ములను' చవిచూశారు. ఆరురోజులానంతరం బింబిసారుడు తన మగధ రాజ్యం వెళ్లిపోయాడు. తరువాత ఆమె గురించి పట్టించుకోలేదు, కేవలం ఆ సన్నివేశం వరకూ మాత్రమే శృంగార రసం పోషించబడింది. ఇక ఆమ్రపాలి లిచ్ఛవుల పట్ల చూపించింది శృంగారమవ్వదు. పలువురు లిచ్ఛవాధీశులకు ఆమెపై కోరిక ఉంది. దాన్ని తీర్చుకున్నారు. నరసభూపాలీయంలో పలు వరకు ఒక భూమినిపై

వలపును, ఒకవారసతికి పలువురిపై వలపును, మృగవిహంగాదుల వలపును రసాభాసమని పేర్కొంది.

ఈ విధంగా కావ్యంలో రసపోషణను పరిశీలించినపుడు కరుణ, శృంగార రసాలు ఉన్నప్పటికీ అవి అంగరసాలుగానే పోషింపబడినవనీ, అంగిరసంగా శాంతమే ప్రాధాన్యం వహించిందనీ తెలుస్తుంది. బుద్ధుడు, ఆమ్రపాలిలో ప్రధానమైన రసం శాంతమే! కాబట్టి 'ఆమ్రపాలి' శాంతరస ప్రధాన కావ్యమై 'ఆమ్రపాలి' మోక్షానికి కారణమైనదని తేలింది.

# ఐదవ అధ్యాయం

# బౌద్ధదర్శనం

## 5.0. బౌద్ధదర్శనం

డా॥జ్ఞానానందకవి గారు ఆమ్రపాలి కావ్యంలో బౌద్ధ ధర్మాన్ని, బోధనలను కావ్యేతివృత్తానికి అవసరమైనంతవరకే స్వీకరించారు. అన్ని పాత్రలూ ఆమ్రపాలి వైపు నడవగా, ఆమ్రపాలి మాత్రం బుద్ధుని ధర్మానికి, బోధనలకు ఆకర్షితురాలై బుద్ధుడే శరణమని తలచి, బౌద్ధ ధర్మాన్ని ఆకళింపు చేసుకొని బౌద్ధసంఘంలో చేరగలిగింది. కుమారుడు విమలకొండ కూడా బౌద్ధసన్యాసాన్ని స్వీకరించాడు. బౌద్ధమత బోధనలను బుద్ధుని జీవితం నుండి విడదీసి చూడలేం అన్నట్లు ఉంటాయి. అవి కావ్యంలోనూ వర్ణితమయ్యాయి. బౌద్ధమతానికి ప్రధానమైనవానిలో ***త్రిరత్నాలు, ఆర్యసత్యాలు,*** వానిలోనే భాగమైన మాత్రమే **అష్టాంగమార్గాలను** ఆమ్రపాలి కావ్యంలో ప్రతిఫలింపజేశారు కవి.

## 5.1. ఆర్యసత్యాలు (Four Noble Truths)

ఆమ్రపాలి గణభోగ్య జీవితాన్ని గడుపుతూ మానసిక ప్రశాంతత కోల్పోయి, సంఘర్షణ పడుతూ, తీవ్రవ్యధకులోనై గుండెల్లో దుఃఖాన్ని పోగొట్టుకోవాలని తాను దొరికిన ఆమ్రవనంలోకి వస్తుంది. కరుణాహృదయుడైన బుద్ధుడు అక్కడ తపస్సు చేసుకొంటూ కన్పిస్తాడు. అతడిని ఎవరో ముని అనుకొని ఆమెలో ఉన్న తీరని కోరికను నర్మగర్భితంగా వ్యక్తీకరించి, తన ఇంటికి రమ్మనమనీ, సర్వసౌఖ్యాలను సమకూరుస్తాననీ అంటుంది. బుద్ధుడు ఆమె మనోవాంఛను గమనిస్తాడు. చాలా మృదువుగా, ప్రశాంతంగా, జీవితసత్యాలను వివరిస్తాడు.

అంతేకాక ఆమె బౌద్ధ భిక్షువుగా మారిన తరువాత ఆమెతోపాటు బౌద్ధారామానికి వచ్చిన మిగిలిన ప్రజలకు కూడా ఈ నాలుగు ఆర్యసత్యాలను వివరించాడు.

బౌద్ధ ధర్మమూల సూత్రాల[67]లో 'సర్వమూక్షణికమనేది ఒక మూల సూత్రం.' ఇది ప్రపంచం దుఃఖమయమనే దాన్ని స్పష్టం చేస్తుంది. పుట్టిన ప్రతివారికీ మరణం తప్పదు. అయినా ఆశలు పెంచుకుంటారు. ప్రపంచంలో దుఃఖం లేకపోవటంగాని, పుట్టిన జీవి మరణించకపోటమనేదిగాని కనిపిస్తే ఎంతో సంతోషంకదా! అని బుద్ధుడు చెపుతూ-

*''నాశము తప్పదీ బ్రతుకునన్ భువిలోన సహస్ర వర్షముల్*
*క్లేశమొకింత లేక బ్రతుకీడ్చిన వానికినైన దీవ్యదా*
*వేశము గల్గినట్టి ఋషివీరుకైనను గాని యెందుకో*
*ఆశలు పెంచుకొందు రసహాయత మానవులెల్ల రమ్మరో''* (3-24) అని

విశదీకరిస్తాడు. మానవుని శరీరం వయః పరిణామాన్ని అనుసరించి క్షణక్షణం మారుతూ బాల్య, కౌమార, యౌవన, వార్ధక్య దశలను దాటి మట్టిలో కలిసిపోతుందనే విషయాన్ని కవి, 'నాల్గుదశల మధ్య నవయుచునున్నట్టి' (3-25) అని వర్ణించారు. దృశ్యమాన ప్రపంచంలో సర్వమూ అనిత్యమేనని తెలుస్తుంది.

దుఃఖానికి కారణం కోరికలు అనేది బుద్ధుడు బోధించిన నాలుగు సత్యాలలో రెండవది. ఇంద్రియాలకు ప్రియమైన విషయసంపర్కం, వాటిస్మృతి కోరిక (తృష్ణ) లకు కారణమౌతుంది. ఆ కోరికలు పూర్తిగా త్యజించ గలిగినపుడు దుఃఖం నివారింపబడుతుంది. ఇది మూడవ ఆర్యసత్యం.[68]

ఆమ్రపాలి ఎన్నో కోర్కెలతో రగిలిపోతూనే బుద్ధుని ప్రథమ దర్శనం చేసుకొంది. బుద్ధుడు జీవితం క్షణికమైందనే జీవిత సత్యాన్ని బోధించాడు. తన తపస్సు పూర్తయిన తరువాత భిక్ష స్వీకరించటానికి వస్తానని చెప్పి పంపితే, బుద్ధుని పునరాగమనం వరకూ భిక్షను సమర్పించటానికి ఎదురు చూస్తూనే ఉంటుంది. అప్పటికి ఆమెలో కోరికలు నశించిపోయాయి. తాత్కాలిమైన లౌకిక భోగాలనుండి విముక్తి మార్గానికి సిద్ధమై ఉంది. దాని అంతటికీ కారణం ఆమెలో వివాహం చేసుకోవాలనీ, సర్వసౌఖ్యాలను అనుభించాలనీ ఉన్న కోర్కెలన్నీ నశించటమే. కొడుకుని, తండ్రిని, సర్వస్వాన్ని వదిలి బుద్ధుని శిష్యగణంలో చేరిపోయింది. ఆమె దుఃఖంనుండి విముక్తి పొందింది. దుఃఖ నివారణానంతరం మోక్షానికి అష్టాంగ మార్గం అవలంబించటం ఆర్య సూత్రాలలోని చివరిది. ఆర్య సత్యాలతో అన్వయం చేసినప్పుడు జ్ఞానానంద కవిగారి ఆమ్రపాలి కావ్యంతో సరిపోతున్నాయి. ఆర్య సత్యాలలో చివరిదైన అష్టాంగామార్గంలో బౌద్ధ దర్శనం మరింతగా ప్రకాశిస్తుంది.

## 5.2. అష్టాంగమార్గాలు

ఆమ్రపాలి కావ్యంలో 'అష్టమాశ్వాసం' అంతా బౌద్ధదర్శనానికి సంబంధించిందే ఎక్కువగా ఉంది. కావ్యంలో బౌద్ధ ధర్మసూత్రాలు, బోధనలు ఉన్నప్పటికీ ఈ ఆశ్వాసం పూర్తిగా బౌద్ధ తత్త్వాన్నే తెలియజేస్తుంది. దీనివల్లనే ఆమ్రపాలి కావ్యం చారిత్రక తత్త్వకావ్యాల్లోకి చేరుతుందనిపిస్తుంది. కావ్యంలో గల కొన్ని లక్షణాలు ఆస్పృహను కలుగజేస్తున్నాయి. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు చారిత్రక తత్త్వ కావ్యం గురించి చెపుతూ "కావ్యంలోని వస్తువు కథకోసంగాని రసంకోసం గాని చెప్పబడదు. చారిత్రక సన్నివేశం వెనుక రచయిత దర్శించిన తాత్త్విక సిద్ధాంతం కావ్యార్థాలకు గమ్యమానంగా నిలస్తుంది. ఈ ప్రక్రియలో కవి కథనెలా చిత్రించాడన్నది ప్రధానం కాదు కవి కథనెలా ఒక తత్త్వానికి వ్యాఖ్యగా నిబంధించాడన్నదే ప్రధానం"[69] అని లక్షణ చర్చను చేశారు. అయితే జ్ఞానానంద కవి గారు కథకు కూడా ప్రధాన్యత ఇవ్వడం వల్ల పూర్తిగా చారిత్రిక తత్త్వ కావ్యంగానే పరిగణించవలసిన అవసరం లేదు. కాని చాలా లక్షణాలు ఉన్న 'చారిత్రక తత్త్వ కావ్యంగా చెప్పడం మాత్రం సమంజసంగా ఉంటుంది. బౌద్ధమతంలో అష్టాంగ మార్గానికి ప్రత్యేకస్థానం ఉంది. ఇది భిక్షువులై కర్మక్లేష నిరోధాన్ని చేయటానికి నిర్వాహణపదం. దీన్ని ధర్మయానమనీ, బ్రహ్మయానమనీ బౌద్ధ గ్రంథాల్లో పేర్కొన్నారు.[70] కావ్యంలో అష్టాంగ మార్గాన్ని ఆమ్రపాలి భిక్షువుగా మారిన తరువాతనే వివరించారు. ఇది ప్రధానంగా మోక్షానికి సంబంధించింది కాబట్టి బౌద్ధసన్యాసులు, భిక్షువులు ఆచరించ వలసిన నియమాలు దీనిలో ఉంటాయి. అయితే వీటిని సామాన్య ప్రజలు కూడా ఆచరించి, బౌద్ధధర్మాన్ని పాటించమని బోధిస్తుంటారు.

కావ్యంలో పేర్కొన అష్టాంగమార్గాలు కింది విధంగా తెలిసికోవచ్చు. బౌద్ధ తత్త్వాన్ని ఎంతైనా వివరించవచ్చు. కానీ పరిశోధన పరిధిలో వ్యాస విస్తృతిని దృష్టిలో పెట్టుకొని దర్శనానికి సంబంధించిన పద్యాలనే పేర్కొని వివరణ అంత్యంత అవసరమని అనిపించిన వాటిని వివరించడానికి ప్రయత్నిస్తాను.

### i. సమ్యక్‌వాక్ (Right Speech)

"పరులనెన్నడును నపభ్రంశ వాక్యాల
పాలుసేయరాదు పరమసత్య
ధర్మమార్గమందు తప్పక నడచుటే
మార్గ దర్శకమ్ము మానవునకు" (8-10)

### ii.సమ్యక్ క్రియ (Right Action)

''ఇతర మానవాళి కితము సేయుటె గొప్ప
యనుచుఁదలఁప వలయు మనము నందు
సత్ప్రవర్తనంపుటుత్కృ భావమ్ము త
ప్పక యొసంగు దాని ఫలిత మరయ'' (8- 11)

### iii.సమ్యక్ జీవనమ్ (Right Livelihood)

''హానిఁదలఁపఁగూడ దంతరంగమ్మున
నెట్టి జీవికైన నెన్నఁడైన
అవసరమ్ము కల్గునట్టి వేళకు మేలు
సేయ జీవితమున సిద్ధపడుము'' (8- 12)

### iv. సమ్యక్ శ్రమ (Right effort)

''సహజమైన వైరిషడ్వర్గమును ద్రుంచి
గెంటవలయు గుండెగీమునుండి
సహనచంద్రికలు దిశాభి త్తతలముల
నలమ నరుఁడు కృషిని సలుపవలయు'' (8- 9)

### v.సమ్యక్ ఆలోచన (Right thinking)

''అంతులేని వగు దురంత దుశ్చింతల
కాపురించు హృదయ గహ్వరమున
సాధనమున వాని సమయించి యుత్తమ
కార్యమునను చేయఁగడఁగవలయు'' (8- 13)

### vi. సమ్యక్ ధ్యానమ్ (Right mindfulness)

''పాడు తలఁపు లెడఁద పర్వెత్తి ధ్యానమ్ము
భగ్న పఱచునట్టి లగ్నమందు
నెట్టి ధ్యాసలేక యెకాగ్రతను వాని
గెలువ వలయు నేల వలయు నరుఁడు'' (8- 15)

### vii.సమ్యక్ నిశ్చయమ్ (Right Contemplation)

''నిష్కళంకమైన నీతిదాయకమైన
మాననీయమైన మానవతకు
ప్రణతులందఁజేసి పట్టమ్ముఁగట్టఁగా
వలయు సంతతము కువలయమందు'' (8- 14)

### viii. సమ్యక్ దృష్టి (Right View)

''ఉత్తమాశయాలనున్న తాదర్శాల
శీలసంపదలకు నాలవాల
మై చరింప వలె సదా చరణమ్ముతో
నాశవీడి మనుజు డవని యందు'' (8– 8)

కవి వర్ణించిన అష్టాంగమార్గసారాంశాన్ని విశ్లేషించినట్లయితే లోభాన్ని విడనాడాలని, దయను చూపుతూ దానం చేస్తూ సత్యభాషణను అలవర్చుకోవాలి. శాంతిని సామరస్యాన్ని పెంపొదించుకోవాలి. అపాయకరం కాని వృత్తిని చేపట్టి సరియైన జీవన విధానాన్ని ఏర్పాటు చేసుకోవాలని అవగతమవుతుంది. బుద్ధుడు చెప్పిన అష్టాంగ మార్గాన్ని విశదీకరిస్తూ కవి ఎనిమిది పద్యాల్లోనే దీన్ని చెప్పడం ఔచిత్యంగా ఉంది.

## 5.3. త్రిరత్నాలు

బౌద్ధాన్ని స్వీకరించి ఆచరించే వాళ్లంతా త్రిరత్నాలను అంగీకరించాలని బౌద్ధసాహిత్యం తెలుపుతుంది.[70] అవి:

***i. బుద్ధం శరణం గచ్ఛామి (I take refuge in the Buddha)***

***ii. ధర్మం శరణం గచ్ఛామి (I take refuge in the Dharma)***

***iii. సంఘం శరణం గచ్ఛామి (I take refuge in the Sangha)***

ఈ మూడింటిని శరణ వేడినవాడే బౌద్ధానికి అర్హులని కొన్ని బౌద్ధ గ్రంథాలు తెలియజేస్తున్నాయి.[71]

గణభోగ్యగా జీవితాన్ని గడిపే ఆమ్రపాలి బుద్ధుణ్ణి శరణువేడింది. అతడు ధర్మాన్ని వివరించాడు. దాన్ని అవళంబించటానికి ఆమె సంఘంలో చేరింది. ఇక్కడ 'సంఘం' అనగా ***'బుద్ధ భగవానుని ఆశయాలతో కూడిన భిక్షుకసంఘం'*** అని అర్థం.[72] కొత్త జీవిత విధానాన్ని కలిగి ఉంటుంది. ఈ విధంగా బుద్ధుని బోధనలను, బౌద్ధ ధర్మనియమాలను, సమర్థవంతంగా రమణీయంగా కావ్యంలో వివరించారు కవి. నెమలి పునర్జన్మ వృత్తాంతాన్ని వివరించటం వల్ల బౌద్ధంలో కూడా కర్మసిద్ధాంతం ఉందనేది స్ఫురింప జేశారు. బౌద్ధమతంలో ఉన్న ఆత్మ–పరమాత్మ సిద్ధాంతాల జోలికి పోకుండా ఆర్యసత్యాలను, అష్టాంగమార్గాన్ని, బౌద్ధత్రిరత్నాలపైనే దృష్టిని కేంద్రీకరించినట్లు స్పష్టమైంది.

# ఆరవ అధ్యాయం

# తులనాత్మక పరిశీలన

## 6.0. తెలుగు - అన్యభాషల్లో ఆమ్రపాలి

విశ్వమానవ కల్యాణాన్ని ఆకాంక్షించిన శాంతమూర్తి బుద్ధుని ఆశయాలు. ఆకాంక్షలను చాలామంది వివిధ ప్రక్రియల్లో అక్షరీకరించారు. ముఖ్యంగా బౌద్ధజాతక కథల్లోని ఆమ్రపాలి ఇతి వృత్తంతోనే కావ్యాలు, నాటకాలు, నవలలు రాసినవారున్నారు. డా॥యస్.టి.జ్ఞానానందకవి, కరుటూరి సత్యనారాయణ, శారదగారలు 'ఆమ్రపాలి' కావ్యం రాయగా లల్లాదేవి 'ఆమ్రపాలి' పేరుతో నవలను రచించారు. హిందీలో చతురసేన్ శాస్త్రి 'వైశాలికీ నగరవధూ' పేరుతో నవలను రాస్తే, దాన్ని కె. రమేష్; బేనీపురి ఆమ్రపాలి నాటకాన్ని రాస్తే దాన్ని పాట్లూరి; హిందీలోనే రామచంద్రఠాకూర్ ఆమ్రపాలి పేరుతో కావ్యాన్ని రాస్తే దాన్ని ఆకెళ్ల సీతారామ్‌లు తెలుగులోకి అనువదించారు. ప్రస్తుతం జ్ఞానానందకవి, కరుటూరి, లల్లాదేవి గారల రచనలే అందుబాటులో ఉన్నాయి.

## 6.1. ఇతివృత్తాధారిత తులనాత్మక పరిశీలన

ఈ అధ్యాయం వలన మరిన్ని విశేషాలు బహిర్గతమవుతాయనే ఉద్దేశ్యంతో ఆమ్రపాలి కావ్యేతివృత్తంతో వచ్చిన రచనలను సంక్షిప్తంగా పరిశీలిస్తున్నారు. ఈ తులనాత్మక పరిశీలన ఇతివృత్తంతో మాత్రమే కొనసాగుతుంది. జ్ఞానానందకవి ఆమ్రపాలి కావ్యాన్ని కొన్ని లక్షణాలు గల చారిత్రక తత్త్వకావ్యంగాను, కరుటూరి సత్యనారాయణ చారిత్రకేతివృత్త రసప్రధాన కావ్యంగాను రచించారు. లాల్లదేవి రాసిన ఆమ్రపాలి నవల సామాజిక ధృక్కోణంతో రాయబడింది.

## 6.2. ఇతివృత్తం చారిత్రకమే !

బుద్ధుడు, బింబిసారుడు, ఆమ్రపాలి, లిచ్ఛవులు, విమలకొండ ( కొన్ని గ్రంథాల్లో విమలకౌండిన్య అని ఉంది) ఆనందుడు గోపుని పాత్రలు చారిత్రకమైనవే! వీటిని పోషించటంలో పైన పేర్కొన్నవారు ఎవరూ చరిత్రను విస్మరించలేదు. షోడషమహాజన పదాలకు చెందిన వైశాలీనీ నగరవేశ్య ఆమ్రపాలి కథ చారిత్రకమైనదే. చారిత్రక కావ్యంలో చరిత్ర ఘట్టాలను యథాతథంగా గ్రహించాలన్న నియమమేమీలేదు. వస్తువులో ఔచిత్య పోషణకోసం కొన్ని మార్పులు కావ్యకర్త చేయవచ్చుననేది విమర్శకుల అభిప్రాయం[73] కనుక కవులు, కవయిత్రులు ఆమ్రపాలి

కథను మార్పులు చేశారు. వీరు అంతా తమ రచనల్లో ఆమ్రపాలి వేశ్య అనే విషయాన్ని ధృవీకరించారు. కానీ ఆ పరిస్థితి రావటానికి చూపిన కారణాలు మాత్రం భిన్న విధాలుగా చిత్రించారు. వీరు అంతా ఆమ్రపాలి బౌద్ధమత బోధనలకు, బుద్ధుని దయకు ఆకర్షితురాలై బౌద్ధ భిక్షువుగా మారినట్లే ఆమ్రపాలి పాత్రను కథనీకరించారు.

'క్షేమేంద్రుని బోధిసత్వావదాన కల్పలత'లోని మూలకథతో డా॥యస్. టి. జ్ఞానానందకవి గారి ఆమ్రపాలి కావ్యాన్ని రెండవ అధ్యాయంలోనే విశ్లేషించి చూపాను. ఈ అధ్యాయంలో, లభించిన గ్రంథాల్లో ఆమ్రపాలి ఇతివృత్తాన్ని సంక్షిప్తంగా పరిశీలిస్తున్నాను. జ్ఞానానందకవి గారి కావ్యంలో పిల్లలు లేని మహానాముని (శాక్యధనికుని)కి ఆమ్రపాలి దొరకగా, కరుటూరి వారి కావ్యంలో శాక్యధనికుడికి ఆనందుడనే కొడుకు ఉన్నట్లు ఉంది[74].

ఆడపిల్ల యౌవనస్తురాలు అవుతుంటే పెళ్లి చేయాలనే తపన తండ్రికి ఎలా పెరుగుతుందో అది జ్ఞానానందకవి గారి కావ్యంలో వర్ణితమైంది. కానీ కరుటూరి వారు తండ్రి రాజ్య నిర్వహణా భారంలోపడి మరచిపోయినట్ల రాశారు[75]. ఇటువంటి ప్రయత్నమేదీ లల్లాదేవి గారి నవలలో జరగలేదు. ఆమ్రపాలి తండ్రి, లిచ్ఛవుల మనస్తత్వాన్ని ఎప్పటికప్పుడు గమనిస్తూ, వారివల్ల కూతురికి ఏముప్పు వాటిల్లుతుందోననే భయంతో ఉండే వాడనీ, కనుక సరైన సమయంలో తగిన వరుణ్ణి ఎన్నికచేసి వివాహం చేయాలని భావించి స్వయంవర సభను ఏర్పాటుచేసినట్లు జ్ఞానానందకవి వర్ణించారు. అంతేకాకుండా స్వయంవరసభలో లిచ్ఛవులు అందగత్తె అయిన ఆమ్రపాలి తమకే చెందాలని, ఇతరులకు చెందకూడదని పట్టుపడతారు. నామ మాత్రమైన అధికారాలు గల గణనాయకుడైన శాక్యధనికుడితో లిచ్ఛవులు తమ అభిప్రాయం ప్రకారం జరగకపోతే తీవ్ర పరిణామాలు ఎదురౌతాయని హెచ్చరిస్తారు. పరిస్థితులన్నీ ప్రత్యక్షంగా చూసిన ఆమ్రపాలి **'స్వయం నిర్ణయం'**తో గణభోగ్యగా ఒప్పుకొంటుంది (3-19). కానీ కరుటూరి వారు లిచ్ఛవుల్లో అభయుడు అనే వాడు ఆమ్రపాలి పట్ల వ్యామోహం కలిగి, తనకి వివాహం చేయటానికి నిరాకరించినందుకుగాను, లిచ్ఛవులను రెచ్చగొట్టి, ఆమ్రపాలికి పెళ్లిచేయపోవటం వల్లనే రాకుమారులు ఒకరినొకరు చంపుకుంటున్నారని రాజైన శాక్యధనికునిడితో చెప్పినట్లు వర్ణించారు (1-72). గణభోగ్యగా ఆమ్రపాలికి తెలియకుండానే సభలో శాక్యధనికుడు నిర్ణయం తీసుకొని, ఆ నిర్ణయాన్ని ఆమ్రపాలికి తండ్రే వివరిస్తాడు (4-40). అప్పటికే శత్రురాజైన బింబిసారుని చేతిలో మోసపోయిన ఆమ్రపాలి దేశభక్తితో గణభోగ్యగా జీవితాన్ని స్వీకరిస్తుంది.

బింబిసారుణ్ణి ద్వేషిస్తుంది. జ్ఞానానందకవి గారి కావ్యంలో ఇటువంటి ద్వేషించటమనేది లేదు. ప్రేమకు శత్రుదేశాలు అడ్డురావనేది నిరూపించారు. గణభోగ్యగా మారమని తండ్రి చేత పలికించకుండా ఔచిత్యాన్ని కాపాడారు.

లాల్లదేవిగారి నవలలో తల్లిదండ్రులు చనిపోయిన ఉదాయి, దొంగలచేతిలో పడి, అక్కడ ఉన్న ఒక మంచి దొంగభైరవుని వల్ల వైశాలినీ నగరంలో యశోదేవుని దగ్గరకు చేరుతుంది. విద్యాభ్యాసం చేస్తూ, రాజు 'చేతను' ని దర్శనం కలగటం, ఆమెలోని నైపుణ్యాన్ని గుర్తించి ఆస్థాన నర్తకిగా నియమించి, ఆమ్రవనాన్ని బహూకరించటం చేస్తాడు(పు : 118). ఆనాటి నుండి ఆమ్రపాలి అవుతుంది. ఆమె ఒక నర్తకి తప్ప ఎటువంటి వేశ్యాకాదు. ఉదయునుడు అనే శిల్పిని అభి మానిస్తుంది (పు:89). కానీ అతడు లౌకికవిషయాలంటే ఇష్టంలేనివాడు. బుద్ధుని శిల్పాన్ని ఆమెకి బహుకరించి, ఎక్కడికో వెళ్లిపోయాడు. బుద్ధునివిగ్రహంలో ఉన్న ప్రశాంతతను చూచి, బుద్ధుణ్ణిగురించి తెలుసుకొని ఒక బౌద్ధ సన్యాసికి భిక్షపెట్టాలనుకొంటుంది. కానీ ధనస్వామి ఆమ్రపాలి ఒక వేశ్య అనీ, ఆ ఇంటిలో భిక్షస్వీకరించవద్దని వారించటంతో, ఆతని మాటలు నమ్మి భిక్షువు ఆమె భిక్షను తిరస్కరించి వెళ్లిపోతాడు(పు: 165). ఆనాటినుండి వేశ్య అంటే ఎవరో, ఆ జీవితమెలా ఉంటుందోనని ఆలోచిస్తూ తీవ్రవేదనకు గురౌతూ, ఆమెకి తెలియకుండానే వేశ్యలు నివసించే స్థలానికి పోవటం, అక్కడ కొంతమంది మూర్ఖులవల్లరాజుగారి దగ్గరకు తీసుకొని రావటం, నర్తకి పదవి పోవటం రాజ్య బహిష్కరంచేయటం చేస్తారు[76]. ఆమె నేరం చేసినట్లు భావించకుండానే, బుద్ధుని రాకకోసమే నిరీక్షిస్తూ, బుద్ధుడు వైశాలినీ నగరానికి రావటంతో భిక్షనుపెట్టి బౌద్ధసన్యాసినిగా మారిపోతుంది.(పు : 223)

కరుటూరి వారు ఆమ్రపాలి బౌద్ధభిక్షువుగా మారటాన్ని చాలా నాటకీయగా చిత్రించారు. కొడుకు విమలకొండ బౌద్ధసన్యాసిగా మారిపోయాడు. ఆమ్రపాలి జీవితం గణభోగ్యగా మారిపోవటం తండ్రి శాక్యధనికుడు చనిపోవటంతో ఆనందుడు బౌద్ధ సన్యాసిగా మారి ఆమ్రపాలివేశ్య అని తెలిస్తే ఆమె కొడుకు విమలుడు బాధపడతాడని మేనమామ ప్రోద్బలంతో బౌద్ధసన్యాసి అవుతాడు. కొడుకుని చూసుకోవచ్చుననే తలంపుతో బుద్ధుని దగ్గరకు వెళ్లి, మాతృహృదయాన్ని ప్రదర్శించి, బుద్ధుడు బోధించిన జీవిత సత్యాల వల్ల ఆమ్రపాలి బౌద్ధసన్యాసినిగా మారినట్లు వర్ణించారు (7-104).

ఈ విధంగా ఆమ్రపాలి ఇతివృత్తంతో వచ్చిన రచనలను తులనాత్మకంగా పరిశీలించినపుడు జ్ఞానానందకవి గారు చక్కని ఔచిత్యపోషణతో,

చారిత్రకసత్యాలను విస్మరించకుండా కావ్యాన్ని వర్ణించిన విషయం తేటతెల్లమవుతుంది. డా.కడియాల రామమోహనరాయ్‌గారు అన్నట్లు *'కథాకావ్య రచనలోకథను ఆదిమధ్యాంతాలుగా విభజించటంలో కవి మిక్కిలి నేర్పునుచూపారు'*[77]. సంప్రదాయ కవిత్వంలో ఆధునికతను[78] వ్యక్తం చేయటంలోకూడా జ్ఞానానందకవి రాసిన ఆమ్రపాలి విశిష్టమైన దానిగా పేర్కొనవచ్చునని కావ్యా పరిశీలన వలన తెలుస్తుంది.

# ఏడవ అధ్యాయం

# ముగింపు

## 7.ముగింపు

డా॥యస్.టి. జ్ఞానానందకవి గారు బౌద్ధజాతక కథల్లోని ఆమ్రపాలి కథను తెలుగువారికి కావ్యంగా అందించారు. సంప్రదాయ పద్య కవిత్వంలో ఆధునిక భావాలతో రచించిన ఈ కావ్య వైశిష్ట్యాన్ని **జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన** అనే పరిశోధనాంశంతో అధ్యయనాన్ని కొనసాగించాను.

**మొదటి అధ్యాయంలో** కవిపరిచయాన్ని, వారికి మేనమామ ప్రేరణ వలన సంక్రమించిన సాహిత్యాభిలాషను, జాతీయ, దేశభక్తి, మానవత్వాలతో కూడిన సాహితీ దృక్పథాన్ని సంక్షిప్తంగా వివరించాను. సాహితీ వ్యక్తిత్వం కావ్యనిర్మాణంలో ప్రధాన ప్రభావాన్ని చూపిస్తుందని తెలిసింది.

**రెండవ అధ్యాయంలో** కావ్య స్వరూప స్వభావాలను పరిశీలిస్తూ పద్యకావ్యమైన ఆమ్రపాలి దేశ, కాల వస్తువులు చారిత్రకమైనవేనని చారిత్రక కావ్యాల్లోనే చేరుతుందని, ఇది షోడషమహజన పథాలకు చెందిన వైశాలినీ నగర రాజ్యంలో జరిగిన కథ అనీ చారిత్రక ఆధారలతో నిరూపితమైంది. బుద్ధుడు బోధించిన అష్టాంగ మార్గానికి అనుగుణంగా, దాన్ని దృష్టిలో పెట్టుకొని కావ్యాన్ని ఎనిమిది ఆశ్వాశాలుగా విభజించారని ప్రతిపాదించి సమన్వయించాను. ఆమ్రపాలి మూలకథ దేనినుండీ గ్రహించలేదనీ, మిత్రులు చెప్పిన కథను ఆధారం చేసుకొని కావ్యాన్ని రాశాననీ కవి చెప్పినా, క్షేమేంద్రుని బోధిసత్వావధాన కల్పలతలో ఆమ్రపాల్యావదానానికి దగ్గరగా కథ ఉండటం, లభ్యమవుతున్న ఆమ్రపాలి

మూలకథల్లో దాన్నే ప్రామాణికంగా చాలామంది భావించటం వల్ల, కవి చేసిన మార్పులను, వాటిలోగల ఔచిత్యాన్ని చర్చించి తులనాత్మకంగా విశ్లేషించాను. కావ్యేతివృత్త సారాంశాన్ని ఆశ్వాసక్రమంలో అధ్యయనానికి అనుగుణంగా వ్యవస్థీకృతంగా పేర్కొన్నారు.

**మూడవ అధ్యాయంలో** కావ్యానికి పాత్రపోషణ ఆవశ్యకతను తెలియజేస్తూ, కవి తీర్చిదిద్దిన పాత్రలను ప్రాధాన్య క్రమంలో పరిశీలించాను. కవిచూపిన నేర్పులను, మలిచిన విధానాన్ని పేర్కొన్నాను. ప్రధాన పాత్రలైన ఆమ్రపాలి, బుద్ధుడు, బింబిసారుల గురించి విస్తృతమైనా, వివరంగా విశ్లేషణ చేయాటానికే ప్రయత్నించాను. ఆమ్రపాలి, బుద్ధుడు కావ్య నాయికా నాయకులు అవుతారనీ, ఐతే సాధారణంగా శృంగారబంధాన్ని కలిగిన వారే కావ్య నాయికా నాయకులు కానవసరంలేదని కావ్య పాత్రపోషణ వలన తేలిన విషయం. గణతంత్ర రాజ్యంలో స్త్రీ పరిస్థతి, అందమైన యువతి అయితే ఆమె రాకుమార్తె ఐనా ఏవిధంగా పరిగణించేవారో, సామాజిక, రాజకీయ పరిస్థితుల వల్ల తేటతెల్లమయ్యింది. వేశ్యకు సమాజం ఇచ్చే గౌరవ మర్యాదలు ఎలా ఉంటాయో ఆమ్రపాలి పాత్ర ద్వారా నిరూపిత మైయ్యాయి. వేశ్యకుకూడా మనసు ఉంటుందనీ ఆమ్రపాలి పాత్రవలన తెలిసిన సత్యాలు. బౌద్ధమత నియమాలు ఆమెను ఆకర్షించటం, భిక్షువుగా మారిన పరిస్థితులను వివరించాను. బింబిసారునిలో కొన్ని అవలక్షణాలను ఉండటంవల్ల కావ్యనాయకుని అర్హత కోల్పోయాడనీ, కవి కథన కౌశలంలో భాగంగానే ఆపాత్ర పోషణ జరిగిందనీ కావ్యంతో సమన్వయించగలిగానని భావిస్తున్నాను. లిచ్ఛవులు తమ గుణ గణాలవల్ల వారిని 'దుర్మార్గుల సామూహిక పాత్ర' గా పేర్కొన్నాను. నెమలి పాత్ర ఆమ్రపాలి ప్రజల సానుభూతికి చక్కని పోషకమైందని, మిగిలిన పాత్రలుకూడా ఇతివృత్త నిర్వహణకు, కావ్య రమణీయతకు తోడ్పడిన విధానం, పాత్రపోషణలోని ఔచిత్యాన్ని వింగడించాను.

**నాల్గవ అధ్యాయంలో** కావ్యానికి ఉండవలసిన వర్ణనలను, అవి కావ్యానికి ఉపయోగించిన తీరును పరిశీలించాను. వైశాలినీ, మగధరాజ్యాల పురవర్ణనలో బింబిసారుడు వైశాలినీ నగర ప్రవేశం చేసినపుడు, దుర్మార్గులైన లిచ్ఛవులపట్ల ప్రకృతి స్పందించిన తీరుని విశ్లేషించాను. దీనికి తోడుగా మిగిలిన కొన్ని కావ్యాల్లో వర్ణితమైన ప్రకృతి వర్ణను కూడా తులనాత్మకంగా పరిశీలించి చూపాను. బుద్ధుని పునరాగమనానికి ప్రజల మనోభిప్రాయాలను ఆవిష్కరించడానిక ప్రయత్నించాను. ఇంకా కావ్యంలోగల సూర్యాస్తమయ, చంద్రోదయ, స్వయంవర, ప్రణయ,

పుత్రోదయ, వర్ష ఋతు వర్ణనలను విశ్లేషించి అవి కావ్యానికి తోడ్పడిన విధానాన్ని వివరించాను. దీనితోపాటు కావ్యంలో గల రూపచిత్రణ, మనస్తత్వ చిత్రణలను పరిశీలించాను. భాషాప్రయోగంలో సరళమైన భాషను ప్రయోగించారనేది స్థాలీపులాక న్యాయంగా చేసిన భాషా పరిశీలన వల్ల తేలిందని భావిస్తున్నాను. ఈ అంశాలతో ప్రత్యేకమైన పరిశోధనయే జరగాలని అనిపించింది. భావానికి, సన్నివేశానికి తగినట్లు వృత్తౌచిత్యాన్ని పాటించిన విషయం ఛందస్సు పరిశీలన వలన తేలింది. ఇది ఇంకా యతి, గణ ప్రాధాన్యాన్ని వివరిస్తూ ప్రత్యేక పరిశీలనే చేయవలసి ఉందనిపించింది. రసపోషణలో శాంతాన్ని ప్రధాన (అంగి) రసంగాను, కరుణ, శృంగారాలను తరువాతి (అంగ) రసాలుగాను నిర్వహించారని స్పష్టంచేయటానికి ప్రయత్నించాను. నా పరిశీలనలో అలాగే తేలింది.

**అయిదవ అధ్యాయంలో** బౌద్ధ దర్శనాన్ని సమన్వయం చేసినపుడు, బుద్ధుని బోధనలు, ఆయన బోధించిన ఆర్యసత్యాలు, అష్టాంగమార్గం, త్రిరత్నాలు కావ్యంలో ఆవిష్కృతమైయ్యాయి. ఈ అధ్యాయంలో జరిగిన తాత్త్విక చర్చను బట్టి ఆమ్రపాలి కావ్యంలో కొన్నిచారిత్రక తత్త్వకావ్యలక్షణాలు ఉన్నాయని వెల్లడయ్యింది.

**ఆరవ అధ్యాయంలో** బౌద్ధేతివృత్త కావ్యాలను పేర్కొని, బౌద్ధ జాతక కథల్లో ఆమ్రపాలి వస్తువుగా వచ్చిన కావ్యాలను తులనాత్మకంగా విశ్లేషించటం వలన జ్ఞానానందకవి ఆమ్రపాలి కావ్యం చక్కని ఔచిత్య పోషణతో వర్ణితమైందనీ, చారిత్రక ఆధారతలంపైనే కావ్యనిర్మాణం కొనసాగిందని తేలింది. ఇతివృత్తంతోనే కాకుండా మిగిలిన అంశాలతో కూడా తులనాత్మక పరిశీలన చేయవచ్చునని అనిపించింది.

ఈ విధంగా సాగిన జ్ఞానానంద కవి గారి ఆమ్రపాలి కావ్య పరిశీలన పరిశోధన వ్యాసం వల్ల పై అంశాలు వెల్లడి అయినా, వీటితో పాటు అనుబంధంలో కవి వ్యక్తిత్వం, సాహిత్య పరమైన విషయాలు, కావ్యానికి సంబంధించిన మరికొన్ని విశేషాలు స్పష్టమవుతున్నాయి. పరిశోధన అంతా సత్యాన్వేషణ దృష్టితోనే కొనసాగించడానికి ప్రయత్నించాను.



# అనుబంధం

## (అ) డా॥ యస్ .టి. జ్ఞానానంద కవి గారి రచనలు : బిరుదులు:

తరంగవరాల (1944), వసంతగానం (1947), గాంధీ (అమరగీతం,1950), దేశబంధు (1956), పాంచజన్యం (1956), ప్రభంజనం (1959), పర్జన్యం ( తొలిభాగం, 1959), గోల్కొండ (1963), క్రీస్తు శతకం (1963), క్రీస్తు చరిత్ర (వచనం, 1963), విజయాభిషేకం (1966), పర్జన్యం (మలిభాగం, 1969) అక్షరాభిషేకం (1971), ఆమ్రపాలి (1972), అక్షరాక్షతలు (1973), అక్షర గుచ్ఛము (1975), వెలుగు బాట (1976), క్రీస్తు ప్రబంధం (తొలిభాగం,1977), నా జీవిత గాథ (తొలిభాగం,1977), అక్షర పూజ (1979), హరిజనులు అంటరానివారా? (1980), పిల్లనగ్రోవి (1982), రాజధాని (1987), కూలీ నుండి కళాప్రపూర్ణ వరకూ (1988), వంశధార (1991), ది విజన్ ఇన్ ద వెర్సెస్ ఆఫ్ డా॥ జ్ఞానానంద కవి (1990), ఆహ్వానము (1993), షెడ్యూలు కులాలు అంటరానివా?(1997), ధర్మాగ్రహము (1998) మరికొన్ని ఆముద్రిత రచనలు కూడా ఉన్నాయి.

వీరి బిరుదులు : కవితా విశారద, కవికోకిల, కవిలోక విభూషణ, విద్వత్కవి చూడామణి, సాహితీ వల్లభ, అభినవ జాషువా, సాహితీ కృషీవల, కవితా శ్రీనాథ, పద్యవిద్యాప్రభువు మొదలైన బిరుదులు ఉన్నాయి.

ఇంకా ఆంధ్రవిశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ కళాప్రపూర్ణను 1974లో ఇచ్చింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతిని 'ఆమ్రపాలి' కావ్యానికి 1975లో అందుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వీరికి ఉత్తమ పండితోపాధ్యాయ బహుమతినిచ్చి సత్కరించింది. తెలుగు విశ్వవిద్యాలయం సృజనాత్మక సాహిత్యానికిచ్చే బెజవాడ పట్టాభి రామిరెడ్డి పురస్కారం 1989లో ఇచ్చి, కవిని సన్మానించింది. తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డిలిట్‌ను 1996లో ప్రదానం చేసింది.

వీరి ఆమ్రపాలి కావ్యాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం 1972-74 సంవత్సరాలలో బి.ఎస్సీ వారికి పాఠ్యాంశంగా కూడా నిర్ణయించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం PDC విద్యార్థులకు, మైసూరు విశ్వవిద్యాలయం B.Ed విద్యార్థులకు కూడా ఆమ్రపాలి కావ్యాన్ని పాఠ్యంశంగా బోధించాయి.

# (ఆ) డా॥ జ్ఞానానంద కవిగారితో ముఖాముఖి



డా. యస్. టి. జ్ఞానానంద కవి గారితో ద్వార్ల వెంకటేశ్వరరావు

నా పరిశోధనకు సంబంధించిన 'ఆమ్రపాలి' కావ్య విశేషాలూ కవిగారి సాహితీ వ్యక్తిత్వాలను తెలుసుకోవడానికి కాకినాడ వెళ్లి వారితో స్వయంగా ఇంటర్వ్యూ చేసిన విశేషాలను నా పరిశోధనకు అవసరం మేరకే ఇక్కడ పేర్కొంటున్నాను.

ప్రశ్న : వివిధ మతాలకు చెందిన రచనలను ఎన్నింటినో రాసిన మీరు బౌద్ధేతివృత్త ఆమ్రపాలి కావ్యాన్ని రాయాలనే మీ ఆలోచనకు ప్రేరణ ఏమిటి?

జ : ఎన్నో ఆశలు కలిగిన యువతిని ఒక పిచ్చి సంఘం నాశనం చేయాలని ప్రయత్నిస్తే మరో మంచి సంఘం ఆమెను సన్మార్గంలోకి నడిపించడానికి దోహదపడింది. ఆ సంఘమే బౌద్ధ భిక్షుక సంఘం. బుద్ధుని ఆశయాలతో నిర్మితమైన సంఘం. నేనొకసారి ఢిల్లీలో ఒక సాహితీ సమావేశానికి తెలుగు ప్రతినిధిగా హాజరైనప్పుడు 'పతంజలి' అనే సాహితీ మిత్రుడు బౌద్ధ జాతక కథల్లోని ఆమ్రపాలి కథను గురించి చర్చించారు. అది విన్న తరువాత అటువంటి వాళ్లు సమాజంలో ఎంతో మంది కనిపిస్తున్నారు కదా అనిపించింది. నిరాశా నిస్పృహలకు లోను కావటం కంటే మిగిలిన జీవితాన్నైనా సక్రమ మార్గంగా తీర్చి దిద్దుకునే మార్గాలు ఎన్నో ఉన్నాయి. వాటిని స్ఫురింపజేస్తూ, బుద్ధుని తత్వాన్ని జోడించి ఒక కావ్యాన్ని రాయాలనిపించింది.

ప్రశ్న : ఈ కావ్యానికి మూలకథను ఏ గ్రంథం నుండి తీసుకున్నారో చెబుతారా?

జ : మూల గ్రంథమంటూ దేన్నీ చూడలేదు. స్నేహితుడు చర్చించిన కథను గుర్తు చేసుకొని దానికి సంబంధించిన చరిత్ర గ్రంథాలను పరిశీలించి నాదైన రీతిలో ఆమ్రపాలి కావ్యాన్ని రాశాను.

ప్రశ్న : కావ్యాన్ని పూర్తి చేయడానికి ఎంత కాలం పట్టింది?

జ : నలభై ఎనిమిది గంటలు పట్టిందా కావ్యం రాయడానికి ! అంటే తెలుగు పండితునిగా ఉద్యోగం చేస్తున్నాను. కాబట్టి ఖాళీ దొరికినప్పుడల్లా రోజుకి రెండు గంటల చొప్పున

నలభైఎనిమిది గంటల్లో రాశాను. ఇంకా ముందే రాసేయవచ్చు. కానీ కవి 'సమాధి' లోకి వెళ్లి రాసిందే పద్యమైనా, వచనమైనా కవిత్వమౌతుంది. అలాకాకపోతే పద్యాల్లో ఉండేవి కేవలం గణాలు ప్రాసలు, ఛందస్సుల భాహ్య స్వరూపం మాత్రమే. కవిత్వమున్నప్పుడు లయబద్ధంగా పద్యం సాగినప్పుడు పద్యానికీ ఆ సాహిత్యానికీ 'జీవితం' ఉంటుంది. దానివల్ల శాశ్వతత్వం సిద్ధిస్తుంది.

ప్రశ్న : *ఆమ్రపాలి కావ్యంలో 'నెమలి పునర్జన్మ' గురించి చెప్పారు కదా! కర్మ సిద్ధాతం పట్ల మీ అభిప్రాయం తెలుపుతారా?*

జ : నా దృష్టిలో , ఈ జన్మలో ఏ పనులు చేస్తుంటామో, దానకి మనం ఫలితం కోసం ఎదురు చూడకపోయినా ఏదొక రూపంలో ఈ జన్మలోనే అది కనిపిస్తుంటుంది. అంతేకానీ, ఈ జన్మలో కలిగే ప్రతీ సుఖ దుఃఖాలకు గత జన్మలో చేసుకొన్న కర్మ ఫలితం కారణం కాదు. కర్మ సిద్ధాంతం రెండు మూడు మాటల్లో చెప్పేస్తే అయ్యేది కాదు. ఆమ్రపాలి కావ్యంలో నెమలిజన్మలో కలిగిన ఇంద్రుని శాపం వల్ల తరువాతి జన్మ ఆమ్రపాలిలో కనిపించిందనేది బౌద్ధ జాతక కథలను అనుసరించి చేసిన నా సృజన। దానివల్ల కావ్యానికి చక్కని మలుపు కలుగుతుంది. కావ్యంలోకథకి సంబంధించిన విషయాన్ని చెప్పేటప్పుడు కొన్నిసార్లు అవి కవి వ్యక్తిగత ఇష్టాయిష్టాలతో చెప్పినా అన్ని సార్లూ అలాగే చెప్పాలనేమీ లేదు. కవి వ్యక్తి గత అభిప్రాయంతో ముడి పెట్టాలనీ లేదు.

ప్రశ్న : *సరేసర్! మీ కవిత్వంలో జాతీయత, దేశభక్తి, ఎక్కువగా ప్రతిబింబిస్తుంద నిపిస్తుది. దానికి ప్రధాన కారణమేమిటంటారు?*

జ : చాలా వరకూ సమంజసమైందే మీ పరిశీలన. నేను భారతీయుణ్ణి. ఆ తరువాతే కవిని. బ్రిటిష్ పరిపాలనా కాలంనుండీ సమాజాన్నీ పరిశీలిస్తున్న వాణ్ణి! బ్రిటిష్ వాళ్ళ నాగరికతను అభివృద్ధిచేస్తూనే, సంస్కృతీ వికాసానికి ఆటంకాల్ని కలిగించారు. జాతి జీవనానికి, అస్తిత్వానికి ముఖ్యమైంది సంస్కృతి. దాన్ని నిరంతరం కాపాడటం కోసమే జాతీయత, దేశభక్తిపూరిత రచనలు చేశాను. చేస్తూనే ఉంటాను. ఈ మధ్యనే 'స్వామి వివేకానంద' మీద కావ్యాన్ని రాయాలని తలపెట్టాను కూడా!

భారతీయ సంస్కృతి అనేది ఒకతల్లికి పుట్టిన బిడ్డల్లో వివిధ అలవాట్లు ఉన్నట్లే పలువిధాలుగా ప్రవర్తిల్లుతుంటుంది. అదే భిన్నత్వంలో ఏకత్వం. వ్యవస్థలో కొన్ని లోపాలు ఉన్నంత మాత్రాన వ్యవస్థనంతటినీ దుయ్యబట్టకూడదు. ఈ దేశంలోని గాలి,నీరు, నేలను అన్నింటినీ అనుభ విస్తూనే దేశాన్ని తిట్టవలసిన పనిలేదు అలా చేయటం సరికాదు. నా శరీరంలో, నామాటలో నా ప్రతిరచనలో భారతీయ జీవన సంస్కృతీ ఔన్నత్యం ప్రతిబింబిస్తుంటుంది. దీనిలో రాజీ పడే ప్రసక్తే లేదు.

*'నమస్కారమండీ' అని చెప్పి, వారి నుండి నేను వీడ్కోలు తీసుకొన్నాను.*

# జ్ఞాపికలు (REFERENCES)

## I. డా॥ యస్.టి. జ్ఞానానంద కవి జీవితం సాహిత్యం:


1. శరత్ జ్యోత్స్న ... ి, ఎస్., *డా॥ ఎస్.టి. జ్ఞానానందకవి జీవితం-వాఙ్మయ సూచి*; పు : 2
2. జ్ఞానానంద కవి, ... స్.టి., *కూలీ నుండి కళాప్రపూర్ణ వరకూ*, 1998; పు : 8
3. పైదే పు : 8
4. పైదే పు : 9
5. పైదే పు : 11
6. శరత్ జ్యోత్స్నరా... ఎస్., *డా॥ ఎస్.టి. జ్ఞానానందకవి జీవితం-వాఙ్మయ సూచి*; పు : 11
7. పైదే పు : 12
8. పైదే పు : 6
9. పైదే పు : 13
10. ఆనందారామం, సి., *సమాజ సాహిత్యాలు*, 1987; పు : 24
11. జ్ఞానానంద కవి ఎస్.టి. *ఆహ్వానం*, 1996 (ద్వి.ము); పు : 8
12. శరత్ జ్యోత్స్నరాణి, ఎస్., *డా॥ ...స్.టి. జ్ఞానానందకవి జీవితం-వాఙ్మయ సూచి*; పు : 6
13. జ్ఞానానంద కవి ఎస్.టి. *వర్జ్యం*, 1959; పు : 16
14. జ్ఞానానందకవి,ఎస్.టి. *వెలుగు బాట*, 1976; పు :40
15. జ్ఞానానందకవి,ఎస్.టి. *పాంచజన్యం*,1956; పు : 40
16. పైదే
17. రామమోహనరావు, అద్దేపల్లి –ఆంధ్రజ్యోతి, ది.ప. (వ్యా) 27-8-1988 ; పు: 2
18. సుబ్బారెడ్డి, యమ్., *తెలుగులో జాతీయోద్యమ కవిత్వం*, 1982 ; పు: 62
19. జ్ఞానానంద కవి, ఎస్.టి., *ఆహ్వానం*, 1996, ( ద్వి.ము); పు: 26
20. సత్యనారాయణ మూర్తి, జొన్నల గడ్డ ., *జాతీయత్వము - అంతర్జాతీయత్వము* ; పు : 43
21. జ్ఞానానంద కవి, ఎస్.టి., *ఆహ్వానం*, 1996, ( ద్వి.ము); 1988 పు: 104
22. ***THE VISION IN THE VERSES OF DR. GNANANANDA KAVI***, పు: 7
23. *కూలి నుండి కళాప్రపూర్ణ వరకు*, 1988; పు : 36
24. పైదే పు : 30
25. జ్ఞానానందకవి, ఎస్.టి ., *ఆహ్వానం*, 1996, ( ద్వి.ము); పు: 2
26. జ్ఞానానందకవి, ఎస్.టి., *పాంచజన్యం*, 1956; పు: 34
27. కృపాచారి, గుజ్జర్లమూడి, *తెలుగు సాహిత్యానికి క్రైస్తవుల సేవ*; పు : 242


## II. ఆమ్రపాలి కావ్య స్వరూప స్వభావాలు


28. సోమసుందర్, *జ్ఞానానందకవి కవిత్వంలో జాతీయ భావనా సమృద్ధి* ; (వ్యా) విశాలాంధ్ర ది.ప., 10-4-1997. పు : 2

29. సుబ్రహ్మణ్యం, జి.వి., సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు; 1991; పు : 506
30. పైదే పు : 507
31. 'బౌద్ధ కర్మసిద్ధాంతం, హిందూ కర్మ సిద్ధాతం ఒకలాంటివి కాదు కావడానికి వీలులేదు. కర్మ, ప్రస్తుత జీవితంపై దాని ప్రభావానికి మాత్రమే బౌద్ధ కర్మనియమం వర్తిస్తుంది'' అని డా॥ బి. ఆర్. అంబేద్కర్ భావించారు. – డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు, 'బుద్ధుడు మరియు అతనిధర్మం' (అను) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు, 1994, (సం) జగన్నాథం పేర్వారం; పు : 303
32. బాలరాజు శ్రీ రత్నాకర., బౌద్ధయుగము (మొ॥ వా)., 1960., పు : 76
వీరి అభిప్రాయం :–
'' ఒక జన్మలోని కర్మలు బహుజన్మ పరంపరలకు దారిస్తాయి. అవిద్య నాశనమయ్యే వరకూ ఈజనన మరణ చక్రం తిరుగుతూనే ఉంటుంది''

# III. పాత్రపోషణ

33. నిర్మల, తమ్మారెడ్డి, నన్నెచోడదేవ కుమార సంభవ పరిశీలనము, 1989; పు: 238
34. సుప్రసన్నా చార్య, కోవెల., సహృదయ చక్రము, 1983, పు : 13
35. కథాకథనపద్ధతి :

చన్నాప్రగడ సత్య వెంకటరమణ కుమారి., *'కథాకథనశిల్పము'* అనే గ్రంథంలో కింది విధంగా వివరించారు.

*''కథాకథనమునందు ద్వివిధములయిన శిల్పములుండును. కథాకథనమనునది కవి స్వయముగా చేయవచ్చును లేదా పాత్రల ద్వారా చేయించవచ్చును. సాధారణముగా ప్రధానేతి వృత్తములను, దానికి సంబంధించిన విషయములను కవియే కథకుడుగా నుండి కాలక్రమ పద్ధతిలో కథనము చేయును. ఉపకథారచన యందు మాత్రము ఆయాకథల యందలి పాత్రలనే కవి కథకులులగా కూర్చుచుండును. ఈ ఉపకథా రచనయందు సింహావలోకన పద్ధతిననుసరించి కథా కథనము జరుగుచుండును. ఇక ప్రాపంచికేతి వృత్తములను రచించినపుడు కవియు, తత్సంబంధ ఉద్భోదిత పాత్రలలో నెవరినైనా కథకులుగా వచ్చును.*

*రెండవది – పై దానిని పోషించుచూ కథను రచించుట.*

*ఈ కథారచనను లోకవృత్తాంతముగా కవి సంఘటించవచ్చును. అనగా లోకములో నాకథ ఎట్లు జరిగెనో అదేవిధముగా రచించవచ్చును. లోక స్వభావము నాధారముగా జేసుకొని స్వకపోల కల్పనలతో కూడా కథారచన చేయవచ్చును''* పు :24

36. క్షేమేంద్రుడు, ఔచిత్యవిచారచర్చ, (వ్యాఖ్యా, శ్రీరామచంద్ర, పుల్లెల ) పు : 6

*'' ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్యయత్*
*ఉచిత చయో భావస్త దౌచిత్యం, ప్రచక్షతే –7''*
*యత్కిల యస్యానురూపం తదుచితముచ్యతే తస్య భావమౌచిత్యం కథయన్తి'*
*'పదేవాక్యప్రబన్ధార్థే గుణేల్కి జరణేరసే*
*క్రియా యాం కారక లిఙ్గే వచనే చవిశేషణే – 8*

*ఉపసర్గే నిపాతే చ కాలే దేశే కులే వ్రతే*
*తత్త్వే సత్యే ద్వ్యభిప్రాయే స్వభావే సారసజ్ఞేహి - 9*
*ప్రతిభాయా మవస్థాయాం విచారే నామ్న్యధాశిషి*
*కావ్యస్యాజ్ఞేషు చప్రాహురౌచిత్యం వ్యాపి జీవితమ్ - 10.*

37. సత్యనారాయణ, విశ్వనాథ, *శ్రీమద్రామాయణ కల్పవృక్షం - శిల్పదృష్టి* (వ్యా) పు : 11
38. గంగప్ప, ఎస్, *సాహిత్య సుధ,* 1981 పు: 125
39. సత్యనారాయణ శాస్త్రి, మధునాపంతుల, (వ్యాఖ్యా) *'శకుంతలోపాఖ్యానం'* (వ్యా) పు:243
40. ***The Encyclopedio of philosophy***., Vol.2., Pg:417
41. Cowell, E.B., Ed., ***Stories of the Budha's Former Births,*** Pg:Vii
42. నన్నయ, *శ్రీమదాంధ్ర మహాభారతము,* పు:93·

*''గానకాని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే*
*కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె సాధ్విస .*
*ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా*
*వినిచె ధరాధి నాథునకు విస్మయమందగఁ దత్సభాసదుల్''*

- ( ఆంధ్ర - ఆది - చతు : 104

43. కాళిదాసు, అభిజ్ఞాన శాకుంతలమ్, 1984 ; పు : 81
44. పైదే పు : 43
45. సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానము., (వి.క), క్యా. సం. 1976; పు : 259

*'పద్యైశ్చ పంచభిర్యుక్త ప్రోక్తా పంచాననావలీ'*
*అయిదు పద్యముల కావ్యము 'పంచాననావలి' అనబడును.*
*దీనికి 'పంచరత్నములు' అని నేటికీ వ్యవహారము.*

46. వీరభద్రయ్య, ముదిగొండ., *వందేమాతరం (వస్తు, శిల్పాల విమర్శ)*, 1996 ; పు : 17

# IV. ఆమ్రపాలి కావ్య రచనా వైశిష్ట్యం.

47. హనుమంతరావు, పొన్నెకంటి., *మహాకవి ధూర్జటి కవిత్వము - వ్యక్తిత్వము,* పు : 310
48. విశ్వేశ్వరశాస్త్రి, కొత్తపల్లి., *రామాభ్యుదయవైభవము,* పు :206
49. సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానము, (వికి), (కావ్య.సం) పు: 123
50. లక్ష్మీకాంతం, పింగళి., *ఆంధ్రసాహిత్య చరిత్ర, 1979 ;* పు : 133
51. వీరభద్రయ్య ముదిగొండ., *కళాతత్వశాస్త్రము, 1993 ;* పు 94

*''దృశ్య, శ్రవ్య స్పర్శాదుల చేత గతంలో కల్గిన కొన్ని జ్ఞానేంద్రియాను భూతులను మనస్సులో స్మృతి ద్వారా పునరుత్పాదించటమే భావ చిత్రం'' అని* ***Ronald Peacock*** *అన్నాడని 'కళాతత్వ శాస్త్రం'లో వీరభద్రయ్యగారు వివరించారు. దీన్ని మరింత వివరిస్తూ - భావచిత్రానికి నాయకుడైన ఎజ్రాపౌండ్ నిర్వచనాన్ని సంక్షిప్తంగా స్పష్టీకరించారు - '' ఒక త్రుటికాలంలో బౌద్ధిక ఆవేశాల సంసర్గాన్ని ప్రతిపాదించేదే భావచిత్రం. ఈ సంసర్గం హఠాత్తుగా ఒక స్వేచ్ఛను ప్రసాదిస్తుంది.*

స్థలకాలాల నుంచి స్వేచ్ఛనిస్తుంది. గొప్ప కళాకృతుల సమక్షంలో మనకు అనుభవమయ్యే ఔన్నత్యభావం కల్గుతుంది. ''పుట (101)'' భావ చిత్రానికి అలంకారం పునాదే కాని అలంకరణ దాని లక్ష్యం కాదు. భావ చిత్రంలో Unification of disparate Ideas ఉంటుంది.'' పు : 99

52. నన్నయ. *శ్రీమదాంధ్ర మహాభారతము,* తె.వి.వి.'; పు : 85
53. శేషేంద్రశర్మ, గుంటూరు, *కవిసేనమేనిఫెస్టో, 1992 ;* పు : 80
54. రామకృష్ణమాచార్య, నండూరి, *తెలుగు పద్య శిల్పం, 1995 ;* పు : 75
55. శరత్ జ్యోత్స్న రాణి, ఎస్., *డా॥ ఎస్. టి. జ్ఞానానంద కవి జీవితం-వాఙ్మయసూచి ;* పు : 50
56. రామనరసింహం, పరిమి., *ఆంధ్రమహాభారత శైలీ పరిశీలనం ;* పు : 81
57. మంగమ్మ, బి. *తిక్కన నాటకీయ శిల్పము, 1985 ;* పు : 54
58. సత్యనారాయణ, విశ్వనాథ, *నన్నయ ప్రసన్న కథాకవితార్థయుక్తి,* పు : 23
59. క్షేమేంద్రుడు, *సువృత్తతిలకం,* (వ్యా) శ్రీరామచంద్ర, పుల్లెల ; పు : 277
60. మంగమ్మ, బి. *తిక్కన నాటకీయ శిల్పము, 1985 ;* పు : 313
61. సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానము, (వివ), (కావ్య.సం) ; పు : 116
62. శరత్ జ్యోత్స్న రాణి, ఎస్., *డా॥ ఎస్. టి. జ్ఞానానందకవి జీవితం వాఙ్మయసూచి;* పు : 39
63. సత్యనారాయణ, విశ్వనాథ, జ్ఞానానంద కవి గారి *'అక్షరపూజ'కి రాసిన ముందుమాట,* పు:47
64. సుబ్రహ్మణ్యం, జి.వి., *కొలమానమ్,* (సం). ఎన్. గోపి. 1995 ; పు : 130
65. శరత్ జ్యోత్స్న రాణి, ఎస్., *డా॥ ఎస్. టి. జ్ఞానానందకవి జీవితం వాఙ్మయసూచి,* గ్రంథానికి డా॥ కె.కె. రంగనాథాచార్యులు గారు రాసిన *'అభిప్రాయం'* పు : XVii
66. సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానము, (వి.క), (కావ్యా. సం) పు : 303

## V. బౌద్ధ దర్శనం

67. బాలరాజు శ్రీ రత్నాకర., *బౌద్ధయుగము* (మొ.వా.) పు:67
68. *విజ్ఞాన సర్వసం* (నా.సం.) 1992, తె.వి.వి. పు:70
69. సుబ్రహ్మణ్యం, జి.వి. *సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు, 1991;* పు : 507
70. బాలరాజు శ్రీ రత్నాకర., *బౌద్ధయుగము* (మొ.వా), 1960; పు :74
71. పైదే పు : 86
72. Trevor, ***The Buddha, 1973;*** pg:140

## *VI.* తులనాత్మక పరిశీలన :

73. సుబ్రహ్మణ్యం జి.వి., *ముత్యాల ముచ్చట్లు, 1996;* పు : 93
74. సత్యనారాయణ, కరుటూరి, ఆమ్రపాలి, 1980 (6ము.) పు: 4
75. పైదే పు : 47
76. లల్లాదేవి, *ఆమ్రపాలి,* 1983 పు : 118
77. రామమోహన రాయ్, కడియాల, *తెలుగు కవితా వికాసం, 1982;* పు : 170
78. రంగనాథ చార్యులు కె.కె. *ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు* 1982, వీరు ఆధునికతను కింది విధంగా వివరించారు. పు :V
*'ఆధునికత అనేది కాలాన్ని సూచించేది కాదు. అది ఒక తత్త్వం'.*

★★★

# సంకేతాల పట్టిక

| | | |
|---|---|---|
| అను | = | అనువాదము |
| ఆంధ్ర | = | ఆంధ్రమహాభారతము |
| అధ్యా | = | అధ్యాయం |
| ఆది | = | ఆదిపర్వం |
| కావ్యా. సం | = | కావ్యాలంకార సంగ్రహం |
| క్రీ. పూ. | = | క్రీస్తుకు పూర్వం |
| చతు | = | చతుర్థాశ్వాసం |
| చూ | = | చూడు |
| డా॥ | = | డాక్టర్ |
| తె. వి. వి. | = | తెలుగు విశ్వవిద్యాలయం |
| ది. ప. | = | దిన పత్రిక |
| ద్వి. ము | = | ద్వితీయ ముద్రణ |
| నా. సం | = | నాలుగవ సంపుటి |
| ప్ర. సం | = | ప్రథమ సంపుటి |
| పు | = | పుట |
| మా. ప | = | మాసపత్రిక |
| ము. | = | ముద్రణ |
| మూ | = | మూలం |
| మొ. వా | = | మొదటి వ్యాల్యూం |
| ర. ప | = | రసజ్ఞశ్రీ పబ్లికేషన్స్ |
| వ్యా | = | వ్యాసం |
| వ్యాఖ్యా | = | వ్యాఖ్యానం |
| వ్యా. సం. | = | వ్యాస సంపుటి |
| వి. క | = | వివరణ కర్త |
| సం. క | = | సంకలనం |
| సం | = | సంపాదకులు |
| స్వం. ప్ర | - | స్వంత ప్రచురణ |
| ed | = | Editor |
| pg | = | page |
| vol. | = | volume |

★★★

# ఉపయుక్త గ్రంథ సూచిక

## తెలుగు


1. ఆనందారామం, సి. 1987: **సమాజ సాహిత్యాలు.**
హైదరాబాద్ : యం. శేషాచలం అండ్ కంపెనీ.

2. కృపాచారి, గుజ్జర్లమూడి. 1988: **తెలుగు సాహిత్యానికి క్రైస్తవులసేవ.**
నాగార్జుననగర్ : స్వంతప్రచురణలు.

3. కాళిదాసు. 1984: **అభిజ్ఞానశాకుంతలమ్.**
రాజమండ్రి : శ్రీ కిరణ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

4. కృష్ణమూర్తి భద్రిరాజు, (సం)1985 : **తెలుగు భాషా చరిత్ర**
హైదరాబాదు : తెలుగు విశ్వ విద్యాలయం

5. గంగప్ప, ఎస్. 1981 : **సాహిత్యసుధ (వ్యా.సం.)**
గుంటూరు. శశీప్రచురణలు.

6. జ్ఞానానందకవి, యస్.టి. 1986 : **ఆమ్రపాలి.** మొదటిముద్రణ:1972.
కాకినాడ : రసజ్ఞశ్రీ పబ్లికేషన్స్

7. ______ 1996: **ఆహ్వానం.** కాకినాడ: ర.ప.( ద్వి.ము)

8. ______ 1959: **పర్జన్యం.** కాకినాడ : ర.ప.

9. ______ 1956: **పాంచజన్యం** కాకినాడ: ర.ప.

10. ______ 1988 : **కూలీ నుంచి కళాప్రపూర్ణవరకు** . ర.ప

11. ______ 1979 : **అక్షరపూజ** కాకినాడ : ర.ప.

12. జగన్నాథం, పేర్వారం. 1994 : (సం), **బుద్ధుడు మరియు అతనిధమ్మం**
(మూ) డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు.
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు.

13. నన్నయ. **శ్రీమదాంధ్రమహాభారతం.** ( ప్ర.సం)
హైదరాబాదు : తెలుగు విశ్వవిద్యాలయం.

14. నిర్మల, తమ్మారెడ్డి, 1989: **నన్నెచోడదేవకుమారసంభవపరిశీలనం.**
విజయవాడ : సత్యసూర్య ప్రచురణలు.

15. పురుషోత్తం, బొడ్డుపల్లి 1987 : **భాషాశాస్త్ర పరిచయము**
నరసరావు పేట : స్టూడెంట్స్ ఫ్రెండ్స్ ప్రచురణ

16. బాలరాజు, శ్రీ రత్నాకర. 1960 : **బౌద్ధయుగము.** (మొ.వా).
రాజమండ్రి : కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్.

17. మంగమ్మ, బి. 1985: **తిక్కననాటకీయశిల్పము**(విరాటపర్వము)
కర్నూలు : స్వంతప్రచురణ.

18. రంగనాథాచార్యులు,కె.కె.1982:**ఆధునికతెలుగుసాహిత్యంలోవిభిన్నధోరణులు.**
హైదరాబాద్ : ఆంధ్రసాహిత్య పరిషత్తు.
19. రాధాకృష్ణ, బూదరాజు 1985 : **భాష - శైలీ నియమావళి.**
హైదరాబాదు : తెలుగు అకాడమీ.
20. ________________ 1981 : **ఈనాడు భాషా స్వరూపం**
హైదరాబాదు : ఉషోదయ పబ్లికేషన్స్ ప్రైవేట్ లిమిటెడ్
21. రామనరసింహం, పరిమి. 1996 : **ఆంధ్రమహాభారతశైలీపరిశీలనం.**
హైదరాబాదు : పరవాక్ ప్రచురణలు.
22. రామరావు, చేకూరి. 1975 : **తెలుగు వాక్యం.**
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.
23. రామమోహనరాయ్, కడియాల. 1982: **తెలుగు కవితా వికాసం.**
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.
24. రామకృష్ణమాచార్య, నండూరి. 1995 : **తెలుగుపద్యశిల్పం.**
సికింద్రాబాద్ : చారి అండ్ కంపెనీ
25. లక్ష్మీకాంతం, పింగళి, 1979 : **ఆంధ్రసాహిత్య చరిత్ర**
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.
26. లల్లాదేవి, 1983 : **ఆమ్రపాలి**
హైదరాబాదు : విశాలాంధ్ర బుక్ హౌస్
27. **విజ్ఞానసర్వస్వం.** (నా. సం) 1992 : **'దర్శనములు -మతములు'**(అద్యా)
పుల్లెల శ్రీరామచంద్రుడు హైదరాబాదు : తి.వి.వి.
28. విశ్వేశ్వరశాస్త్రి, కొత్తపల్లి 1985 : **రామాభ్యుదయ వైభవము**
విజయవాడ : స్వంతప్రచురణలు
29. వీరభద్రయ్య, ముదిగొండ. 1993 : **కళాతత్వశాస్త్రం మౌలికాంశవివేచన.**
హైదరాబాదు : జాతీయ సాహిత్య పరిషత్
30. 1996 : **జాతీయకావ్యేతిహాసం'వందేమాతరం'**
హైదరాబాదు : జాతీయ సాహిత్యపరిషత్.
31. శరత్ జ్యోత్స్నారాణి,ఎస్.1994:**డా ఎస్.టి.జ్ఞానానందకవిజీవితంవాఙ్మయసూచి.**
హైదరాబాదు : స్వంత ప్రచురణలు
32. శ్రీరామచంద్రుడు, పుల్లెల(వ్యాఖ్యా)1983:**ఔచిత్యవిచారచర్చ**(మూ)క్షేమేంద్రుడు.
హైదరాబాదు :సురభారతి.
33. శ్రీరామచంద్ర, తిరుమల (అను). 1963 **క్షేమేంద్రుని బోధిసత్వావదాన కల్పలత.**
రాజమహేంద్రవరము : అద్దేపల్లి అండ్ కో.

34. శేషేంద్రశర్మ, గుంటూరు. 1992 : **కవిసేనమేనిఫెస్టో.**
హైదరాబాదు : ఇండియన్ లాంగ్వేజెస్ ఫోరమ్.
35. సత్యనారాయణ శాస్త్రి, మధునాపంతుల. 1983 : **'ప్రసన్న కథావిపంచి'** (సం.క) **శకుంతలోపాఖ్యానం** (వ్యాఖ్యా).
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.
36. సత్యనారాయణ, కరుటూరి. 1980 : **ఆమ్రపాలి.** రాజమండ్రి. స్వం.ప్ర.
37. సత్యనారాయణ, విశ్వనాథ. **శ్రీమద్రామాయణ కల్పవృక్షం శిల్పదృష్టి** (వ్యాఖ్యా) నవభారతి (1958-60)
38. 1954 : **నన్నయ గారి ప్రసన్న కథా కవితార్థ యుక్తి.**
విజయవాడ : స్వంత ప్రచురణ
39. సత్యవెంకటరమణ కుమారి, చన్నాప్రగడ. 1987 : **శ్రీమద్రామాయణ కల్పవృక్షమున బాలకాండమునందలి కథాకథనశిల్పము.**
రాజమండ్రి : శ్రీ సూర్య నారాయణ గ్రంథమాల
40. సీతా కల్యాణి, వి. 1990 : **తెలుగు చారిత్రక కావ్యములు**
హైదరాబాదు : స్వంత ప్రచురణలు
41. సీతారామాచార్యులు, బహుజనపల్లి 1988 : **శబ్దార్థత్నాకరము**( నిఘంటువు)
న్యూఢిల్లీ : ఆసియన్ ఎడ్యుకేషనల్ సర్వీస్
42. సుబ్బారెడ్డి, యమ్. 1982 : **తెలుగులో జాతీయోధ్యమ కవిత్వం.**
తిరుపతి : రాగసుధ పబ్లికేషన్స్
43. సుబ్రహ్మణ్యం, జి.వి. 1995 : **కొలమానమ్** (సం) ఆచార్య ఎన్. గోపి.
హైదరాబాదు : యువ భారతి ప్రచురణ
44. 1991 : **సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు**
హైదరాబాదు : తెలుగు అకాడమీ.
45. 1961 : **వీరరసము** ( ఆంధ్రసారస్వతము)
సికింద్రాబాదు : అజంత ప్రింటర్స్.
46. 1996 : **ముత్యాల ముచ్చట్లు.**
హైదరాబాదు : ఆచార్య జీవియస్ షష్టిపూర్తి ప్రచురణలు.
47. సుప్రసన్నాచార్యులు; కోవెల.1983 : **సహృదయ చక్రము.**
వరంగల్లు : శ్రావణి ప్రచురణలు.
48. సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానం. (వి.వ.) 1976 : **కావ్యాలంకార సంగ్రహము.** (మూ) రామరాజ భూషణుడు. 5వ ముద్రణ.
మచిలీపట్నం : యం. శేషాచలం అండ్ కంపెనీ.

49. హనుమంతరావు, బి. ఎస్. ఎల్. 1994 : **భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన**
గుంటూరు : త్రిపుర సుందరి ప్రచురణలు
50. హనుమంతరావు, పొన్నెకంటి. 1990 : **మహాకవి ధూర్జటి కవిత్వము - వ్యక్తిత్వము**
గుంటూరు : స్వంత ప్రచురణలు

## ఆంగ్లం

51. Carves paul, 1972 : **Gospel of Buddha.**
TUCSON : Omen Communications Inc.
52. Cowell, E.B. (ed) 1982 : **Stories of the Buddha's former Births.**
NEW DELHI : Indological Publishers & Booksellers.
53. Ling Travor, 1973 : **The Buddha.**
LONDON : Temple smith.
54. **The Encyclopedio of Philosophy. Vol : 1&2**
(TheBuddhaTeachings) paul Edwards (ed)
NEWYORK : Macmillon Publishing co. India.

## వీడియో క్యాసెట్టు

55. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం రూపొందించిన **తెలుగు వెలుగు** **అనే వీడియో క్యాసెట్టు**లోని జ్ఞానానందకవి గారి పరిచయం.

